*Issued — 20-4-1955*






# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## WEDNESDAY, 3rd NOVEMBER, 1954

### VOLUME X—No. 3

*CONTENTS*



PRINTED FOR ANDHRA GOVERNMENT PRESS

BY GORDON PRESS, GUNTUR-2.

1954

PRICE, 6 annas

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

WEDNESDAY, 3rd November 1954.

The House met in the Assembly Chamber, Kurnool, at eleven of the clock, Mr Speaker (The Hon. Sri N. Venkatramaiya) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### STARRED QUESTIONS

#### BRIDGE ON THE PENNAR NEAR CHENNUR IN CUDDAPAH DISTRICT.

* 31. Q. Sri N. Sivarami Reddi :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether there is a proposal to construct a bridge on the Pennar near Chennur in Cuddapah District; and

(b) if so, when the work will be started ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—

(a) The answer is in the affirmative.

(b) It is expected that the work will be taken up shortly.

Sri N. Sivarami Reddi :—

అధ్యక్షా! ఈ బ్రిడ్జియొక్క అవసరం చాలా ఉందని, త్వరలోనే దానిని అమలుచేస్తామని మంత్రిగారు చెప్పడంవల్లనే విశదమవుతున్నది. కాని ప్రతి సంవత్సరం వరదలు రావడంవల్ల రాకపోకలకు ఇబ్బంది ఎక్కువవడం, ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు మొదలైనవి నెల్లూరు, గుంటూరులకు పోవలసినవి పోక వ్యాపారానికి ఇబ్బంది కలుగుతోంది. రైతాంగానికీ, వ్యాపారానికి విపరీతంగా నష్టం కలుగుతోంది. కాబట్టి త్వరలోనే దానియొక్క నిర్మాణం మొదలుపెట్టవలయును.

Mr. Speaker :—This is not a question.

Sri Pillalamarri Venkateswarlu :—ఈ బ్రిడ్జికి ఎంత ఖర్చు అవుతుందో చెప్పగలరా ?

The Hon. Sri N. Sanjeeva Reddi — నేను మొదటిసారి ఢిల్లీకి పోయినపుడు ఈ బ్రిడ్జి విషయమై 2, 3 సార్లు చెప్పాను. వెంటనే మొదలు పెడదామనుకొంటున్నాము. దానికి సంబంధించిన estimates వగైరా అన్నీ తయారైనాయి. ఇంక దానిని మొదలుపెట్టటమే తరువాయి. దీనిని వెంటనే మొదలుపెడతామని పత్రికలలో ప్రకటించాను. అది చూసే శివరామి రెడ్డిగారు - ఇది వారి జిల్లాకు సంబంధించినది కాబట్టి ఇది ప్రజాభిప్రాయంవల్ల జరిగిందని ప్రజలు అనుకుంటారేమో ననే ఉద్దేశ్యంతో ఈ ప్రశ్నను వేసినట్లుగా కన్పిస్తోంది. దానికి పెట్టే డబ్బు 24 లక్షల రూపాయలని అంచానా.

Sri Pillalamarri Venkateswarlu·—On a point of order ఇపుడు సంజీవరెడ్డిగారు—అసలు ఇంకొకరైతే point of order raise చేయకపోదును — ఈ విధమైనటువంటి సమాధానాన్ని పొరపాటుగా చెప్పలేదు, ఈ విధమైన జవాబు లివ్వటం మంత్రిగారికి అలవాటై పోయింది. వారు-ఏ విధంగా మాట్లాడినా మొత్తంమీద insinuation వస్తుంది. అందుచే ఆలాంటి replies ను, చెప్పించవద్దని, ఇపుడు వారు ఇచ్చిన reply ను withdraw చేయాలని, అది సరిగాలేదని నేను మీదృష్టికి తీసుకువస్తున్నాను.

Sri P. Narasimha Reddi :—త్వరలో ప్రారంభం చేస్తున్నామని చెప్పారు. ఎంతకాలంలో పూర్తి అవుతుంది ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—త్వరలోనే, ప్రారంభించి పూర్తి చేస్తాము.

SHARE OF ANDHRA STATE UNDER INCOME-TAX.

* 32. Q. Sri S. Vemiah :—Will the Hon. the Minister for Finance and Law be pleased to state the share of our State under income-tax in 1953-54 ?

3rd November 1954]

The Hon. Sri T. Viswanatham :—The amount actually adjusted to the credit of this State in the accounts of 1953–54 was Rs. 176.22 lakhs.

ఈ State accounts క్రింద 176 లక్షల, 22 వేలు జమకట్టడం జరిగింది.

Sri Pillalamarri Venkateswarlu —అసలు జమకట్టవలసినది మాత్రమే చెప్పారు. మనకు రావలసినదెంత ? మన share ఎంత ?

The Hon. Sri T. Viswanatham :—మనకు రావలసిందంతా కలిపి, 168 లక్షలు. మనం అనుకున్నది కూడా అంతే. అందుచేత జమకట్టవలసిన 176 లక్షల, 22 వేలకు జమకట్టడం అయినది.

APPLICANTS FOR EMPLOYMENT IN THE EMPLOYMENT EXCHANGES IN THE STATE.

* 33. Q. Sri K. Krishna Rao :—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state—

(a) the number of applicants for employment in the Employment Exchanges in the State, who were not provided with employment by the said exchanges as it stood on 1st April 1953 ,

(b) the number of persons who registered their names for employment in the Employment Exchanges in the State during the one year ending with 31st March 1954 ;

(c) the number of persons to whom employment was secured by the Employment Exchanges in the State during the one year ending with 31st March 1954 ;

(d) of the number of applicants for employment as could not be provided jobs and as it stood in the Register of Employment Exchanges in the State, as on 1st April 1954, the number of applicants, as are ;—

(1) Graduates in Arts, Science and Commerce ;

(2) Graduates in Medicine, Engineering and Law ;

(3) Persons as are diploma holders of Institutes of Technology run by the Government?

The Hon. Sri D. Sanjivayya :—

(a) 17, 812
(b) 63, 848
(c) 4, 597
(d) No details are available, Sir,

(a) 17, 812.
(b) 63, 848.
(c) 4, 597.
(d) భోగట్టా ప్రభుత్వందగ్గర లేదు.

Sri K. Krishna Rao :—ఈ విధంగా ఎక్కువమందికి, పని చూపించలేకపోవడం గుర్తించి వాళ్ళందరికి పని చూపించేందుకు ప్రభుత్వం ఏమి చేస్తోంది ?

The Hon. Sri D. Sanjivayya :— అన్ని విషయాలలోను చర్యలు తీసుకుంటోంది. తరువాత ఈ Employment Exchanges సంతృప్తికరంగా పనిచేయువనేటటువంటి విషయాన్ని భారత ప్రభుత్వం గుర్తించి ఈ విషయమై పరిశీలించడానికి ఒక సంఘాన్ని నియమించింది. ఆ సంఘం కూడా ఒక నివేదికను సమర్పించారు. ఆ నివేదికను భారత ప్రభుత్వం పరిశీలిస్తోంది.

Sri T. N. Venkatasubba Reddi :—Sir, these 'Employment Exchanges are asking the applicants for employment to come in person and tender their applications. This is causing great inconvenience to the very poor people who are applying for these appointments. May I request the Government to instruct the Employment Exchanges not to require the applicants to come in person to give the initial application ?

The Hon. Sri D. Sanjivayya :—ఒక్క శ్రీకాకుళం జిల్లాలో తప్ప, ప్రతి ఒక జిల్లా కేంద్రములో కూడా ఈ ఆఫీసు ఉంది. అది అంత inconvenient గా ఉంటుందని నేను అనుకోను. ఒకవేళ బీదలు మొదలైన వాళ్లు అక్కడికి, Employment Exchange కు వెళ్ళడానికి అవకాశం లేదని భారత ప్రభుత్వానికి తెలియపరచి, అవకాశం కల్పించుతాము.

3rd November 1954]

Sri P. Venkatasubbayya .—ఈ Employment Exchanges India Government అజ్మాయిషీ క్రింద పనిచేస్తున్నాయి. State Government అజ్మాయిషీ క్రిందకు తీసుకొంటారా ? తీసుకోనేటట్లైయితే ఎంతకాలం పడుతుంది ?

The Hon. Sri D. Sanjivayya :—ఈ విషయంలో భారత ప్రభుత్వంతో సంప్రతింపులు జరుగుతున్నాయి. ఇంతవరకు ఏమీ తేలలేదు.

Sri G. Yellamanda Reddi :—కేంద్రప్రభుత్వం ఈ విషయమై ఒక Experts Committee ని వేసింది, ఆ కమిటీ నివేదికను సమర్పించడం జరిగిందన్నారు కదా ? ఆ నివేదిక సారాంశం ఏమిటో చెబుతారా ?

The Hon. Sri D. Sanjivayya: —ఆ కమిటీని భారత ప్రభుత్వం నియమించింది. అందుచేత కేంద్ర ప్రభుత్వానికి ఆ నివేదిక సమర్పించ బడింది. దాని సారాంశం అడిగితే ఎలాగ ? కావాలి అంటేఆ రిపోర్టు కూడా తెప్పిస్తాము.

Sri K. Krishna Rao :—అయ్యా ! ఈ ప్రశ్నలో 'D' అనే భాగానికి ఏమీ సమాధానం ఈయనేలేదు. దానికి తగిన classifications ను పెట్టించడానికి ఇకముందైనా మీరు Employment Exchange వాళ్లను అడుగుతారా?

The Hon. Sri D. Sanjivayya :—అడుగుతామండి.

Sri T. Potha Raju :—అధ్యక్షా ! మన రాష్ట్రంలో నిరుద్యోగుల సంఖ్య విపరీతంగా పెరిగిపోతున్నట్లు కన్పిస్తున్నది. ఇప్పుడు రిజిష్టరు కాబడిన వారి సంఖ్య 17 వేలు. రిజిష్టరుకాని వారి సంఖ్యగురించి ప్రభుత్వానికి కాని ఇవతలవైపున ఉన్న మాకుకాని ఒక అంచనాలేదు. ఇపుడు కనీసం ఇక్కడ శాసనసభలో పాలించే పక్షం పదేపదే అనుసరించే, western democracy ని దృష్టిలో పెట్టుకొని నిరుద్యోగులకు భృతిని కల్పించడాని కైనా ప్రణాళికను ఇక్కడ ప్రవేశపెడుతారా ?

[3rd November 1954

The Hon. Sri D. Sanjivayya :—ఇది చాలా పెద్ద సమస్య. అది ఎసెంబ్లీలో ఆమోదించబడితే ఆవిధంగా పెట్టడానికి మాకేమీ అభ్యంతరం లేదు.

Sri H. Satyanarayana Dora :— శ్రీకాకుళం జిల్లాలో Employment Exchange Office లేదన్నారు. అయితే దానిని అక్కడ ఎప్పుడు పెట్టిస్తారు ?

The Hon. Sri D. Sanjivayya :—ఎప్పుడు పెడతారో తెలియదు. కాని, పెట్టాలనే ఆలోచన ఉంది.

Sri Pillalamarri Venkateswarlu —ఇందాక మంత్రిగారు సమాధానం చెపుతూ జిల్లాకు ఒక్కొక్క centre చొప్పున ఉన్నది, కనుక ఎక్కువ యిబ్బందిలేనట్లు చెప్పారు. కాని జిల్లా సెంటర్‌కు 100 మైళ్ల 150 మైళ్ళ దూరంలోనున్న ప్రదేశాలనుంచి కూడా కొంతమంది రావలసి వచ్చినపుడు, వారికి చాలా కష్టం కల్గుతుంది కాబట్టి application లు post ద్వారా పంపినా కూడా register చేసుకోవాలని ఉత్తర్వులు పంపిస్తారా ?

The Hon. Sri D. Sanjivayya :—I cannot help if the hon. Members shut their ears.

ఇంతకుముందుగా వెంకట సుబ్బారెడ్డిగారు వేసిన ఈవిధమైన ప్రశ్నకే సమాధానం యిచ్చాను. కాని ఆప్రశ్ననే మిత్రులు వెంకటేశ్వర్లుగారు ఎందుకు వేస్తున్నారో నాకు అర్థంకావడంలేదు.

Sri Pillalamarri Venkateswarlu :—వెంకట సుబ్బారెడ్డిగారు ప్రశ్న వేసినపుడు, దానికిసమాధానం, ఏదో ఆలోచిస్తామని చెప్పి, స్పష్టంగా చెప్పలేదు. (Interruption by The Hon. Sri D. Sanjivayya) Hear me! జిల్లాకు ఒక్కొక్క సెంటరు ఉన్నది కనుక ఈ అవసరం రాదు అని చెప్పారు. అందువల్ల జిల్లాలలో ఉన్న centre కు దూరంనుంచి వచ్చి application యివ్వటానికి కష్టంగా ఉంది. కాబట్టి Employment Exchange ఆఫీసులకు post ద్వారా వచ్చిన అప్లికేషన్లను register

చేసే పద్ధతిని గురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నదా అని అడిగాము. దానికే విచారిస్తున్నామని వారు ఎందుకంటున్నారో నాకు అర్థంకావడం లేదు.

Sri P. V. R Gajapathi Raju :—Government employs a number of people from time to time Is it the custom of the Government to utilize this employment agency for filling posts for menial jobs, for non-gazetted jobs and also for gazetted jobs? If that is not the case, to help this employment agency the Government should make it a point of being the main employer through its channels and thus help economy?

The Hon. Sri D. Sanjivayya :—We are making several categories of employment through Employment Exchanges. But often-times we have to go to Service Commission. In such cases, I don't think we are approaching Employment Exchanges.

Sri D. Dasaradharamaiah :— నిరుద్యోగుల భృతి విషయంలో ఈ Assembly ఆమోదిస్తే కలుగజేస్తాం అని మంత్రిగారు చెప్పారు. ప్రభుత్వం అటువంటి తీర్మానమేదైనా యీసభవారి ఆమోదమునకు ప్రవేశపెట్టనున్నదా ?

The Hon. Sri D. Sanjivayya :—అది తీసుకురావడానికి ముందు దానికి సంబంధించిన ఆర్థికస్తోమతు ప్రభుత్వానికి ఉందా ? లేకపోతే ఇతరత్రా కూడా డబ్బు సంపాదించే అవకాశాలు ఉన్నాయా ? ఇవన్నీ కూడా ఆలోచించాలి.

Sri C. V. K. Rao :— Service Commission ఎందుచేత ఈ Employment Exchanges ను గుర్తించకూడదు ? అవిధంగా ప్రభుత్వం ఏమైనా ఏర్పాటుచేస్తుందా ?

The Hon. Sri D. Sanjivayya :—ఆలోచిస్తాం.

Sri Vavilala Gopalakrishnaiah :—అయ్యా, క్రిందటి సమావేశంలో బడ్జెటు speech లో ఆర్థిక మంత్రిగారు unemployment

[3rd November 1954

insurance scheme ను ఆలోచిస్తున్నాం అన్నారు. ఆ ఆలోచన పూర్తి అయిందాండి ?

The Hon. Sri D. Sanjivayya :—ఆయన చెప్పినారో లేదో నాకు తెలియదు. చెప్తే ఆయనే సమాధానం ఇస్తారు.

STATE ADVISORY COMMITTEE OF THE NATIONAL CADET CORPS FOR ANDHRA.

* 34. Q. Sri T. Lakshminarayana Reddi :—Will the Hon. the Minister for Education and Industries be pleased to state whether the Andhra Government was consulted by the Government of India in appointing the State Advisory Committee of the National Cadet Corps for Andhra?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—

Yes Sir,

The State Advisory Committee of National Cadet Corps for the Andhra State was constituted by the Government of India on the recommendation of the Sate Government.

అవునండి.

ఆంధ్రదేశంలో నేషనల్ కేడెట్ కోరుయొక్క సలహా సంఘాన్ని ఆంధ్ర ప్రభుత్వ సూచన ప్రకారం కేంద్ర ప్రభుత్వం constitute చేసింది.

Sri T. Nagi Reddi :—ఆంధ్ర ప్రభుత్వం సూచించిన పేర్లు ఏవి ? ఇండియా గవర్నమెంట్ వారు appoint చేసిన వారి పేర్లు ఏవి ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—ఆంధ్ర ప్రభుత్వం సూచించిన పేర్లు అన్నీ కేంద్ర ప్రభుత్వం ఒప్పుకొన్నది.

Sri T. Nagi Reddi :—ఆ పేర్లు ఏవి ?

3rd November 1954]

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—ఇదివరకు ఇచ్చినవే కావాలంటే చదువుతాను వినండి—

| | |
|---|---|
| Chairman : | Education Minister. |
| Member : | Secretary to Education Department of the State. |
| ,, | Vice Chancellor, Andhra University. |
| ,, | Director of Public Instruction. |
| ,, | Lt. Col. S. S Chowdary of General Head-quarters Hospital, Madras, Madras area. |
| ,, | Sri A. S. Thyagarajan, Principal, P. R. Government College, Kakinada. |
| ,, | Sri T. Suryaprakasam, M. A, L. T., Head-Master, Hindu College High School, Guntur. |
| ,, | Sri M. C. Seshachallam, Headmaster, Board High School, Chittoor. |
| ,, | Wing Commander C. Satyanarayana, Commander No. 2 Circle, N. C. C. Madras. |
| ,, | Capt. K. Perraju of Kakinada. |
| ,, | Sri C. Anna Rao, B. A., Executive Officer, Tirupati Tirumalai Devastanams, Tirupati. |
| ,, | Smt. C. Ammannaraja, B. A., L. T., ex-Deputy Speaker, Madras Lagislative Assembly. |
| ,, | Deputy Secretary Government of Andhra Finance Department. |
| ,, | Deputy Director of Public Instruction Secretary of the Committee. |

Sri T. Lakshminarayana Reddi:— ఈ నేషనల్ కేడెట్ కోరును మన Colleges లోనే కాకుండా Secondary Schoolsలో కూడా ప్రవేశ పెట్టడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—Secondary Schools లో కూడా ఇదివరకే కొన్ని చోట్ల ఉన్నాయి. దీన్ని extend చేయటానికి ప్రయత్నం చేస్తాం.

Sri Vavilala Gopalakrishnaiah:— ఆ కమిటీలో Present Deputy Speaker ఉండగా ex-Deputy Speaker ని ఎందుకు వేశారండి ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:— మాకు ఆ సలహా రాలేదండీ. (నవ్వు)

Sri T. Nagi Reddi:—ఉన్నవారిలో ఒకే ఒక్క lady member ఉన్నట్లుంది. Select చేసినప్పుడు స్త్రీలు అందరికి ప్రాతినిధ్యం వహించే Committee ని సంప్రదించే చేశారా ? లేక National Cadet Corps లో ఆమె ఉపయోగపడుతుందంటె, ఏవిధంగా ఉపయోగ పడుతుందని చేశారు ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—ఆమె గతంలో గడించిన అనుభవాన్ని బట్టి. (సభలో నవ్వులు).

PUBLIC EXAMINATIONS OF HIGHER, SECONDARY GRADE TRAINING CLASSES AND E. S. L. C.

*333 Q.—Sri G. Yellamanda Reddi:—Will the Hon. the Minister for Education and Industries be pleased to state—

(a) Whether the candidates, who sit for the Public Examinations of Higher Secondary Grade Training classes and E. S. L. C. are given their marks, if they fail;

(b) if not, the reasons therefor; and

(c) whether the Government will be pleased to give their marks?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—(a) The answer is in the negative.

(b) and (c) The additional work involved in this procedure is not commensurate with the advantage that may be derived at.

(ఎ)—లేదు.

(బి) మరియు (సి) ఇందులో ఉన్నటువంటి అధిక శ్రమ దానివల్ల కలిగే ఉపయోగానికి తగినట్లుగా కనిపించడం లేదు.

3rd November 1954]

Sri M. Hanumantha Rao:—ఇందులో కొంత అధికశ్రమ ఉన్న మాట వాస్తవం కావచ్చు. కాని మార్కులు వేసి ఉంటాయి. ఖచ్చితంగా అవి తెలుసు. వాళ్ల లిస్టులుకూడా ఉంటాయి. కాని తప్పిపోయిన విద్యార్థులు వాళ్లకు దేనిలో తక్కువ వచ్చినవో, వాళ్లు మళ్లీ దేనిలో ఎక్కువ శ్రద్ధగా చదువుకోవాలో ఆ దృష్ట్యా చూస్తే చాలా అవసరం. అందుచేత వాళ్లకు మార్కులు అందచేయడానికి పూనుకుంటారా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—దానికి సంబంధించిన భాగాన్ని నేను చదువుతాను. కొంచెం తమరు అర్థం చేసుకుంటే అర్థం అవుతుంది.

For 1954 examination, 11,677 candidates have appeared for the several grades of T. S. L. C. and 16,784 candidates have appeared for E. S. L. C. examination. Calculated on the basis of percentage of passes for 1953, it is estimated that if marks are to be communicated to failed candidates, communications have to be sent to about 5,800 candidates of T. S. L. C. examination and about 9,200 candidates of E. S. L. C. examination This involves a lot of additional work in the office of the Commissioner for Government Examinations, particularly at a time when the office is heavily worked in connection with the publication of results of these Examinations including the S. S. L. C. Examination. That is the position and it involves not merely work, but work means money, also Sir.

Sri T. Nagi Reddi:—రాను రాను స్కూల్లో ఉన్న విద్యార్థుల నుంచి పరీక్షలకు appear అవుతున్న విద్యార్థులనుంచికూడా ఎక్కువగా డబ్బు వసూలుచేయడం అనేది మనకు అలవాటు అయిందికదా ! అందుచేత ఎక్కువ డబ్బు వసూలు చేస్తున్నాం అనే కారణంచేత అయినా విద్యార్థులకు వీటన్నిటిని పంపిస్తే సౌకర్యంగా ఉంటుంది. దాన్ని తిరిగి ప్రభుత్వం పునరాలోచిస్తుందా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—ఎక్కువగా ఫీజు వసూలు చేయడంలేదు. ఎక్కువగా వసూలుచేస్తే ప్రతిపక్ష నాయకులు ఉన్నారు. దాన్ని సమర్థించడానికి కాదు. పనిబట్టి ఆవసిని ఖర్చం తీసుకోవలసిన additional staff కు కావలసిన remune-

ration మాత్రమే హెచ్చు చేస్తున్నారు. కాని హెచ్చు చేయాలని ప్రభుత్వ ఉద్దేశ్యం కాదు. హెచ్చు చేయడం ప్రభుత్వానికి సరదాకాదు. కాకపోతే ఈ పనులు అన్నీ ఇంకా హెచ్చుచేస్తే వారు భరించగలరా అని నా అనుమానం.

### ALLOTMENT OF BULL DOZERS AND TRACTORS TO THE ANDHRA STATE

*227 Q.–Sri S. Vemiah:—Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state the number of bull dozers and tractors allotted to the State by the Centre during 1954?

The Hon. Sri P. Thimma Reddi:— Nil.

కేంద్ర ప్రభుత్వంనుంచి 1954 కు మన రాష్ట్రానికి బుల్ డోజరులు గాని ట్రాక్టర్లుగాని ప్రత్యేకంగా ఏమీకూడా కేటాయించబడలేదు.

Sri S. Vemiah:— కొన్ని రాష్ట్రాలకు కేంద్ర ప్రభుత్వము కేటాయించినట్లుగా పత్రికలలో చూచాము. మన ప్రభుత్వము వారు కోరనందువల్ల వారు కేటాయించలేదా ? లేకపోతే కేంద్ర ప్రభుత్వమువారే నిరాకరించారా ?

The Hon. Sri P. Thimma Reddi:—కేంద్ర ప్రభుత్వము కొన్ని ప్రాంతాలను బాగుపరచేందుకు tractors ను, bull-dozers ను యిచ్చింది. కాని వాటికయ్యే ఖర్చులు లెక్కచూచినట్లైతే, మామూలుగా tractors కు bull-dozers కు భూమిని చదరుబర్చడానికయ్యేంత ఖర్చుకు రెండింతలు ఖర్చు అవుతూంటే, వారేదో కొంత సంప్రదింపులు జరిపి, యివి యెక్కువ దుబారా ఖర్చు అవుతుందని, యివ్వాళ Centre నుంచి, tractors గాని, bull-dozers గాని తీసుకోలేదు.

Sri K. Ramayya Chowdary:—ఈ bull-dozers rate విషయంలో, గంటకు రు. 10/- లు, రు. 12/- లు రేటు నిర్ణయించింది. కాని యీ రేటు నిర్ణయించటం, భూములనుబట్టి, నిర్ణయించినట్లయితే, బాగుం[illegible]. యిసుక ప్రాంతాలలో సులభంగా అవుతుందని, మెట్ట [illegible]లో వుండే భూములలో యెక్కువ అవుతుందని, అందువల్ల

3rd November 1954]

భూమినిబట్టి, భూమియొక్క Capacity ని బట్టి నిర్ణయిస్తారా ? అని అడుగుతున్నాను.

The Hon. Sri P. Thimma Reddi:—ఏ భూమికైనా, గంటకు యింత అని charge చేస్తున్నారు. కొంచెము సులభంగా వుండే భూములను చదునుగా చేయుటకు రెండు యెకరాలు అయితే కొంచెం కష్టంగా వున్నదానికి అర్ధ యెకరం కావచ్చు. దీనికి ప్రభుత్వము నిర్ణయించివుండిన రేట్ల ప్రకారం, కొంతనష్టం వచ్చినా కొంచెము తగ్గించే యిస్తున్నారు. ఇంకా తగ్గించి, యివ్వాలంటే కష్టం.

Sri K. Govinda Rao:—ప్రభుత్వం మన ప్రాంతాలలో యీనాడు supply చేసే tractors, bull-dozers స్థానికంగా అవసరానికి చాలా తక్కువగా వున్నాయి. అటువంటి ప్రాంతాలకు, తిరిగి ఆంధ్ర ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వమును అడిగి, మరికొన్ని tractors ను bull-dozers ను తెప్పించడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri P. Thimma Reddi:—ప్రయత్నం చేయకూడదని కాదు. కాని ప్రభుత్వంద్వారా నడిచేటటువంటి tractors, bull-dozers వల్ల కావలసినదానికంటె, చాలా యెక్కువ ఖర్చులు అవుతోంది. అది ప్రత్యేకమైన నష్టం యేమో అని అనుకొంటునట్లుగా కనబడుతోంది. అందువల్ల కేంద్రంనుంచి, కావలసిన డబ్బు తెప్పించి, private societies కుగాని వ్యక్తులకుగాని డబ్బు తెప్పించి యిస్తున్నాము.

Sri T. Nagi Reddi:—ఈ సంవత్సరంలో యెంతడబ్బు తెప్పించి యిచ్చారు ? యెంతమంది వ్యక్తులకు యిచ్చారు ? తెలియ జేస్తారా ?

The Hon. Sri P. Thimma Reddi:—లెక్కల్లో వున్నాయి. అదికూడ ప్రశ్నలో వుండివుంటే చదివి వుండేవాడిని. ఈ 1953-54 వ సంవత్సరములో రు. 6,81,000 లు యివ్వబడింది. అది 39 మంది రైతులకు యివ్వబడింది. 1954-55వ సంవత్సరములో రు. 10,00,000 లు, 80 మందికి యివ్వబడింది. మరి రు. 15,00,000 లకు వ్రాశాము.

[3rd November 1954

Sri K. Subba Reddi:—మన రాష్ట్రంలో యెన్ని bull-dozers వున్నాయి. ఇంతవరకు తుంగభద్ర ఆయకట్టుకు పంపించిన bull-dozers ద్వారా యెంతపని సాగించినది ?

The Hon. Sri P. Thimma Reddi:—మనకు వుండిన bull-dozers, tractors, కలసి మొత్తం 136 వున్నాయి. వాటిలో 75 bull-dozers మిగతావి tractors. తుంగభద్రకు పంపినవి 21 tractors, 18 bull dozers. పంపిన వాటిలో ముప్పాతిక, మువ్వీసము కదలలేని పరిస్థితిలో వున్నాయి. అక్కడకు వెళ్ళిపోయిన తరువాత, repairs చేశారు. అవి పనిచేసేందుకు సిద్ధంగా వున్నవి. తుంగభధ కాలువలో యివి యెంత పనిచేసినాయంటే, యివి పోయేటప్పటికి, అవన్నీ sick గా వచ్చినవి. Spare parts కు ప్రయత్నించి, వాటిని repair చేయటం జరిగింది. దాదాపు 1500 యెకరాలు మాత్రమే పని జరిగింది. ఇంతలో వర్షాకాలం వచ్చింది. పైర్లు పెట్టినారు. కాబట్టి, యింక జరుగవలసినది, December తరువాతనే.

Sri C. Subbarayudu :—ఈ tractors కాని, bull dozers కాని నడిపేటటువంటి drivers ను అంతాకూడా, యే qualifications గాని అనుభవంగాని లేనివారిని పెట్టటంవల్ల మరి యివి తరుచుగా repairs కు కూడా పోతున్నాయి. అందువల్ల రాష్ట్రంలో వుండేటటువంటి, ప్రతి జిల్లా [illegible], సగానికి సగం అక్కడక్కడ స్థానికంగా మూలపడి వుంటున్నాయి. అందువల్ల అక్కడక్కడ స్థానికంగా workshops పెట్టి, వాటిని repair చేయడానికి, ప్రభుత్వము పూనుకుంటుందా?

The Hon. Sri P. Thimma Reddi :—మొదటనే మనవిచేసినాను. అవి ప్రభుత్వమే నడిపేటట్టుగా వుంటే, యెక్కువ దుబారాఖర్చులు [illegible] ప్రభుత్వము అనుభవంమీద తెలిసిన విషయంగా వున్నది. వారు French leave సంపాదించు కొనేందుకు యిట్లాంటి విషయాలలో అవి [illegible] చేయటం జరుగుతున్నాయి. వాటిని గురించి, పట్టుకోవటం [illegible] [illegible] యింకా పరిశీలం జరిగింది. వుండే drivers [illegible] పనిచేస్తున్నారు [illegible] చేస్తున్నాను.

3rd November 1954]

Sri T. Nagi Reddi :—మనం 17 లక్షలవరకు tractors bull-dozers కొనడానికి డబ్బు ఖర్చుచేసినట్లుగా మంత్రిగారు యిచ్చిన లెక్కలను బట్టి తెలిసినది. ఇది రైతులకు డబ్బుగా ఇచ్చారా లేక tractors ను కొని ఇచ్చారా?

The Hon. Sri P.Thimma Reddi:—ఇవి ప్రభుత్వమే కొనియిచ్చినట్లైతే, కొన్ని నిందలకు ఆస్పదం అవుతుందనే వుద్దేశ్యముతో యీ డబ్బుతో వాళ్ళు యేరకమైన engine గాని, యెక్కడైనా గాని కొనుక్కోవచ్చునని డబ్బే ఇవ్వడం జరిగింది. కంపెనీనుంచి ఫలానా machine యింతకు కొన్నామని చెప్పి, కంపెనీనుంచి రశీదు Director of Agriculture కు పంపితే వారికి ఆడబ్బు యివ్వడం జరుగుతుంది.

Sri K. Veeranna Padal :—Scheduled area లో agency ప్రజలు చాలా బీదవాళ్ళు. అటువంటి ప్రజలకు భూములను tractors bull-dozers తో మరమత్తు చేసుకొనడానికి, సిద్ధంగా లేదనకుండా, ఉచితంగా supply చేస్తారా ప్రభుత్వము?

The Hon. Sri P. Thimma Reddi:—అవన్నీ ప్రత్యేకంగా విశ్వనాధంగారు చూస్తున్నారు. క్రొత్తగా tractors యేమీకొనట్లు తెలిసింది. కాని, అది నాశాఖక్రింద నిర్వహింప బడటంలేదు.

Sri R. Siddanna Gowd:—ఖాళీగావున్నడే bull-dozers యెన్ని sick గా వున్నాయి? ఎన్ని parts లేకుండా నిరుపయోగంగా వున్నాయి?

The Hon. Sri P. Thimma Reddi:—అది అనుకున్నప్పుడల్లా sick గా నిల్చిపోతూంటాయి. కాని అటువంటి వాటికి జబ్బునయం చేయటంకూడా జరుగుతోంది. parts పోయినప్పుడు అప్పు డప్పుడు సమయాన్ని బట్టి వాటికి జబ్బువస్తూవుంటుంది. ఇవి యేదినం sick గావుంటాయి? యేదినం ఆరోగ్యంగావుంటాయి అనేది యిక్కడ లెక్కచెప్పటం కష్టం.

Sri M. Veerabhadram :—అధ్యక్షా ! క్రిందటి సంవత్సరము 1953-54 లో 29 గురికి, 1954-55 లో 30 మందికి, మొత్తం 17 లక్షల సహాయములు యిచ్చామన్నారు. ఇది యెవరికి యెంతెంత యిచ్చారో వివరాలు తెలియజేస్తారా?

[3rd November 1954

The Hon. Sri P. Thimma Reddi :—ఆ వివరాల కేమండి, వివరాలకు వేరుగా ప్రత్యేకమైన ప్రశ్న వేస్తే, ప్రత్యేకంగా పేర్లతో వివరాలు యిస్తాను.

RECORDING OF PATTA TRANSFERS IN VILLAGE ACCOUNTS

* 313 Q.–Sri V. Rama Rao:—Will the Hon. the Minister for Land Revenue be pleased to state whether there is any specific period of time in which a patta transfer should be recorded in Village Accounts after the registration of the transaction?

The Hon. Sri K. Koti Reddi :—There is no provision in the present rules requiring that patta transfer should be recorded in Village Accounts within a specified period of time after the registration of the transaction. The Village Karanam records the changes of patta transfers in the Village Acounts as soon as the procedure in that regard is completed and orders are received by him from the Revenue officers. At the time of the Jamabandi, however, the Jamabandi officer scrutinises the Taluk Accounts in order to see that the provisions of Standing Orders have been correctly followed, that there has been no undue delay in disposal and that registers have been properly kept.

లేదండి.

Sri V. Rama Rao :—ఈపట్టా transfer విషయమై ముఖ్యంగా timelimit లేకపోవటంవల్ల యీ transaction 10, 15 సం॥ అయినప్పటికి యెక్కడా మారటంలేదు. చాలామంది చనిపోయినటువంటి వారి పేర పట్టాలు చలామణి అవుతున్నాయి కాని వారి మనుమల పేరగా transfers అవటంలేదు. దీనివల్ల చాలా యిబ్బందులు వస్తున్నాయి. అందువల్ల, దీని విషయంలో time-limit పెట్టి, యింత period లోగా చేయ్యాలని specific period పెట్టే ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri K. Koti Reddi:—ఒకటిమాత్రం ఒప్పుకుంటాను. [illegible] చచ్చినవారిపేర్లలో పట్టాలున్నాయి. కొన్ని సంవత్సరాలుగా

అట్లా యేమీ జరగటంలేదు. Registrar's Office కు పోతూనే Registrar దగ్గరనే అమ్మేవాడూ, తీసుకునేవాడు, యిద్దరూ applications పెట్టుకోవాలని వుంది. అప్పుడు వాటిని Tahsildars కు పంపిస్తారు. Tahsildars త్వరగా వుత్తర్వులువేసి, కరణాలకు పంపిస్తారు. ఒకవేళ వారుకూడా patta transfers వొప్పుకోము, తీసుకోము అంటేకూడా, అది register చేసి పంపవలెనని ఒక rule వుంది. పిమ్మట జమాబందిలో యేదయినా ఆలస్యం అవుతూంటే దానిని సరి చేస్తాము. ఇది యిప్పుడు జరిగేపని. కాని, మీరు చెప్పినట్లు యీ లోపాలు యేమీ వుండవనే నా నమ్మకం. ఏదైనా ఒకటి రెండు instances నా దగ్గరకు తీసుకువస్తే, వాళ్ళను కొంచెం మందలించవచ్చు. ఆ విధంగా కొంత సహాయం చేసినట్లుగా అవుతుంది.

Sri T. N. Venkatasubba Reddi :—అయ్యా! గౌరవనీయులైన మంత్రిగారు చెప్పినట్లు, Registrars' Office లో అమ్మేవారు, తీసుకునేవారు transfers applications యిచ్చేది వాస్తవమే కాని, యివి గ్రామాలకు పోతేమాత్రం గ్రామోద్యోగులు patta transfers యిచ్చేదిలేదు. ఇప్పుడు ప్రత్యేకంగా రు. 10/- లోపు శిస్తు తొలగించి నందువల్ల, రైతు శిస్తుకట్టితే వున్న ఋజువులేకుండా పోతోంది, కాబట్టి తక్షణమే, ఒక authentic ఋజువు వుండేటట్లుగా ఫలానా ఆస్థి ఫలానావారిదని చెప్పగలిగేటటువంటి ఒక విధానము కనిపెడుతేనే తప్ప, లేకపోతే కక్షలు చాలా పెరిగి పోతాయని ప్రభుత్వం దృష్టికి తేవచ్చునా?

The Hon. Sri K. Koti Reddi :—పట్టాలు మార్చేది అవసరము. ఇందులో మీరు చెప్పినట్లు joint pattas వున్నవి. ఆ joint pattas ను single pattas గా మార్చవలసి వున్నది. దీని విషయం గూర్చి త్వరగా మార్పు చేయవలెనని instructions యివ్వవలెనని అనుకొన్నాను. తప్పకుండా ఆ విధంగా చేస్తాను.

[3rd November 1954

AUCTION OF BUS ROUTES IN THE STATE

*192.Q–Sri S. Vemiah:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether there are proposals with the Government to auction the bus routes in the State?

The Hon. Sri N. Sanjeeva Reddi:—The answer is in the negative.

Sri S. Vemiah:—ఈ ప్రశ్నలో సూచించిన ప్రకారము ప్రభుత్వమువారు వేలాలువేస్తే ఎక్కువడబ్బు వస్తుందనే దానిని గురించి ఏమైనా ఆలోచిస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi.—అప్పుడే ఈప్రశ్న మద్రాసురాష్ట్రి ప్రభుత్వమువారు సమగ్రంగా ఆలోచించినారు. వేలమువేస్తే డబ్బు కొద్ది అధికం రావచ్చును. హెచ్చుగాకాదు. కాని చాలా ఇబ్బందులు వున్నాయి. ఇందులో కొందరు మోనాపలీ చేసుకొని ప్రజలను చాలా ఇబ్బందుల్లో పెట్టడం అవుతుంది. తరువాత 10, 12 బస్సులను వేస్తామని చెప్పినా గట్టిగా 1, 2 మాత్రం నడిపి ఇబ్బందులు కలిగించే విషయాలు చాలా వున్నాయి. దీన్ని గురించి బాగా పరీక్ష చేశారు. నేనుకూడా బాగుందేమో ననుకొన్నాను. తరువాత పరీక్ష చేయించాము. దానివల్ల యిబ్బందులు ఎక్కువగా కలుగుతున్నాయి. కొద్దిగా లాభము రావచ్చును గాని, చాలా ఇబ్బందులు కలుగుతాయి కనుక ప్రజల శ్రేయస్సును దృష్టిలో వుంచుకోమ్మని మనవి చేస్తున్నాను.

Sri G. C. Kondayya:—ఇప్పుడు నెల్లూరునుంచి కర్నూలు రావలయును అంటే ఒకరూటు 400 మైళ్ళ చిల్లర, ఒకరూటు 300 మైళ్ళ చిల్లర ఉన్నాయి. బస్సు వేసినట్లయితే 200 మైళ్లలో అది సరిపోతుంది. అది ఏమైనా **proposal** వుందా? **Straight** గా సర్వీసు నడుపుతారా?

**The Hon. Sri N. Sanjeeva Reddi:**— వారు అన్నట్లు డైరక్టు బస్సు నడపడానికి ఎవరికైనా సాధ్యమైతే ప్రభుత్వానికి [illegible] అభ్యంతరం లేదు. నడుపుకోడానికి పర్మిషను ఇస్తాము.

3rd November 1954]

ఎవరైనా ఇంతదూరము, 200 మైళ్లు బస్సులను నడుపుతాము అనేవాళ్లు కావాలి.

Sri B. Sankarayya:—ఈ బస్సు రూట్లు వేలము వేసినట్లయితే ప్రభుత్వానికి హెచ్చు డబ్బు వస్తుంది. కాని దీనివల్ల monopoly ఏర్పడుతుంది అన్నారు. ఇప్పుడుకూడా ఆ విధంగా ఏమైనా మోనాపలి ఏర్పడి వున్నదా? అటువంటిది ఏర్పడకుండా ప్రభుత్వము ఏమి చర్యలు తీసుకుంటోంది?

The Hon. Sri N. Sanjeeva Reddi:—ఇప్పుడు మోనాపోలీ అంటే ఒకరికి చాలా బస్సులు వుండవచ్చునుగాని ఒకరూటు అంతా ఒకరే మోనాపోలీ చేసినది మాత్రము లేదని అంటున్నాను. కాని నెల్లూరులో ఎక్కువగా మోనాపోలీ వున్నట్లుందిచూస్తే. ఇకమీదట రూటులో కాళీ వచ్చినప్పుడు ఒకరికే యివ్వకుండా క్రొత్తవారికి యివ్వడానికి general instructions ఇస్తాము.

Sri Pragada Kotaiah.—అధ్యక్షా! ఈనాడు ప్రభుత్వమువారు అవలంభిస్తున్న విధానమువల్ల, అది ఒకేరూటు కావచ్చును, పలురూట్లు కావచ్చును. పెట్టుబడిదారీ విధానాన్ని ప్రోత్సహించడం జరుగుతున్నది. కాబట్టి ఒకరికి ఏ ఒక్క రూటు లోకాని 4, 5 బస్సులకంటె మించకుండా వుండే విధానము అమలు జరిపేదానికి ప్రయత్నము చేసి ఇతరులకు అవకాశము కల్పిస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi:—అటువంటి ఆపరేటర్సు కొన్ని జిల్లాలలోమాత్రమే వున్నారు. వాళ్లు చాలా ఏళ్లుగావుండి కొన్నికొన్ని రూట్లు సంపాదించుకున్నారు. చాలా efficient గా run చేస్తున్నారు. 10 బస్సులు పెట్టుకున్నవారికంటె, 1, 2 బస్సులు పెట్టుకున్నవారికి ఎక్కువ ఖర్చులు పెట్టడానికి వీలౌతుందా అని భయంతో ఆలోచిస్తున్నాను. దాని వల్ల ఇబ్బందులు ఎక్కువ వున్నాయి. ఈ మోనాపోలీ లేకుండా చేయు

[3rd November 1954

డానికి సాధ్యంకాదు. కనీసము మార్పులుచేస్తేకూడ కొన్ని అల్లరులు వస్తాయి. ఎక్కువ బస్సులు లేకుండా అప్పర్ లిమిట్ ఏదైనా నిర్ణయించ వచ్చును. దానిని తప్పకుండా ఆలోచిస్తాను.

Sri P. Pundarikashacharyulu —మహారాష్ట్ర ప్రభుత్వం మోటారు ట్రాన్స్‌పోర్టును జాతీయం చేయడము ఏమైనాజరిగిందా? లేకపోతే ఎందుకు జరుగలేదు?

The Hon. Sri N Sajeeva Reddi.—ఈ ప్రశ్నకూడా ఆలోచించాను. నేషనలైజేషను ఆఫ్ మోటారు ట్రాన్సుపోర్టువల్ల లాభము వస్తుందా అనేదైనా ఆలోచన చేస్తాము. కాని దురదృష్టవశాత్తు మనకు మద్రాసులాంటి పట్టణము లేకపోవడమువల్ల నిర్వహణ తేలికకాదు. ఒక లాంగ్ రూట్ పెడతామనుకోండి. గుంటూరునుండి కర్నూలుకు ఒక రూట్ పెడతాము. చెక్కింగ్ చాలా కష్టమౌతుంది. వసూలు అయి నడబ్బు ప్రభుత్వానికి చేరకుండా పోతుంది. మనము బస్సులు నడిపేందుకు కోటి రూపాయలు కావాలి. అంత డబ్బు మనము యిటువంటి సమయంలో ఖర్చు చేయలేము. అందువల్ల ఇప్పుడు దానిని మానివేశాము.

BUDGET FIGURES IN THE ENSUING SESSION.

*630 Q—Sri S. Vemiah:—Will the Hon. the Minister for Finance and Law be pleased to state whether the Government propose to prepare budget figures in the ensuing session, "District-wise"?

The Hon. Sri T. Viswanatham:—No, Sir.

. లేదు అని జవాబు. కారణాలుకూడా ముందుగానే చెబుతున్నాను. Financial transactions విషయంలో రెవెన్యూ జిల్లాలను యూనిట్లుగా తీసుకోవడంలో కొన్ని ఇబ్బందు లున్నాయి. P. W. D. తీసుకుంటే ఒక Division లో ఎన్నో జిల్లాలు కలసి వుంటాయి. అలాగే ఫారెస్టు డిపార్టుమెంటులో హెచ్చుగా jurisdiction ఉంటుంది. ఫారెస్టులనుబట్టి [illegible]ంటుంది. అలాగే రీజనల్ ఆఫీసర్లు వుంటారు. వాళ్లకు jurisdiction

ఎక్కువగా వుంటుంది. అంతేకాక సెంటరునుంచి వచ్చేడబ్బు ఎంతోవుంది. అది గ్రాంటురూపంలో వస్తుంది. అది జిల్లాలవారీగా చెర్చటం కష్టము. ఇవి కొన్ని కారణాలు అనుకోండి. జిల్లాలవారీగా బడ్జెటు అంచనాలు తయారుచేయడం కొంచెము కష్టము. ముఖ్యాన కారణాలు అన్నీ మీకు చెప్పాను.

APPLICATION FOR THE ELECTRIFICATION OF THE GOVERNMENT HOSPITAL, MADANAPALLI

* 39. Q. Sri D. Seetharamaiah —Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state-

(a) Whether the Director of Medical Services has received any application during the first week of May, 1954 from the local M. L. A. for the electrification of the Government Hospital, Madanapalli;

(b) if so, the action taken thereon; and

(c) Whether the district Medical Officer, Chittoor, has recommended the above scheme?

The Hon. Sri D. Sanjivayya:—

(a) Undoubtedly the member is aware of the facts of the case as it is understood that he himself wrote to the Director of Medical Services but apparently forgot to sign his letter.

(b) and (c), Plans and Estimates for the Electrification of the Government Hospital at Madanapalle have been prepared and the matter is under consideration of the Government.

ఈ ప్రశ్న వేసినటువంటి గౌరవనీయ సభ్యులకు కారణము తెలుసు. ఎందుకు అంటే వారే సరాసరి వైద్యశాఖా వున్నతోద్యోగస్థుల వద్దకు వెళ్లి విన్నపము, విజ్ఞాపన చేసినారు. కాని అందులో వారు సంతకము పెట్టడము మరచిపోయినారు. తరువాత వాటికి సంబంధించినటువంటి అన్ని లెక్కలుకూడా సేకరించబడినాయి. త్వరలోనే అక్కడ పని ప్రారంభమౌతుంది.

Sri T. Nagi Reddi:—లెక్కలు సేకరించామన్నారు, లెక్కలు కూడా చెప్పితే వుపయోగపడుతుందేమో ఎట్లా ఖర్చుపెట్టదలచుకున్నారు?

[3rd November 1954

The Hon. Sri D. Sanjivayya:—దీనికి సంబంధించిన main files P. W. D. నుంచి, అక్కడక్కడ తిరుగుతున్నాయి. అందువల్ల దానికి సంబంధించిన details చెప్పలేను.

CESS FUND FOR THE DEVELOPMENT OF HANDLOOM INDUSTRY.

*40. Q.-Sri N. Sivarami Reddi.—Will the Hon. the Minister for Education and Industries be pleased to state how the amount under Cess Fund for the development of Handloom Industry allotted to this State is being spent?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—The Cess Fund allotted to this State for the development of handloom industry is being utilised on the various schemes formulated by this Government and approved by the Government of India. The main schemes on which the amount is spent at present by way of grants and loans are briefly the following:

(1) Bringing new weavers within the co-operative fold.

(2) Expansion of the organiation of the State Co-operative Society, for internal marketing and propaganda for sale of handloom cloth.

(3) Research for improvement in designs and better technique.

(4) Subsidy for cushioning the sales of handloom cloth.

Sri N. Sivarami Reddi:—మంత్రిగారు ఒక్కొక్క item కు ఎంత ఖర్చుపెడుతున్నారో వివరాలు ఇచ్చేస్తే బాగుంటుంది. కాని నాకు తెలిసినటువంటి సమాచారాన్ని బట్టి ఇప్పుడు క్రొత్త మెంబర్లను చేర్చుకొనే విషయంలో చాలా మార్పులు చేశారని తెలుస్తోంది. ఇప్పుడు సహకార సంఘాల వెలుపల 2 లక్షలు వున్నాయి. వాటిని తీసుకురావడానికి మూడు లక్షల ఎంతో చిల్లర ఖర్చుపెడుతున్నట్లువుంది. పైగా ఇప్పుడు క్రొత్తగా సొసైటీల రిజిస్టరులు చేయాలంటే 100 మెంబర్లు కనీసము చేరితే చేయడము జరుగుతుంది. ఏరియా కోఆపరేటివ్ సొసైటీలో ఈ నిబంధనబట్టి సొసైటీలుగా తీసుకోడానికి అవకాశము లేకుండాపోతోంది. కాబట్టి దీనినిగురించి మంత్రిగారు ఆలోచిస్తారా ?

3rd November 1954]

The Hon. Sri S B P. Pattabhirama Rao:—వారు చెప్పి నటువంటిది సరియైనదిగా కన్పించడములేదు. అవి చేర్చడానికి అవసరమైన వసతులు ఏర్పరుస్తారు. కో-ఆపరేటివ్ సొసైటీ స్కీము అట్రాక్టివ్‌గా వుండనిచెప్పి మనవి చేస్తున్నాను.

Sri B. Sankarayya:—ఈ సెస్సు ఫండు ఉపయోగపడలేదు. చేనేత పారిశ్రామికులకు నిజముగా అందేదానికి కనీస మజూరి నిర్ణయించి అనేకమందికి లభ్యమయేటట్లు చేసేదానికి ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకుంటుందా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—ఆలోచన చేస్తామండి.

Sri S. Narayanappa:—సొసైటీలలో కాతాగా చేరిన మెంబర్లకు సెస్సు నిధినుండి ప్రభుత్వం కొంతడబ్బు కేటాయించింది నిజమే. ఒక్కొక్క జిల్లాకు ఎంతెంత కేటాయించారో దయచేసి మీరు చెప్ప గలరా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—వివరములు ఇక్కడ లేవు. ప్రత్యేక ప్రశ్నగా వేస్తే తెప్పించి మీఎదుట పెడతాను.

Sri P. Kotaiah:—అధ్యక్షా! ఈస్కీములు ప్రారంభమై దాదాపు ఒక సంవత్సరం కావస్తున్నదికదా ఇప్పటికి ఏదైనా ప్రోగ్రెసు రిపోర్టు రిజిస్ట్రారుగారి దగ్గరనుండి ప్రభుత్వానికి వచ్చిందా వస్తే అట్టిది ఈ సమావేశము కాబోయేలోపల ఈ సభముందు పెట్టడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—రిపోర్టు తెప్పించి ఈ సభముందు పెట్టడానికి ప్రయత్నంచేస్తాము. వీలైతే ఈ సమావేశములో లేకపోతే వచ్చే సమావేశములో పెడతాము.

[3rd November 1954

Sri T. Nagi Reddi·—రిపోర్టు ఇవ్వబడుతుందని ప్రభుత్వంవారు చెబుతున్నారుగాని చాలా సొసైటీలలో 6, 8 నెలలు అయినా రిబేటు డబ్బు చేరలేదు. డబ్బు అయిపోయిందంటున్నారు. ఆ కారణంచేత పని లేకుండా పోతున్నది. కంప్లైంటులు వస్తున్నసంగతి మంత్రిగారికి తెలుసునా? రిబేటుఇస్తే ఎంత త్వరలో ఇవ్వవలెనని నిర్ణయం చేశారు?

The Hon. Sri S· B. P Pattabhirama Rao.—కంప్లైంట్లు నా వద్దకు రాలేదు. స్పెషలుగా కంప్లైంటు చేస్తే విచారించి సరిఅయినమార్గం ఏర్పడడానికి ఆలోచిస్తాము.

Sri P. Venkatasubbayya:—ఇప్పుడు హాండులూము గూడ్సు అమ్మడానికి ఒక వాను (Van) అంటూఉంది. మూడు జిల్లాలకు కలిపి ఒకటి ఉంది. ప్రతిజిల్లాకు ఒకటి ఉంటే బాగుంటుందేమో. చాలా గ్రామాలు వెళ్లడానికి వీలు అవుతుంది.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—ఆ లో చ న చేస్తాము.

AGRICULTURAL SPECIALISTS FROM THE STATE AGRICULTURAL DEPARTMENT.

*41 346 Q. Sri Vavilala Gopalakrishnaiah:—Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state—

(a) Whether the Central Government have asked the State Government to recommend some Agricultural Department;
(b) If so, how many were recommended and who they are; and
(c) if not, why not?

The Hon. Sri P. Thimma Reddi:—
(a) Yes.

The Government of India have asked for names of a few suitable candidates for appointment as Assistant Directors (Storage).

(b) One Sri C. Krishnamoorthy, Assistant Entomologist was recomended by the State Government.

(c) Does not arise.

(a) ఔను (b) C. Krishnamurthi గారు Assistant Entomologist ఉన్నారు. ఆయన పేరు భారత ప్రభుత్వానికి రికమండు చెయ్యబడింది.

Sri Vavilala Gopalakrishnaiah:—అధ్యక్షా! కేంద్ర ప్రభుత్వం తరచుగా అగ్రికల్చరలు డిపార్టుమెంటుల స్పెషలిస్టులను అడుగుతూ ఉంది. ఆ విషయంలో ప్రభుత్వం కొందరిని మనస్సులో పెట్టుకొని పైకి వారిని పెట్టడానికి ఉద్దేశము మాకులేదని బదులు చెప్తున్నారు. కొంతమంది బాధలు పడుతున్నారు. ఇది గవర్నమెంటు దృష్టికి ఏమైనా వచ్చిందా?

The Hon.Sri P. Thimma Reddi:—అయ్యా బాధలు పడేవారు మాతో వచ్చి నేరుగా చెప్పుకుంటే ఏమైనా చేసేదానికి అవుతుంది. ఇప్పుడు భారత ప్రభుత్వంవారు అడిగితే ఎంటమాలజిస్టుగా కృష్ణమూర్తిగారిని రికమండు చేశాము. సభ్యులకు ఇంకా ఎవరైనా ఉన్నట్లు తెలిస్తే నాకు సులభముగా చెప్పవచ్చును. దానిని గురించి వివరములు చెప్పగలను.

Sri Vavilala Gopalakrishnaiah:—ఒక చిక్కు ఉంది. పేర్లు చెప్పగలము కాని ఉద్యోగం మొత్తం ఖాళీకావచ్చును అనే భయము ఉంది. వివరములు తెలుసునుగాని మొత్తం ఉద్యోగం sacrifice చెయ్యడానికి ఇష్టములేక పేర్లు చెప్పడానికి ఇష్టపడలేదు.

The Hon. Sri P. Thimma Reddi:—అధ్యక్షా! ఇది imputation గా ఉన్నది. ఫలానా డిపార్టుమెంటు గురించి సభ్యులు వివరములు అడిగితే జవాబు చెప్తాను.

Sri V. Srikrishna:—భారత ప్రభుత్వంవారు ఆ ఒకరిని గురించే అడిగినారా? ఇంక ఎవరినిగురించి అయినా అడిగినారా? బాపట్ల అగ్రికల్చరలు కాలేజీలో మైకాలజిస్టు గజెటెడ్ పోస్టు చాలా కాలంనుంచి ఖాళీగా ఉంది. అరతేకాదు ఆ కాలేజీలో రిసెర్చికి తగిన వసతులు కల్గించి అటువంటి విద్యార్థులకు స్టయిపెండ్సు వగైరా సదుపాయములు కల్పించడానికి ప్రత్యేకముగా కృషిచేస్తారా అని అడుగుతున్నాను.

[3rd November 1954

The Hon. Sri P. Thimma Reddi—మీరు చెప్పినట్లు ఏదైనా పోస్టుఖాళీగాఉంటే సర్వీసు కమీషనువారు ఉండనే ఉన్నారు. వారు అడ్వయిజుచేసి ఉద్యోగస్థులను సెలక్టు చేస్తారు. అంతేగాని ఎవరైనా దొంగత్రోవన ఎవరినైనా పట్టుకొని ఉద్యోగంకోసం ప్రయత్నం చెయ్య వచ్చునంటే అది జరిగేపనికాదు.

REPRESENTATION FROM GANTI PEDA POODI BANJAR CULTIVATORS.

* 42. Q. Sri G. Nageswara Rao.—Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) Whether the Government have received any representation, dated 18th March 1954 from Ganti Peda Poodi (Kothapeta taluk) banjar cultivators on 23rd March 1954 for grant of pattas for 15 acres of waste land cultivated by them from 1942; and

(b) if so, the action taken thereon?

The Hon. Sri K. Koti Reddi:—

(a) Yes.

(b) The petition was forwarded to the Collector of East Godavari for careful enquiry and disposal. He was particularly requested to consider all the circumstances of the case and to reduce the penalties imposed on the encroacher whenever such reduction was called for.

(a) అవును.

(b) అర్జీని తూర్పుగోదావరి కలెక్టరుకు Disposal చెయ్యమని పంపాను. ఏప్రకారం చేస్తే వీలుంటుందో ఆ ప్రకారం చెయ్యవలసినదని పంపించాము.

Sri G. Nageswara Rao:—అర్జీ పంపించి ఎంతకాలం అయిందండీ? అయితే అసలు ప్రభుత్వంవారు దానిగురించి ఏమి ఆలోచించారు? అసలు పట్టా ఇచ్చే సందర్భములో ప్రభుత్వముయొక్క అభిప్రాయమేమిటి?

The Hon. Sri K. Koti Reddi:—ప్రభుత్వంవారు ఆలోచించ వలసిన అవసరం ఉండనే ఉండదు. కలెక్టర్లకే పట్టాలు ఇచ్చే అధికారం ఉంది. అటువంటిది ఏదైనా దుర్వినియోగం చేసినట్లు తెలిపితే నేను విచా

రించుతాను. ప్రతిదినము ఎన్నో అర్జీలు వస్తూనే ఉన్నవి. మీకు ఏమైనా అనుమానం ఉంటే మేము అర్జీలు తెప్పించుకొని చూస్తాము. ఆటువంటి అర్జీలలో ఇది ఒకటి. కలెక్టరుకు పంపాము. వారు చూస్తారని నమ్మకం ఉందిమాకు. అధికార దుర్వినియోగం జరిగింకని మీరు తెలిపితే విచారిస్తాము. అర్జీ వచ్చిన 3, 4 దినాలలో పంపించివుంటాము.

Sri Saka Venkata Rao :—తమదగ్గరకు వచ్చిన పిటీషను కలెక్టరు గారికి పంపించాము అన్నారు, కాని తిరిగి మేమువచ్చి మీకు చెప్పవలసిన పరిస్థితి ఏర్పడింది. కలెక్టరు ఎంతవరకు యాక్షను తీసుకున్నారో తెలుసుకొనవలసిన బాధ్యత లేదా ?

The Hon. Sri K. Koti Reddi .—మాఉద్యోగస్థులంతా సక్రమముగా పనులు చేస్తారనే నమ్మకం ఉంది. అట్లా లేకుండాపోతే రోజుకు వందలకొద్ది అర్జీలు వస్తవి. ప్రతిసారి విచారణ చెయ్యవలెనంటే ఇంత మంది మంత్రులు చాలరు. తప్పులు చేసేవారు ఎప్పుడూ ఉంటారు. ఈ సెక్రటరేటు చాలదు. ఎంతో వృద్ధిచెయ్యవలయును. అది అనవసరం. మా ఉద్యోగస్థులు ఎవరైనా పని చెయ్యకపోతే మీరు మాదృష్టికి తీసికొని రండి. కలెక్టరు బాధ్యత, తాసీల్దారు బాధ్యత, కరణం బాధ్యత. చూస్తూవుండవలెనంటే అది సాధ్యంకాదు. ఏ ప్రభుత్వాలు కూడా అట్లా చెయ్యలేవు. మేము అట్లా చేసేదానికి వీలులేదు. ఈ మంత్రులుచాలరు. ఈ సిబ్బంది చాలదు.

Sri T. Nagi Reddi :—ఈ మంత్రులు చాలరంటున్నారు. మంత్రుల సంఖ్యను పెంచడానికి ఏమైనా ఆలోచన ఉందాండి ?

The Hon. Sri K. Koti Reddi :—మంత్రుల సంఖ్య పెంచుకోవలెననిఅభిప్రాయం ఉంటే, మీరు ఇచ్చిన అర్జీలు అన్నీ చూపించి మేము వారమే. ఆ కోరిక మాకులేదు.

COMPULSORY ELEMENTARY EDUCATION IN NELLORE DISTRICT.

* 43. Q. Sri S. Vemaiah :— Will the Hon. the Minister for Education and Industries be pleased to State—

(a) the number of elementary schools in which compulsory education is in force in Nellore district and

(b) the action taken against defaulters ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—

(a) 349 schools.
(b) No action has so far been taken.

Sri S. Vemaiah.—ఏమిచర్య తీసుకోకపోయినప్పుడు compulsory అని declare చేయడంవల్ల ప్రయోజనం ఏమిటి ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao.—మీరు అడిగిన తరువాతనే చెబుదాం అనుకున్నాను. నామటుకు నాకు ఇది అంత సంతృప్తి కరంగా లేదు. ఏ action తీసుకోకపోవడం సరియైన పద్ధతి కాదని నా నమ్మకం. ఈ విషయం ఆగస్టు నెలాఖరునే తెలియజేశాను. కాని దానికి ఒక ఇబ్బంది వచ్చింది. దానికి ఒక procedure వుంది. Defaulters notices, penalty notices ఇవ్వడానికి proper forms వున్నాయి. ఆ నోటీసు forms లేవు. మన గవర్నమెంటు ప్రెస్సు క్రొత్తది అవడం మూలంగా అక్కడ తయారు చేయించడానికి కుదరలేదు. అందుచేత అక్కడ స్థానికంగా print చేయించి action తీసుకోవలసిందని ఆగస్టు నెలాఖరున ఉత్తరువులు జారీచేశాను. ఈసరికి ఆలా చేసివుంటారు అని అనుకుంటున్నాను.

Sri K. Rajagopala Rao :— మంత్రిగారి సమాధానం అనుకున్నంత అవుతోంది. పిల్లలను పనులకు పంపించడంవల్ల స్కూళ్ళకు పంపించలేక పోతున్నారు. మధ్యాహ్నం పాలుగాని మరి ఏమైనా ఇస్తే compulsory education అమలు జరగడానికి వీలు అవుతుంది. వాళ్ళను జైళ్ళలో పెట్టించేబదులు అటువంటి ఏర్పాట్లు ఏమైనా చేస్తారా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—ప్రభుత్వానికి డబ్బువుంటే అటువంటిది చేయడానికి మాకంటె తీవ్రంగా ఆలోచించే వారెవ్వరూ వుండరని మనవిచేస్తున్నాను.

Sri V. Rama Rao :—ఆలాంటి సదుపాయాలు కలిగించే పరిస్థితి ఏర్పడేవరకు జరిమానాలపద్ధతి లేకుండా చూస్తారా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—Compulsory education పద్ధతిని సడలించాలా, లేక రద్దుచేయాలా, ఏమిచేయాలి అని ప్రభుత్వం ఆలోచిస్తోంది.

3rd November 1954]

Sri B. Appalaswami .— Compulsory విధానంలో చాలా చిక్కులు వున్నాయి. వెంటనే labour schools లో మాదిరిగా ఎలిమెంటరీ స్కూల్సులో కూడా మధ్యాహ్నం భోజనాలు పెట్టించే ఏర్పాట్లు చేయాలి, లేదా ఈకంపల్సరి పద్ధతిని రద్దుచేయాలి. అంతేకాని ఈ జైళ్ళకు పంపించే పద్ధతి పనికిరాదు. ఈ విషయమై ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తున్నారా ?

No answer.

PUNGANOOR BREED OF CATTLE.

* 44. Q· Sri S. Vemaiah :—Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state—

(a) whether there is a proposal to improve the Punganoor breed of cattle and

(b) if so, the cost of the scheme and the stage at which the matter stands ?

The Hon. Sri P. Thimma Reddi :—

(a) Yes, Sir.

(b) The ultimate cost of the scheme is estimated at Rs. 13,400/- non-recurring and Rs. 15,000/- recurring per year. The scheme has already been sanctioned and the animals required are being purchased. Only the site for the farm remains to be selected.

పుంగనూరు జాతి పశువులను అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ప్రారంభంలో రు 13,400 లు ఖర్చుపెడతాం. సాలుసరికి రు 15,000 లు ఖర్చుచేయడానికి ఏర్పాటుజరిగింది.

Sri T. Lakshminarayana Reddi :—పుంగనూరు జాతే కాక అలికిరి జాతి కూడా కొన్ని జిల్లాలలో ఉపయోగకరంగా వుంటుంది. దాన్ని కూడా అభివృద్ధిచేస్తారా ?

The Hon. Sri P. Thimma Reddi :—సభ్యుల సలహాకు నా అభివందనాలు. దాన్నికూడా అభివృద్ధి చేయడానికి త్వరలో ప్రయత్నాలు చేస్తాను.

[3rd November 1954

CO-OPERATIVE SOCIETIES LIQUIDATED IN THE STATE.

* 45. 497 Q. Sri S. Vemaiah :—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state—

(a) the number of Co-operative Societies liquidated in 1953—54 in the State ; and

(b) the number of Harijan Societies out of them ?

The Hon. Sri D. Sanjivayya :—

(a) 113

(b) 2

Sri S. Vemaiah :—ఏఏ కారణాలు పురస్కరించుకుని ఈ సొసైటీలను liquidate చేశారో సెలవిస్తారా?

Hon. Sri D. Sanjivayya :—ఈ 113 సొసైటీలలో ఒక్కొక్క సొసైటీ ఏకారణాలవల్ల liquidate చేయబడింది చెప్పాలంటె సాధ్యం కాదు. ఆకారణాలన్నీకూడా కావాలంటే తెప్పిస్తాము.

Out of the two Harijan societies, one relates to the Harijan society at Neerupalli, Bhimavaram circle. The affairs of the society were not satisfactory and the panchayatdars and members evinced no interest in its affairs. The registration of the society was therefore cancelled.

The other relates to Pathapudi Field Labour Co-operative Society, Kakinada Circle, whose registration was cancelled in 1954 and the cancellation order took effect from 19-- 7-- 1954. The registration of this society was cancelled as the financial position of the society was not satisfactory and there were heavy dues to Government by way of rentals.

Sri R. Siddanna Gowd:—Registration చేసిన societies కంటె liquidate చేసిన societies సంఖ్య ఎక్కువా, తక్కువా?

The Hon. Sri D. Sanjivayya :—ప్రత్యేకంగా ప్రశ్నవేస్తే వివరాలు తెప్పిస్తాము.

Sri Pragada Kotaiah :—ఆంధ్రదేశంలోవున్న చేనేత సహకార సంఘాల్లో 350 సంఘాలు డబ్బులేక సరిగా పనిచేయడంలేదు డబ్బుయిచ్చే

ఆలోచన ప్రభుత్వం ఏమైనా చేస్తుందా? మొత్తంగా weavers co-operative movement ను wind up చేస్తుందా?

The Hon. Sri D. Sanjivayya :—చేనేత పరిశ్రమకు చేసినంత సహాయం ఇంతవరకు ఎవరికి చేయలేదని అనుకుంటున్నాను. ఏమి చేయడంలేదంటే ఏ అర్థంతో చెబుతున్నారో నాకు అర్థంకావడంలేదు.

Sri C. Ramalingaiah:— చేనేత సహకారసంఘాలకు ఇచ్చే డబ్బు దుర్వినియోగం కాకుండా దానికి కావలసిన కట్టుదిట్టాలు చేస్తూ Act ను సవరిస్తారా?

The Hon. Sri D. Sanjivayya :—Co-operative Societies Act ను amend చేయాలి అని వున్నది. అందుకు బిల్లుకూడా తయారుగా వున్నది. త్వరలో ప్రవేశపెడతాం.

Sri P. Venkatasubbaiah:—Liquidate అయిన societies లో పరిమితి పూచీ సంఘాలు ఎన్ని ? లేనివి ఎన్ని ? లేనివాటికి surcharge వసూలు చేస్తారా?

The Hon. Sri D. Sanjivayya :—ఆ details లేవు. కావాలంటే తెప్పిస్తాము.

Sri P. Pundarikakshacharlu:—Liquidate అయిన societies లో voluntaryగా liquidate అయినవి ఎన్ని ? ప్రభుత్వ orders వల్ల liquidate అయినవి ఎన్ని ?

The Hon. Sri D. Sanjivayya :— ఒక్కొక్క society ఎందుకు liquidate అయినది; ఎందరు సభ్యులు కోరడంవల్ల liquidate అయినాయి; ఎన్నింటి విషయంలో ప్రభుత్వం చర్యతీసుకుంది, అనే విషయాలు లేవు. కావాలంటే తెప్పిస్తాము.

Sri K. Ranga Rao :—Societies ను register చేయడంలో ప్రభుత్వం ఒక పాలసీ అనుసరిస్తోందా ? కమ్యూనిస్టుపార్టీ ప్రభావం వున్న చోట societies register చేయకూడదని instructions ఇవ్వడంవల్ల

[3rd November 1954

గుంటూరు జిల్లాలో కొన్ని సొసైటీలు register కాలేదని తెలుసా? ఆరకంగా instructions ఇచ్చారా?

The Hon. Sri D. Sanjivayya.—ఆరకంగా ఏమి instructions ఇవ్వలేదు. అలా ఇచ్చినట్లు తెలియజేస్తే చర్యతీసుకుంటాము.

Sri K. Malakondaiah :—Liquidate అయిన societies లలో ఆదిఆంధ్ర societies ఎన్ని?

The Hon. Sri D. Sanjivayya :—రెండవభాగానికి సమాధానం రెండు అని చెప్పాను.

Sri G. Bapanaiah.—కాకినాడ సొసైటీ ప్రభుత్వానికి rentals కట్టకపోవడంవల్ల liquidate చేశాము అన్నారు. ఎంతకట్టాలి? ఎందుచేత కట్టలేకపోయారు?

The Hon. Sri D. Sanjivayya :— Rentals కట్టకపోవడమే ప్రధాన కారణంకాదు. Financial position of the society కూడా బాగాలేదని వ్రాయబడివుంది. ఎంత ఇవ్వాలి అనేది వ్రాయబడలేదు.

Sri T. Lakshminarayana Reddi :—మద్రాసు రాష్ట్రంలో సహకారోద్యమం పూర్వంనుంచి అభివృద్ధిలోవున్నది. ఇంకా అభివృద్ధి అవడానికి అవకాశాలు వున్నాయి. Rural societies లో short term loans ఇచ్చేదానిలో ఇబ్బందులు కలుగుతున్నాయి. Long terms loans పల్లెటూళ్ళలో ఇవ్వడానికి ప్రభుత్వం ఆలోచనచేస్తుందా?

The Hon. Sri D. Sanjivayya :— ప్రస్తుతం short term, and middle term loans మాత్రమే వున్నవి. Long term loans Land Mortgage Bank వాళ్ళు ఇస్తున్నారుకదా?

Sri Bh. Lakshminarasaraju :—చేనేత పరిశ్రమల సంఘాలు loss తో పనిచేస్తున్నాయి. వాటిని audit చేసేటప్పుడు సొసైటీ ఫీజు కట్టుకోవడం చాలా కష్టంగావుంది. ప్రభుత్వ ఖర్చుతో audit చేసే ఏర్పాటుచేస్తారా?

3rd November 1954]

The Hon. Sri D. Sanjivayya —ఈ విషయంలో ఇదివరకు సభలో జవాబు చెప్పినట్లు జ్ఞాపకం. Loss తో పనిచేసేవాటి విషయంలో మినహాయింపు చేయడం అవుతుంది.

Sri Bh. Lakshminarasaraju.—మాపాలకొల్లు సొసైటీ lossతో నడుస్తోంది. దాన్ని మినహాయించడానికి ఆలోచన చేస్తారా?

Sri Pragada Kotaiah :—నేను అడిగినదానికి సరిగా సమాధానం చెప్పకుండా మంత్రిగారు దాటివేసారు. 650 సొసైటీలలో 350 పనిచేయడంలేదు. కాబట్టి వాటికి పెట్టుబడిలో నష్టం కలిగింది. వాటికి సహాయం చేస్తారా ?

The Hon. D. Sanjivayya .—దీనికి ఒకటే జవాబు. తాటి చెట్టు ఎక్కేవాడికి చేతికందినంతవరకే సహాయం చేస్తారు.

Sri S. Vemayya .—నిన్నటిదినం 2 ప్రశ్నలు అప్పరు చేయకుండా వాయిదా వేశారు.

Mr. Speaker :—They are posted to the 5th instant; they are not in today's agenda.

Sri G. Latchanna—Point of information. శాసనసభ ఆరోతారీఖు తరువాత వాయిదా వేస్తారని అనుకుంటున్నారు. అదేదో స్పష్టంచేస్తే సభ్యులు తమకార్యక్రమం నిర్ణయించుకోడానికి అవకాశం వుంటుంది.

Mr. Speaker:—ఆసంగతి రేపు చెబుతాను. రేపుచెబితే చాలుగా?

Sri G. Latchanna :—కొంచెం ముందుగా చెబితే ఎక్కువ అవకాశం వుంటుంది.

The Hon. Sri N. Sanjeeya Reddi :—ఉన్నసంగతి యేమి

[3rd November 1954

టంటే, నేషనల్ డెవలెప్‌మెంట్ కవున్సిలు 9, 10 తేదీలలో ఢిల్లీలో meet అవుతుంది. Labour Ministers Conference 12, 13 తేదీలలో జరుగుతుంది. అక్కడకు నేను, ముఖ్యమంత్రిగారిని కూడా రమ్మని ప్రార్థిస్తున్నాను.—వారుకూడా రావలసిన అగత్యం వున్నది. సభ్యులకు కూడా వ్యవధి కావాలి కనుక లేదా సమావేశం పూర్తికాగానే శనివారం voting అయిన తరువాత వాయిదా వేసికొని మీరంతా ఒప్పుకుంటే 15 వ తేదీ సమావేశం . . .

Mr. Speaker :—అవసరం వస్తే.

The Hon. Sri N. Sanjeeva Reddi :—దానికి అనుమానం లేదు. అవసరం వస్తుంది. మీరంతా అంగీకరిస్తే 6 వ తేదీన వాయిదా వేసి మరల 15 తారీఖున జరిపితే బాగుంటుంది అనుకుంటున్నాను.

Sri Pillalamarri Venkateswarlu :—ఆరవ తేదీ తరువాత సభ వాయిదా వేయడానికి మాకుయేమీ అభ్యంతరం లేదు.

Sri Raja Sagi Suryanarayana Raju:—నెలాఖరు వరకు కోతలుంటాయికనుక డిసెంబరు ఫస్టు వరకు పొడిగిస్తే బాగుంటుంది. ఆలోచిస్తారా?

Mr. Speaker :—ఏమి కోతలండీ?

The Hon. Sri N. Sanjeeva Reddi·— మీసలహా ఆలోచిస్తాం. రెండురోజులు time యివ్వండి. Urgent bills ఏమయినా వున్నాయేమో తెలియదు. రేపు details చెబుతాను.

Sri Bh. Lakshminarasaraju:—అసెంబ్లీ సభ్యులలో కోతలు కోసేవారు ఎవరూ లేరు.

Mr. Speaker :—కోతలు అనేకరకాలు ఉంటాయి.

3rd November 1954]

Sri D Dasaradharamiah :— ప్రభుత్వ పక్షాల్లో కోతలు కోసే వారెవరూ లేరు. కాని భూస్వాములు, భూస్వాములని ప్రతిపక్ష సభ్యుల్లో కోతలు కోసేవారున్నారను కుంటాను. వారికోసం డిసెంబరు 1వ తేదీ వరకు వాయిదావేస్తే బాగుంటుందని అనుకుంటున్నాను.

## II MOTION EXPRESSING WANT OF CONFIDENCE IN THE MINISTRY

Sri T. Nagi Reddi :—Mr. Speaker, Sir, I move—

"That, with reference to clause (a) of sub-rule (1) of Rule 48 of the Madras Assembly Rules, leave of the House be granted for making the following motion :

'That, in view of the failure of the Government to implement the decision of this House passed on 27th May, 1954, at Waltair, regarding the recommendations of the Ramamurthy Committee Report on Prohibition, this House expresses want of confidence in the Ministry.'."

Sri M. Hanumantha Rao :—I second it.

Mr. Speaker :—The hon. Member must ask for the leave of the House.

Sri N. V. L. Narasimha Rao:—ఇక్కడ 3 తీర్మానాలున్నాయి. అన్నీ తెస్తే వట్టి repetition అవుతుంది. మొట్టమొదట నాగిరెడ్డిగారిది, తరువాత లచ్చన్నగారిది, తరువాత పుండరీకాక్షాచారిగారిది 3 తీర్మానాలున్నాయి. ఈ 3 కూడా ఒకే మాటల్లో వున్నాయి. పదభేదాలు లేవు. ఈ మూడింటిలో ఒకటి తీసుకుని House యొక్క permission తీసుకుంటారని తమరు శలవియ్యాలి.

Mr. Speaker :—Not necessary. All the three are put, because, supposing the first motion does not get leave, then I shall go to the second motion. Because the person

who moves for leave of the House is different, the House may be inclined to give him leave. That is why all the three are put. If one is taken, the other two will automatically go.

Sri T. Nagi Reddi :—Sir, the very purpose of my moving the resolution is to request for the leave of the House. Anyhow I formally request the House to give me leave to move the motion.

Mr. Speaker :—The question is :

whether the hon. Mover of the resolution has got the leave of the House.

A large number of Members stood up in favour of the motion.

Mr. Speaker :—Leave is granted.

The next motion is the one which stands in the name of Sri Latchanna. I think he can withdraw it.

Sri G. Latchanna :—Chair కు విధేయంగానే ఒక విషయం మనవిచేయ దలచుకున్నాను. మొన్న leaders' meeting జరిగిన సందర్భంలో మంత్రివర్గం అయితేనేం, opposition పక్షాలు అయితే నేం తీర్మానాలు ప్రతిపాదిస్తే అవికూడా వుంచుకోడానికి అవకాశం వుంటుం దని 29 తేదీ నాటి సాయంత్రం అనుకున్నట్లు నాకు చాలా జ్ఞాపకం. కాగితంమీద రాసుకోలే దనుకోండి. అటువంటి సందర్భంలో ప్రతిపక్షం motions ను move చేసిన తరువాత ఏదో ఒక motion మీద వ్యవహారం చేసుకోవచ్చుననే understanding వచ్చినట్లయితే మంచిది. అలాంటి understanding వుందో లేదో తమరు శలవిప్పించండి. లేకపోతే withdraw చేసుకోమ్మని చెబితే బాగుంటుంది.

Mr. Speaker :—I fail to see.

3rd November 1954]

Sri N. V. L. Narasimha Rao:—On a point of order, Sir. ఒక మనిషి propose చేసినప్పుడు ఆ మనిషిని బట్టికూడా కొంతవరకు బలము వస్తుందని మొట్టమొదట తమరు సెలవిచ్చారు.

Mr. Speaker.—బలము వస్తుందని అనలేదు. వస్తుందేమోనని అన్నాను.

Sri N. V. L. Narasimha Rao:—వస్తుందని కాదు, రావచ్చునని అన్నారు. అందుచేత, అసలు ఈ సత్యాగ్రహానికి లచ్చన్నగారు...

Mr. Speaker.—I am not concerned with it.

Sri N. V. L. Narasimha Rao:—ముగ్గురి తీర్మానాలు ఒకే విధంగా ఉన్నవని అనుకోండి. అవి ఒకే form లో ఉన్నప్పుడు ముగ్గురిని allow చేసి తరువాత మేము వాటియొక్క మంచిచెడ్డలు ఆలోచించడానికి వదలిపెడితే బాగుంటుందేమోనని మనవిచేస్తున్నాను.

Sri T. Nagi Reddi:—ఈ proposal బాగానే ఉన్నదని అనుకొంటున్నాను.

Mr. Speaker:—All right move it.

The Hon. Sri T. Viswanatham:—వీటిలో substance ఒకటే. భాషకూడా దగ్గరగానే ఉన్నది. అందుచేత అసెంబ్లీముందు ఎప్పుడు కూడాను ఏదో ఒక subject తీసుకొన్నప్పుడు రెండవ subject కు వెళ్ళ డానికి ఏ Rule కూడా ఒప్పుకోదు. అది procedure కు విరుద్ధం అవుతుంది. ఇదివరలో కూడ ఏదో ఒకటి move చేస్తే బాగుంటుందని అనుకొన్నాము. ఒకటి move చేసినపుడు, అది dispose కాకముందే రెండవది కూడా move చేస్తానంటే అది కుదిరే వ్యవహారం కాదు.

Mr. Speaker:—When the matter is taken up for discussion, I will take only one.

Sri Pillalamarri Venkateswarlu —ఇవన్నీ మొదట move చేసిన తరువాత, ఏది చర్చకు పెడదాము అనేది రేపు తేలవలసిన విషయము. ఇప్పుడు ఆ విషయమై తీర్మానించుకుంటాను.

Sri G. Latchanna :—Mr. Speaker, Sir, I move—

"That, with reference to clause (a) of sub-rule (1) of Rule 48 of the Madras Assembly Rules, leave of the House be granted for making the following motion:

'That this Assembly expresses its want of confidence in the Ministry, for they have failed to respect and implement the recommendations of Ramamurthy Committee as decided by the Assembly on 27th May, 1954.'."

Sri T. Nagi Reddi :—I second it.

Mr. Speaker :—Has the hon. Member leave of the House to move the motion?

A large number of members rose up in their seats in favour of the motion.

Mr. Speaker :—Leave is granted. What about the next motion.

Sri P. Pundarikakshacharyulu :—I am not moving it, Sir.

## MOTION EXPRESSING DISAPPROVAL OF THE POLICY OF THE MINISTRY.

Mr. Speaker :—What about motions 4 and 5? Are they being pressed?

Sri Pillalamarri Venkateswarlu :—Sir, I beg to move—

"That, with reference to clause (a) of sub-rule (1) of Rule 48 of the Madras Assembly Rules, leave of the

House be granted for making the following motion:-

"That this House hereby disapproves the policy of the Ministry in its failure to implement the resolution passed on the floor of the House on 27th May, 1954, urging the Government to implement Ramamurthy Committee's recommendations forthwith."

Sri C. Pulla Reddi :—I second it.

Mr. Speaker :—Has the hon. Member the leave of the House ?

A large number of persons stood up in favourof the motion.

Mr. Speaker :—Leave is granted.

Sri K. Rajagopala Rao .—పై తీర్మానాలన్ని move చేయించారు కనుక నా తీర్మానాన్ని move చేయడంలేదు.

Mr. Speaker :—The matter will come up to-morrow for discussion. Unless hon. Members tell me which of the three motions they are going to move I will select one as I like. It must be done before this evening. Otherwise it will be left to the Speaker.

Sri Pillalamarri Venkateswarlu :—అధ్యక్షా ! ఒక విషయం ఉన్నది. ఇక్కడ మూడు different motions ఉన్నాయి. వీటిని ఒక order లో పెట్టడమనేది కాదు. దీంట్లో ఏదో ఒకటి select చేయడమనేది కాదు. ఈమూడు motions లో ఏ motion ను press చేయడం అనేది, దేనిని చర్చకు పెట్టడమనే హక్కు motion ను move చేసినటువంటి వారికి ఉన్నది.

Mr. Speaker :—That is why I said, you decide between yourselves and give me one motion ; otherwise I will select one. The Chair can do it.

The Hon. Sri N. Sanjeeva Reddi.—వారు ఏదో circumvent చేయాలని చూస్తున్నారు. మొదట move చేయమనండి. తరువాత వోటుకు పెట్టినతరువాత చూసుకొందామని అన్నారు. కనుక మీరు దీనిని జాగ్రత్తగా చూస్తే తప్ప, వాళ్ళతో ప్రమాదంగా ఉండేటట్లున్నది. (నవ్వు)

## III. DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS.

Mr. Speaker :—We will now resume discussion on the Governor's address. In this respect I want to tell the House there are some four or five members who have given their names, whom I cannot call, because there is no time, and also because most hon. Members are in the habit of not sending their names even on the first day. With reference to that I may remind hon. Members that those who have sent their names even on the first day were allotted time spread over all the three days. So when from the second day onwards members began sending in names I am not able to give them a chance. Hereafter it is better all the names are sent even on the first day so that we can allot time. I am very sorry I could not give a chance to three or four members.

Sri T. Lakshminarayana Reddi :—Even on the first day I have sent my name; and still I do not get a chance to speak.

Mr. Speaker :—Even that cannot be a reason.

Sri T. Lakshminarayana Reddi:—Can I take 20 minutes on the no-confidence motion?

Mr. Speaker :—Whether it is twenty minutes or no minutes, it will be decided when that time comes.

3rd November 1954]

The Hon. Sri K. Koti Reddi:—అధ్యక్షా! గవర్నరుగారి address పైన అభివందన తీర్మానమును నేను support చేస్తూ, నా Department కు సంబంధించిన విషయాలు గురించి, అన్నిటిపైన కాకపోయినా, కొన్ని ముఖ్యమైన విషయాలపైన చెప్పదలచు కొన్నాను. ముఖ్యంగా బంజరుభూముల పంపకం విషయం ఒకటి. రెండవది ఈనాంర్రైతుల విషయం. ఈ రెండు విషయాలు ఎక్కువగా చర్చకు వచ్చాయి. బంజరు భూముల విషయంలో ప్రభుత్వము తగినంత శ్రద్ధ తీసుకొంటూ యున్నదని నేను చెప్పుతున్నాను. అసెంబ్లీలో దీని విషయమై తీర్మానం pass అయింది. ఈ అసెంబ్లీ తీర్మానం pass కాకమునుపే ఈ బంజరు భూముల గురించి ప్రభుత్వము అంతా ఆలోచించి తప్పకుండా శీఘ్రమైనంత త్వరలో బంజరు భూములను బీదలకు ఇవ్వవలెననే తీర్మానం చేసుకొన్నది.

అప్పటి సందర్భంలో మార్కెటు రేటుపై వెలకట్టి, ఆ వెలను వసూలుచేసి భూమిని యిస్తున్నాము. ఆ విషయము కూడా Cabinet లో ఆలోచించి తప్పకుండా బీదలకిచ్చే సందర్భంలో వారికి ఉచితంగాకూడా యివ్వవలయుననుకున్నాము. ఆ పేరు భూములను సాగులోకి తీసుకురావడానికి, కావలసినదంతా ఏర్పాటు చేసుకోడానికి, నీటి పారుదలను కల్పించేదానికి దాదాపు 90 లక్షలుకుపైన ఈ ప్రభుత్వం ఖర్చుపెట్టికూడా బీదలకు ఈ భూములను యిస్తున్నాము కాబట్టి వారి వద్దనుంచి ఏమీగా వసూలు చేయకూడదనుకున్నాము. అదేవిధంగా G. O. కూడా issue చేశాము. ఏదో కొంతమంది రాజకీయ బాధితులకు కొన్ని భూములను యిస్తున్నామని చెప్పి పెద్ద గగ్గోలు పెడుతున్నారు. సత్యాగ్రహం అని దీనికికూడా పేరుపెట్టి జరుపుతున్నారు. సత్యాగ్రహులు జైలుకు పోయిన తరువాత జైలులోనుంచి వారిని విడువవలసిందిగా వారి తరఫున ఎవరు కోరడంలేదు. ఇటువంటివి ప్రతిదినం తంతులు, బాబులుకూడా మాకు వస్తున్నాయి. వారి తరఫున ఎవరో కొంతమంది చేసినారు. పేదలు [illegible] జైలుకు ఏదో కొంతమంది [illegible], పెద్దల వలనా [illegible]

[3rd November 1954

An Hon. Member:—చర్యలతోటే !

The Hon. Sri K. Koti Reddi.—చర్యలతోకూడాను, - పేదలు పాపం జైలుకు వెడుతున్నారు. అది కొంచెం సంతాపకరమైన విషయమే. ఏదైనా ఒక నేరంచేస్తే ఆ నేరమును విచారించి శిక్షవేసి, జైలుకు పంపించవలసిన అవసరము ప్రభుత్వానికిఉంది. ఏ వుద్దేశ్యముతో వారు నేరం చేసినా, జైలుకు పంపడం పరిపాలనయొక్క విధి. ఆ విధిని నెరవేర్చుకోకుండా తీరదు. అలాగే చెస్తున్నాము. రాజకీయ బాధితులకు ఏ కొద్దిమందికో కొంత భూమిని యివ్వడంతోనే పేదలకు బొత్తిగా భూమిలేకుండా పోతుందా? రాజకీయ బాధితులకు భూములు యివ్వడం ఈ ప్రభుత్వమేకాదు, హిందూ ప్రభుత్వాలు, మహమ్మదీయ ప్రభుత్వాలు, ఈ దేశంలో సాంప్రదాయంగా ప్రభుత్వానికి సహాయంచేసినటువంటి సందర్భంలో భూములు యిస్తూవచ్చారు. ఈ దేశంలోనేకాదు, నాకు తెలిసినంతగా England దేశంలో కూడా మొట్టమొదట Norman conquest, అంటే 11వ శతాబ్దంలో French వాళ్లు వచ్చి ఆదేశాన్ని సంపాదించినపుడు, ప్రభుత్వానికి సహాయం చేసినటువంటి military leaders అందరికీకూడా ఆ England దేశంలో ఉన్న వారందరికీ పంచిపెట్టారు. దానియొక్క ఫలితముగానే మనదేశములోకూడా ఒకప్పుడు జమీందారీ system ఏర్పడుతోంది. ఇపుడు మన దేశంలో మేము రాజకీయ బాధితులకు యిచ్చేటటువంటి భూములున్నవే, వాటిని దేశ స్వాతంత్ర్యమున్నకై పాటుపడినటువంటి కొంతమందికి యివ్వడంలో ఎలాంటి తప్పులేదని మనస్ఫూర్తిగా నేను మీఎదుట చెప్తున్నాను. ఈ రాజకీయ బాధితులు ఎవరూ మాకు భూములు ఇమ్మని కోరలేదు. రాజకీయ బాధితులలో అనేకమంది పేదలు వారికుండే ఆస్థులనుకూడా పోగొట్టుకొని దేశ స్వాతంత్రానికై పాటుపడినటువంటి వారికి కొంతవరకు సహాయం చేయడంలో ఎలాంటి తప్పు లేదనుకున్నాము. ఆ ప్రకారం, వారికి కొన్ని భూములియిచ్చాం. ఒకప్పుడు కొన్ని కారణాలవల్ల ఆ యివ్వడంలో [illegible] కొన్ని పొరపాట్లు ఉండి ఉండవచ్చు. ప్రజలలో కొంత

మంది భూమికావాలని కోరేటటువంటి వారుకూడా రాజకీయ బాధితు లకు భూములను యిస్తే తమకు తక్కువై పోతుందేమోననే అభిప్రా యంతో agitation జరిపి ఉండవచ్చు. ఆ కారణాలవల్ల Government అవి నిలుపుదల చేశారు. మేము వచ్చినతరువాత ఈ మధ్య చేసినటు వంటి G. O. ను, ఆచరణలో పెట్టవలసిన అవసరం లేదనిచెప్పి కొన్ని మార్పులతో రాజకీయ బాధితులకు భూములను ఇచ్చేదానికి తీర్మా నించాము. ముఖ్యమైన విషయం ఒకటిమాత్రం మీరు గమనించవలసి ఉంది. ప్రభుత్వం చెప్పినమాట జరుపుకోవలసినటువంటి న్యాయంకూడా వుంది. కొంతమంది రాజకీయ బాధితులకు భూమి వస్తుందని చెప్పి అటువంటి సందర్భాల్లో వారికి provisional assignment చేసినపుడు ఎవరైనా బీద శివాజమాదారు ఉంటే ఆ శివాయిజమాదారులను ఆ భూములనుంచి తొలగించడం బాగాలేదని G. O. లో provision చేశాము. అటువంటి రాజకీయ బాధితులకు శివాయిజమాదార్ల స్వాధీ నంలో లేనటువంటి భూములు ఏవైనా యివ్వాలనుకున్నాము. అది ఒకటి మాత్రం understand చేసుకోవాలి. శివాయిజమాదార్లు అనగా 5 ఎకరాల కృషికి, 2½ ఎకరాలతరి, లేనటువంటి శివాయిజమాదార్లని ఈ G. O. ప్రకారం ఒప్పుదల చేస్తాము. అనగా భాగ్యవంతులుగా ఉండి భూములను ఆక్రమించిన శివాయిజమాదార్లను తొలగించాలని ఒప్పుకు న్నాము. ఆ విధంగా తొలగించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. పెద శివాయిజమాదార్లు ఎవరైనా ఉంటే వారిని తొలగించడం లేదు అని స్పష్టపరిచాము. ఇపుడుకూడా స్పష్టపరుస్తున్నాను. ఆ కారణాలవల్ల ఇపుడు కూడా ఈ provisional assignment చేసిన తరువాత కొంతమంది భూమిని ఆక్రమించారు. న్యాయంగా provisional assignment ఎపుడు చేశామో ఆభూమి రాజకీయ బాధితులదే అనే విషయాన్ని గమనించాలి. అట్లా గమనించకుండా కొందరు దుర్మార్గంగానో, సన్మార్గంగానో తమకు కావాలనే అభిప్రాయంతో రాజకీయ బాధితులకు యిచ్చిన భూమిని ఆక్రమించినవాళ్లైన ఆ భూములనుంచి వారిని తొలగించి ఆ భూమిని

[Sri K. Koti Reddi] [3rd November 1954

provisional assignment యిచ్చిన రాజకీయ బాధితులకు యిస్తామని మనవిచేస్తున్నాను.

(At this stage the Deputy Speaker occupied the Chair)

కొన్ని కొన్ని సందర్భాలలో కోర్టు తీర్మానం ప్రకారం ఎస్సైన్ చేయవలసిఉంటుంది. ముఖ్యంగా పేద శివాయిజమాదారులకు ప్రొవిజనల్‌గా ఎస్సైన్ చేసిన తేదీకి ఆ భూములు అతని ఆక్రమణలో ఉంటే అతన్ని మాత్రం తొలగించరు. (Interruption) కరణం లెక్కలు ఎంతవరకు నమ్మకుండా ఉండవలెనో మీరుచెప్పే మాటలుకూడా అంతవరకు నమ్మకుండా ఉండాలనుకుంటాను. కాబట్టి, ప్రభుత్వం ఏదో ఒక వ్రాతమూలకంగా ఉండే ఆధారాన్ని నమ్మకపోతే లాభంలేదు. దీనికోసం ఒక్కొక్క కేసులో విచారణ జరపాలంటే సాధ్యంకాదు. దానికి అంత్యంకూడా ఉండదు. అయినా అటువంటి పొరపాట్లు జరిగి ఉండవని నా నమ్మకం. ఒకవేళ ఏదైనా చేసిఉంటే విచారణ చేసేదానికి ప్రయత్నిస్తాం. కాని అటువంటిది జరగదని నా నమ్మకం. బీదవారికి భూములు ఇస్తే మాకు ఆక్షేపణ లేదు, భూస్వాములకు కూడా భూములు ఇవ్వడం న్యాయంకాదని కొంతమంది చెప్పారు. కాని, నేను ఇదివరకే చెప్పాను. ఈ రాజకీయ బాధితులకు భూములు ఇవ్వడం పేదవాళ్లనికాదు; దేశ స్వాతంత్ర్యంకోసం పాటుపడ్డారు కాబట్టి వారికి భూమి ఇస్తున్నాము. అందువల్ల దీనిలో పేదవాడు భాగ్యవంతుడనే విచక్షణమాత్రం లేదు. ఈ రాజకీయ బాధితులలో హెచ్చుగా పేదవాళ్లే ఉన్నారని నేను చెప్పగలను. భూసంస్కరణలు వస్తున్నాయి కాబట్టి మనమంతాకూడా చాలా భూములు ఉన్నవాళ్లను ఆపవచ్చు. అంతవరకు మీరు కొంచెం ఓపికపట్టవచ్చు. మీరొక్క భూసంస్కరణలపైన మీకే నమ్మకం లేదనుకుంటాను. అందుచేత ప్రతిసారి భూస్వాములు, భూస్వాములు అంటూంటారు. ఈ విషయంలో మేము పొరపాటు చేయలేదు. 'బీదలకు భూములు ఇస్తాం అని చెప్పినాము అదినరే, మీరు ఇచ్చే భూములు నిజానికి ఏమీలేవు; అన్నీ [illegible]స్తున్నారని చెప్పారు.' పోతే వాళ్ళు చేసినమాట వాస్తవమే.

3rd November 1954] [Sri K. Koti Reddi]

అయితే ఎందుకు అలా చేయవలసివచ్చింది ? పోరంబోకు భూములంటే ఏమిటి ? ప్రజలందరికీ గ్రామం అంతటికీ ఉపయోగపడే భూములని దాని అర్థం. ఇప్పుడు ఈ చెరువు పోరంబోకు భూములు ఉన్నాయి అనుకోండి. చెరువు, చెరువుతట్టు, చెరువులో నీళ్లు ఉపయోగపడతాయి. ఈ చెరువు repair చేస్తే కొంత సాగుబడి అవుతుంది. అయినా ఈ టేంక్ పోరంబోకులు ఎప్పుడూకూడా ఎవరికీ ఇవ్వకూడదని అనుకున్నాం. అదేవిధంగా కూడా చేయవలసివచ్చింది. వీటిలో ఆక్షేపణకరమైన టేంక్ బెడ్స్ ఉన్నాయి. అవి fore shore of tank beds. వీటిని గురించి ఇదివరకే చెప్పాను. ఇప్పుడు హెచ్చుగా చెప్పవలసిన అవసరం లేదు. ఇప్పుడు ప్రతిపక్షంవారే కాక అన్ని పక్షాలవారూ కూడ ఈ ఇర్రిగేషన్ టేంక్స్‌ను రిపేర్ చేయాలని అంటున్నారు. అనేక సంవత్సరములనుండి అవి రిపేర్ లేకుండా ఉన్నాయని తెలుసు. ఒక్కొక్క తాలూకాలో ఒక్కొక్క జిల్లాలో ఎన్నో వందల, వేల చెరువులు రిపేర్ కాక అట్లా పడి ఉన్నాయి. వీటిని గురించి చాలా శ్రద్ధతీసుకొని ఎంత ఖర్చు అయినా ఈ టేంక్సు అన్నీ రిపేర్ చేద్దామని ఉద్దేశ్యం. కాబట్టి ఈ చెరువులను ఆనుకొని ఉన్న భూములను ఇస్తే, తరువాత వాటిని అభివృద్ధి చేసినట్లైతే ఆ భూములను మళ్లా ప్రభుత్వం కొనుక్కోవలసి వస్తుంది. అందువల్ల అది అట్లా చేయవలసి వచ్చింది.

ఇక కేటిల్ స్టాండ్స్. ముఖ్యంగా డెల్టా ఏరియాలలో పశువులు తిరిగేందుకు అట్లా ఉండనియ్యండి, మేసేందుకట్లా ఉండనియ్యండి, కనీసం ఊరిబయటకుపోతే నిలిచే దానికికూడా వీలు లేకుండా ఉంది. ముఖ్యంగా డెల్టా ప్రదేశంలోను, మగాణీ ప్రదేశంలోను, బ్లేక్ కాటన్ ప్రదేశంలోను ఆ విధంగా ఉన్నాయి. అది నాకు తెలుసు. వెస్ట్ గోదావరిలో ఒక కేసు నాదగ్గరకు వచ్చింది. అది ఆ ఊరికి పూర్వంనుంచి కేటిల్ స్టాండ్. ఆ భూమిని ఎవరికో ఇవ్వమని క్రింది ఉద్యోగస్తులు నా దగ్గరకు పంపించారు. అది నేనుచూచి ఇవ్వడానికి వీలులేదు, పశువులు తిరిగేదానికి వీలులేకపోయినా నిలిచేదానికైనా ఉండాలని చెప్పాను. ఆ విధంగా అనేక చోట్ల ఉంది.

[Sri K. Koti Reddi] [3rd November 1954

ఇక గ్రేజింగ్ లేండ్స్ ఉన్నాయి. ఈ భూములన్నీకూడా ఎస్సైన్ అయిపోయినాయి అనుకుంటాను. అయినప్పటికి పశువుల మేతకోసం కొద్దిప్రదేశం పెట్టడానికి వీలుంటే ప్రయత్నం చేస్తాం. చాలాచోట్ల వీలుండదు.

అదే విధంగా గ్రామాల ప్రక్కనే గవర్నమెంట్ స్వాధీనం లో ఉన్న భూములు ఉన్నాయి. గ్రామాలు పెరిగి జనసంఖ్య అభివృద్ధి అవుతున్నది. స్కూలుకో, లేక ప్లే గ్రౌండ్‌కో లేక రీడింగ్ రూమ్‌కో లేకపోతే దేనికైనప్పటికి ఊరికి సమీపంలో ఉండే కొంత భూమిని గవర్నమెంట్ స్వాధీనంలో పెట్టుకొని ఉండకపోయినట్లయితే రేపు ఇబ్బంది వస్తుంది. ఆ విధంగా అవికూడా రిజర్వ్ చేయవలసివచ్చింది.

సరే, పోర్టు లిమిట్స్ని, కన్‌టోన్‌మెంట్స్ని అన్నీకూడా గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారి ఇష్టప్రకారం చేయవలసివచ్చింది. ఆ ప్రకారం చేశాం.

డొంకలు, దోవలూకూడా కావాలని చెప్తున్నారు. కెనాల్ పోరం బోకులను ఇవ్వడంవల్ల కెనాలును హెచ్చు చేయటానికి లేదు; కెనాల్ వెంబడి పోవటానికి లేదు. డొంకలను ఆక్రమించుకొన్నటువంటి సందర్భంలో అనేక అర్జీలు వస్తున్నాయి. ఇవన్నీ పూర్వంనుంచి ఉన్నవే. ఇవి ఇవ్వటానికి వీలుండదు. ఇస్తే ఆవూరు ప్రజలు అందరికీకూడా కష్టం వస్తుంది. కాబట్టి ఆ ప్రకారం చేయవలసి వచ్చింది. ఆ లిస్టులన్నీ అటువంటివే. అయితే దానికి ఒకటిచెప్పాం. ఈ దినం ఆక్షేపణలేకుండా ఉండి నిదానం మీద ఆక్షేపణకరమైనటువంటి సందర్భాలుకూడా ఉంటాయి. అటువంటి వాటిని ఇప్పుడు లీజ్‌కి ఇవ్వవచ్చునని ఉంది. కాలుకూడా హెచ్చుగా వసూలు చేయకూడదు. లేండ్ రెవెన్యూ ఇతర పొలాలకు ఏ విధంగా ఎసెస్ చేస్తున్నారో ఆ ప్రకారం ఎసెస్ చేయవచ్చునని ఉంది. మాటకే అనుకోండి, ఆఖరికి టేంక్ బెడ్ ఉంది. దాన్ని రిపేర్ చేయుటకుగాని, అభివృద్ధి చేసేదానికిగాని ప్రభుత్వం నాలుగు సంవత్సరముల వరకూ ఏమీ చేయలేకపోవచ్చు. ఈవేళ చేయలేకపోతే రేపుకూడా చేయలేమా ?

3rd November 1954] [Sri K. Koti Reddi]

అందువల్ల అటువంటి సందర్భంలో ఈ దినం వాటిని పూర్తిగా ప్రొహిబిట్ చేసేబదులు లీజ్‌కైనా ఇవ్వవచ్చని చేశాం.

ఇక ప్రాజెక్టుల విషయం. ప్రాజెక్టుల విషయంలోకూడా కొన్ని భూములు ఇవ్వకూడదని ఆటంకం చేశాం. అది వాస్తవమే. ఇప్పుడు నందికొండ ప్రాజెక్టు ఉందనుకోండి. చిన్న పెద్ద ప్రాజెక్టులు అనేకం ఉన్నాయి. వీటికి సంబంధించిన పెద్ద కాలవలకు, చిన్న కాలవలకు, ఛానల్స్‌కు భూములు కావలసివస్తవి. ఇప్పుడు జనరల్‌గా ఏదో ఎస్టిమేట్ వేసినా, ఫలానా చోటునుంచి ఫలానా చోటువరకు వేయవలెనని ప్రిలిమినరి ఎస్టిమేట్స్ ఉన్నప్పటికి, డిటెయిల్డ్‌గా వర్కింగ్‌కు వచ్చినప్పుడు వీళ్లు సర్వేచేసిన ప్రకారం జరుగుతుందని అనుకోడానికి వీలులేదు. కొంత డీవియేషన్‌కూడా కావలసిన సందర్భాలు చాలా ఉన్నాయి. అటువంటి సందర్భంలో ఈ భూములన్నీ ఇస్తే, రేపు కాలవలకు భూములు కావాలంటే అవి తిరిగి వీళ్ల దగ్గరనుంచి కొనుక్కోవలసి వస్తుంది. అంతేకాదు. ఇప్పుడు చాలా విలువ కలిగిన భూములన్నీ వీళ్లకు ఇస్తే ఈ ప్రాజెక్టు ఎస్టిమేట్స్ చాలా హెచ్చు అవుతాయి. ఏదైనప్పటికి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారుకూడా మనకు అప్పులు ఇస్తారో ఇవ్వరో అనేదికూడా ఒకటి ఉందనుకుంటాను. అదికూడా మనం గమనించ లేదు.

అమ్ముకునే హక్కు లేదుకదా, తీసుకునే హక్కులేదు. యీ ప్రాజెక్టులలో వుండే భూములు గవర్నమెంటుకు కావలసివస్తే, గవర్నమెంటు తీసుకొని public purposes కు వుపయోగించవచ్చు. అదీ భేదం. Heritable right వున్నప్పుడు, అమ్ముకొనే వంశపారంపర్యహక్కు వున్నది. అటువంటి సందర్భాలలో assessment యెంత వుంటుందో ఆ మొత్తానికే వారికి lease చేయవచ్చునని తీర్మానం చేశాము. ఆ ప్రకారంగా G. O. వెళ్లి వుంటుంది. ఈ విధంగా తీర్మానం చేశాము. కాబట్టి, అందులో గొప్ప తొందర యేమీగా వుండదు.

[Sri K. Koti Reddi] [3rd November 1954

ఇప్పుడు estates విషయంలో చాలా తకరాలు వున్నాయి. ఫలానా భూమి రైతుదా? లేక Goverenment కు వస్తుందా? అని చెప్పి తగవులు వున్నాయనుకోండి. ఇదంతా పరిశీలన చేసి, అది goverenment కు కావలసినదా? లేక ryot కు ఇవ్వవలసినదా? రైతుకు పట్టా యిచ్చే దానికి వీలుంటుందా? అనే అన్ని సందర్భాలలో Settlement Officer నిర్ణయించవలసి ఉన్నది. అనేక estates survey కాలేదు. Survey అయిన తరువాతకూడా Settlement Officers యిది రైతుదా? లేక గవర్నమెంటుదా? అనే తీర్మానం చేసుకోవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో స్థానికంగా యిబ్బందులు వుంటే వుండవచ్చు. అందుకు కూడా నేను instructions యిచ్చినాను. హెచ్చుగా plots వుండే చోట, మనం యిచ్చేదానికి వీలుంటే, యీదినం survey కాకుండా వుంటే, యితర యిబ్బందులు యితర తకరాలు, అనగా, రైతుకు గవర్నమెంటుకు తకరాలు వున్న భూములేమైనా వుంటే, అదీకూడా survey చేసి, పేదలకు యివ్వదలుచుకున్నాం. ఆ విధంగా instructions పంపించినాము. దీని విషయంలో యేమీ చిక్కురాదు. చిక్కు యెక్కడ వస్తుందంటే, గవర్నమెంటుకు, రైతుకు,— రైతునాది అనటం. గవర్నమెంటేమో మాది అనటం, ఆ చిక్కు పరిష్కారం అయ్యేంత వరకూ, రెండవ వారికి యిచ్చే వీలువుండదు. అటువంటి సందర్భాలలో చిక్కుగాని, తక్కిన భూములను సాధ్యమైనంత త్వరలో యివ్వడానికి ప్రయత్నం చేస్తాం.

**An hon. Member:**—Survey, settlement కూడా, లోగడ అయిపోయి నటువంటివి, కొంతవరకూ సరియైన పద్ధతులలో లేనటువంటివి విజయనగరం estate లోవి, యివ్వడానికి వున్న ఆటంకం యేమిటి?

**The Hon. Sri K. Koti Reddi:**—సర్వే అయివున్నా కూడా, గవర్నమెంటుకూ, రైతుకూ, తగాదాలు వున్నాయి. రైతు నాది భూమంటాడు, గవర్నమెంటు మాది అంటారు. ఇటువంటి సందర్భాలలో Settlement Officer కు అధికారం వున్నది. Settlement Officer

3rd November 1954] [Sri K. Koti Reddi]

నుంచి, tribunals కు appeal వుంటుంది. గవర్నమెంటు భూమి అయితే యివ్వగలం. రైతుభూము అయితే యిచ్చేదానికి వీలు లేదు. రైతు భూమా? గవర్నమెంటు భూమా? అని తగాదాలు వచ్చినప్పుడు, ఆ వివాద పరిష్కారం అయ్యేంతవరకూ, బీదలకు కూడా యిచ్చేదానికి వీలు పడదు. పరిష్కారం అయిన తరువాత, తప్పకుండా బీదలకు యివ్వవచ్చు.

కొల్లేరు విషయం అనేకమందికి తెలియకుండా పోవచ్చు. కొల్లేరు సరస్సు అంటారు. సరస్సు అంటే నాకు అర్థంకాలేదు. ఒకప్పుడు పిల్లప్పుడు యెప్పుడో జాగ్రఫీ (Geography) లో చదువుకొన్నాను. వర్షపునీరు, చుట్టుపట్లనుంచివచ్చే మురుగునీరు ఒక పల్లపు ప్రదేశంలో చేరడం వల్ల అది సరస్సు అయివుండవచ్చు.

గట్టుకు యింకొక ప్రక్కనవున్న భాగంలో engines పెట్టి కిట్ట పైకి నీళ్లుతోడి అక్కడ పైరుపెట్టి, ఆ నీళ్ళనే తిరుగ పైరులకు కావలసినంత వుపయోగించి కొల్లేరు ప్రాంతంలో పంటలు పండించబడు తున్నాయి. Engine పెట్టి, మరి యీ నీళ్ళను తీసి వేరే వేయకుండా అక్కడ పైరు పండేదానికి మార్గంలేదు. ఏదో కొన్నిచోట్ల వున్నది. నేను ఒకటి చూచాను. అట్లాంటిచోట్ల యేమీ యిబ్బంది లేదు. కొంత మంది కొద్దిగా యెకరా, అర్థయెకరాను, గోట్టాలమోస్తరు పెట్టుకొని ఆ గోట్టాలతో తోడి, ఆ ప్రకారం సాగుచేసుకొంటున్నారు. అటువంటి దానికి యేమీ యిబ్బందిలేదు. అటువంటి దానికి యెవ్వరూ యేమీ ఆటంకం పెట్టలేరు. పోయిన సంవత్సరము నేను ఒక చోటికి, స్వంతంగా పోయినాను, ఆ వూరిపేరు మరచిపోయినాను. అది ఏలూరుకు 4, 5 మైళ్ళ దూరంలోవుంది. శ్రీ మాగంటి సీతారామదాసు, Ex-M. L. C. దానిని సాగుచేస్తూ వచ్చినారు. ఆయన 100, 150 యెకరాలకు పైననే engines పెట్టి, పైరు చేస్తూ వచ్చినాడు. పైరు చేస్తూ వస్తే September, October ఆఖరుకు నాదగ్గరకువచ్చి యీ సంవత్సరము తనకే యీయవలెనన్నాడు. ఇంతలోపలనే, యీ

[Sri K. Koti Reddi] [3rd November 1954

engine దార్లకే కాకుండా Field Labour Co-operative Societies కు యిస్తే బాగుంటుందని ఒకటి రెండు complaints వచ్చినవి. ఇటువంటి సందర్భాలలో వీరంతా చేసుకోలేరా? ఇతడికి యివ్వవచ్చునా? అని కూడ ఆలోచించి, నేను స్వంతంగాపోయి, వీళ్లంతా నిర్వహించ గలరా? చేసుకోగలరా? అని విచారించు టకు ఆ వోటుకు పోయాను. నేను కొల్లేరు ప్రాంతానికి పోయి నప్పుడు, అనేకమంది యింజనుదార్లు వచ్చినారు. నేను స్పష్టంగా చెప్పినాను. వాళ్ళంతాకూడా, "మేము యెంతో డబ్బు ఖర్చు పెట్టినాము. engines పెట్టుకున్నాం. ఈ విధంగా చేస్తే యెట్లాగ?" అని అన్నారు. Field Labour Co-operative Society వాళ్లు engines తీసుకువచ్చి పెట్టి, అది మేము నిర్వహించుకొంటాము" అని అంటే, మీకు యిచ్చేందుకు కాదు, మీరు ఎంత నష్టపోయినా సరే." అని వాళ్ళముందర నేను స్పష్టంగా చెప్పినాను. Collector ను పిలిపించి, అదే విధంగా చెప్పాను. భూస్వాములకు, యింజనుదార్లకు సహాయం చేయాలని నాకు యెప్పుడూ వుండదు. నా colleague గా వుండే శ్రీ సీతారామ దాసుకు అయినా యివ్వకుండాపోతే యెవ్వరో తెలియనటువంటి యింజనుదార్లకు సహాయం యిస్తానని మీరు అనుకోకూడదు. అయితే ఒకటిమాత్రం చెప్పినారు. వాళ్లు మేము engines తీసుకువస్తాము loans యివ్వమన్నారు. Engines తీసుకువచ్చే దానికి మాకుండే పరిస్థితులలో loans యివ్వకుండా పోతేపోవచ్చు. ఆ కొల్లేరు భూము లలో పంట పండితేతప్ప, పంట పండకుండా పోతే వాళ్ళు గవర్న మెంటుకు ఒక దమ్మిడీకూడా యివ్వలేరు. అయితే భూమి యివ్వవల సిందని instructions యిచ్చినాను. Collector చాలా sympathetic గానే వున్నారు. అంతకంటె, ఆ విషయం గురించి, నాకు యెలాంటి ఆటంకం లేదు.

**Sri P. Venkata Siviah** :—మీరు చెప్పటం కాదు.

3rd November 1954]

The Hon. Sri K. Koti Reddi:—అవునయ్యా, మాతప్పేమీ లేదు. అందులో Field Labour Co-operative Society యింజను పెట్టుకొని, సాగుచేసుకొనే విషయంలోనే యివ్వమన్నాం. Engine పెట్టుకొని, సాగు చేసుకొనకపోతే, Government నష్టపడవలసి వస్తుంది. ఇవ్వాళ యెవరూ సాగు చేయకపోతే, సమ్మతమేనా మీకు ?

Sri G. Bapanayya:—వూళ్లో రైతులు అంతా పది యింజన్లు పెట్టుకొని, సాగు చేసుకొంటామని assurance యిస్తూ, Collector కూ మీకూ petitions పెట్టుకున్నారు. (interruption)

The Hon. Sri K. Koti Reddi.—Assurances ప్రకారం జరిగే నమ్మకం వుంటే, తప్పకుండా మీకేయిచ్చి వుండును. Collector చేయలేదని చెప్పి నాకేమైనా చెప్పినారా ? మీ petitions వచ్చి రెండు నెలలైనది. ఆయనకు పంపించినాము. Definite గా ఆయనకు instructions ఇచ్చినాము. ఆ ప్రకారంగా ఆయన చేస్తాడని నా నమ్మకం. అట్లా జరుపకపోతే. యేదో లోపంవున్నది. Field Labour Co-operative Society కి శక్తి లేకపోవటమే కాని, గవర్నమెంటు తప్పు యీ విషయంలో యేమీ లేదు. మేమేమైనా హెచ్చుగా కోరినామా? వాళ్లేమైనా హెచ్చుగా యిస్తామన్నారా ? మీరు హెచ్చుగా యివ్వరే. మీకు యిచ్చినాకూడా, assessment తప్ప, మరి అంతకంటె హెచ్చుగా వసూలు చేయటం లేదు. భూములను బీడులుగా పెట్టడం న్యాయంకాదు. శక్తివుంటె, మీరు చేసుకోవలసిందే. Engines, పెద్ద, పెద్ద యింజన్లు పెట్టుకుంటేకాని, సాగుకాదు. అది ఒక్కటే వచ్చేలోపం. ఈ సంవత్సరం జరిగింది. వచ్చే సంవత్సరం చేయండి.

Lanka Lands విషయం ఒకటి. Lanka lands అంటె ఒకప్పుడు నాకేమీ తెలియకుండా వున్నది. వీటి అభివృద్ధికి పూర్వము నుంచి గవర్నమెంటు ఒక పద్ధతిని అవలంబిస్తున్నారు. శాశ్వతంగా పట్టా

[Sri K. Koti Reddi] [3rd November 1954

లిచ్చిన లంకా లాండ్సు కొన్ని వుండవచ్చును. అవి ఎప్పటికికూడా మునిగిపోవు. కొన్ని లంకలు మాత్రము యీ దినము వుంటే రేపు వుండవు. కొత్తగా వచ్చేలంకలు కొట్టుకొనిపోయి యింకొకచోట లంకలు వేస్తాయి. ఇటువంటి లంకలకు గవర్నమెంటు సామాన్యమైన పద్ధతి అవలంబించాల్సి వచ్చింది. ఇదివరకు వేలాము వేసి కౌలుకు యిస్తున్న సందర్భాలలో మూడు సంవత్సరాల యావరేజి తీసుకొని ఆ మొత్తముకు ఈ ఫీల్డు లేబరు కో ఆపరేటివు సొసైటీకి ఇచ్చేట్లయితే వారికే మూడు సంవత్సరాలపాటు యివ్వాలని చెప్పాము. బీదలుగా వుండేవాళ్లకు యివ్వాలనేది చాల దినాలనుంచి వస్తున్న పద్ధతి. ఆ పద్ధతి ప్రకారము ఈ సంవత్సరము కూడా చేయమన్నాము. అనేక మంది చేస్తున్నారు. ఇంతేకాదు. ఈ సంవత్సరము ఎంతో రెమిషను యిచ్చాము. పోయినసారి పెద్ద పెద్ద వరదలు వచ్చినవి. అందులో ఎక్కువగా నష్టపడ్డారు. తహసీల్దారులు, డిప్యూటీ కలక్టరులు చేసింది పైవరకు ఏ లంకలుకాని నష్టపడ్డాయని రికమండుచేస్తే రెమిషను యిచ్చాము. ఇది వరకు వేలాలుపెట్టి మూడు సంవత్సరాలు యిస్తూ వచ్చారు. ఒకవేళ ఫీల్డు లేబరు కో ఆపరేటివులు చేసుకోడానికి వీలులేకుండా మీరు వేలాలు పెట్టవలసివస్తే ఒక సంవత్సరముకన్నా పైన రైతులకు యివ్వము. ఇది ఈ కో ఆపరేటివు సొసైటీల వాళ్ళమేలు కొరకే. లేక వారికి చెరుపు చేయవలెననే వుద్దేశ్యముతో చేయలేదు. అయితేమాత్రం మూడు సంవత్సరముల యావరేజి హెచ్చు, ఒకవేళ వాటిని వేలముపెడితే తక్కువరావచ్చు, అప్పుడు లంకలు మాకు యివ్వకూడదా అంటున్నారు. దాంట్లో ఒక దోషము వుంది. ఏమిటి అంటే, ఈ దినము వుండే పద్ధతి మార్చి వేలాముపెట్టి వేలములో హెచ్చుమొత్తం ఇస్తామన్నవారికి ఇవ్వకుండా యితరులకు యిచ్చినట్లయితే రేపు ప్రొద్దున వేలానికి ఎవ్వరూరారు. ఈ ప్రొద్దు వేలానికివేస్తే ఏమి వుపయోగము. గవర్నమెంటు కావలసిన వాళ్లకు యిచ్చారు అంటారు. మేము ఎందుకు వేలానికి పోవలెను అంటారు? వేలముపెట్టి ప్రయోజనము లేదన్న సంగతి నాకు తెలుసు

3rd November 1954] [Sri K. Koti Reddi]

అందులో చాలా అపాయము వుంది. దానిని గమనించి ఒక సంవత్సరము యివ్వమన్నాను. వచ్చే సంవత్సరానికి తిరిగి మూడు సంవత్సరాల యీనాం మొత్తం మీరు యిచ్చేట్లయితే తప్పకుండా ఈ బిల్లు లేబరు కో ఆపరేటివ్ సొసైటీకి వస్తున్నది. ఒకవేళ ఆ విషయంలో ఏదైనా చర్య తీసుకోవలసి వస్తే ఆలోచిస్తాము.

Sri Chandra Ramalingaiah:—ఇప్పుడు ఈ లంకలను క్లాసిఫై చేసి వాటికి రేటు నిర్ణయము చేస్తుందా ?

The Hon. Sri K. Koti Reddi:—మీ సలహాను అంతాకూడా ఆలోచిస్తాము.

Sri K. Krishna Rao:—Is there any time limit for the Hon. Minister's speeches.

The Hon. Sri K. Koti Reddi:—అందువల్లే తొందరపడి మాట్లాడుతున్నాను. మీరు అంతా డిస్టర్బుచేయకుంటే చెప్పవలసిన రెండు, మూడు విషయాలు చెప్పేస్తాను. ఈనాము టెనెంట్సు విషయము కూడా చెబుతాను. దయచేసి ఇంకో అయిదు నిముషాల టయము యిప్పించండి. హిస్టరీ అంతా చెబితే చాలా టయము తీసుకుంటుంది. ఈనాము రైతులను తొలగిస్తున్నారని, వారికి రక్షణ కలుగజేయాలని కొంతమంది సభ్యులు తెలియజేశారు. ఆ విషయమై ఆలోచిస్తున్నాము. ఈనాందారుల పరిస్థితులు కూడా మనము ఆలోచించవలసి ఉంది. ఈనాందార్లలో పేదవారు కూడా ఎంతోమంది ఉన్నారు. ఈ విషయంలో ఈనాందార్లనుండి ఎన్నో మెమోరాండాలు వస్తున్నవి. ప్రస్తుతము, వున్న యీనాములను పంచుకొన్న పేద కుటుంబాలు 30, 40, 50, 100 వున్నాయి. 10, 30, వంతులు పంచుకొని వుండే యీనాందార్లు ఎంతోమంది వున్నారు. అయితే కావలసినంత ప్రత్యేకమైన వివరాలు అందలేదు. అవి రివిన్యూ డిపార్టుమెం

[Sri K. Koti Reddi] [3rd November 1954

టులోనో, తహసీల్దార్ల వద్దనో, గ్రామకరణాల వద్దనో వున్నాయి. అవి అన్ని వచ్చేదానికి చాలా కాలము పడుతుంది. యీనాందార్లు ఎంతో మంది ఎన్నో కుటుంబాలు వున్నాయి. వాళ్ళు మనిషికి అయిదు ఎకరాలు, పది ఎకరాలు, యిరువది ఎకరాలవంతున పంచుకొని అనుభ విస్తున్నారు. ఈ విషయము గురించి స్టాటిక్సు అడిగి ఉన్నాము. అవివస్తే ఆలోచన చేయవచ్చును. యీనాందార్లకు కూడా రక్షణ అవకాశాలు కల్పించడము అవసరము అవుతుంది. యీనాందారులకు ఇవ్వవలసిన శిస్తులు కూడా రైతులు అనుభవిస్తున్నారు. ఆక్యుపెన్సీ రైటు ఇన్ని సంవత్సరములుగా వీరు అనుభవిస్తున్నారు. ఈనాం రైతుల విషయంలో ఒక అర్డినెన్స్ జారీ చేశాము. ఇప్పుడు బిల్లు కూడా పబ్లిషు చేశాము. ఇదిటెంపరరీ లెజిస్లేషను. ఏది న్యాయంగా వుంటుందో ఆ ప్రకారము చేద్దామనే అభిప్రాయంతో ఈ రెండు విధా లుగా ఒక ప్రక్కన టెనెంట్సుకేమో ప్రొటెక్షను, ఈనాందారుల కేమో వాళ్లకు మామూలుగా ఇచ్చేటటువంటి రెంటులను మాత్రము యివ్వవల సిందని ప్రొవిజను చేసినాము. నేను శ్రీకాకుళము, విశాఖపట్టణము జిల్లాలకు పోయినప్పుడు అనేకమంది నావద్దకు రాయబారము వచ్చి నప్పుడు టెనెంట్సును ఎవిక్టు చేయము అని చెప్పినారు. అనేకమంది మంది రైతులు ఇదివరకటినుంచి శిస్తులు యిస్తున్నాము యికముందు కూడా యివ్వడానికి సంసిద్ధంగా వున్నాము, వాళ్ళు కూడా చాలా బీదవాళ్ళు అని చెప్పేవారు. నేను అక్కడకు పోయినప్పుడు టెనెంట్సు కూడా ఈ మాట చెప్పారు.

ఇనాందార్లు కూడా వాటిమీదే ఆధారపడిఉన్నారు. కొన్ని కొన్ని సందర్భాలలో వారు ఎంతో పేదవారుగా ఉన్నారు. కొంతమంది పెద్ద భూస్వాములు కూడా ఉన్నారు, అప్పులు యిచ్చే వారుకూడా ఉన్నారు. న్యాయ సమ్మతమైన రిలీఫ్ కావలెను. ఒకరికి న్యాయము ఇంకొకరికి అన్యాయము చెయ్యవలెనంటే కాంగ్రెసు ఒప్పు

కొనదు. ప్రజలకు కాంగ్రెసు యందు నమ్మకము పోయిందని మీరు చెబుతున్నారు. నేను నమ్మను. మొన్నటి ఎలక్షన్లు బట్టి చూస్తే తెలుస్తుంది. ప్రజలు మామీద అభిమానముతోనే ఉన్నారనే నమ్మకం ఉంది. మాకేమి ఈ మంత్రిపదవులు శాశ్వతంకావు.

ఇక రెంటు రిడక్షను ఆక్టు తాలూకు బిల్లు examination లో ఉన్నది. ఎటువంటి కేసులలోనైనా హెచ్చు వసూలు చేస్తే compensation లో తగ్గించి అడ్జెస్టు చెయ్యవచ్చును అని అన్నాము.

Flood ను గురించి గవర్నరుగారి ఉపన్యాసములో ఏమీ లేదన్నారు. మొన్న జరిగిన నష్టముల గురించి ఇన్ఫర్మేషను మాకు రాలేదు. గుంటూరు విషయములో మాకు కొంత ఇన్ఫరుమేషను వచ్చింది. ఎక్కడైనా flood జరిగినా, fire accident వచ్చినా కలక్టర్లకు జనరలు పర్మిషను ఇస్తూ ఆర్డర్లు ఉన్నవి. తిండిలేకపోతే అరేంజిమెంట్లు చెయ్యవలెనని, కొట్టం పోతే ఈవిధంగా ఇవ్వవలెనని ఆర్డర్లు ఉన్నవి. అన్ని సక్రమముగా జరుగుతున్నవి. తాత్కాలికముగా ఇయ్యవలసిన రిలీఫు విషయంలో రూ 20 రూ 30 లు ఇచ్చేదానికి అవకాశం ఉంది. మైనరు ఇరుగేషను చెరువులు, కాలవలు, మొదలైన వెంటనేమరమ్మతులు జరుగుతూవున్నవి పైకం శాంక్షను కాకపోయినా పనులు జరుగుతూ ఉన్నవి. ఇబ్బందులు ఏమీ లేవు. పొద్దుకూకులా అనుమానములు పడుతూఉండడం నాకు తెలియదు. ప్రజలకు మామీద విశ్వాసము లేకుండపోతే సంతోషమే. మా అంతట మేమేమాను కుంటాము.

Deputy Speaker:—ఇప్పుడు సభ వాయిదా వేస్తున్నాను. మరల రెండు ఘంటలకు సమావేశము.

The Home adjourned for lunch

AFTER LUNCH - 2 P. M.

**Sri P. V. R. Gajapathi Raju:—Mr. Speaker, as usual the Andhra Assembly session seems to be beginning with a**

[Sri P. V. R. Gajapathi Raju] [3rd November 1954

crisis. A no-confidence motion is on the anvil and as such there seems to be an element of the 'unreal' as far as the present debate is concerned. One thing is apparent. The Government has come forward with a list of its achievements during the last year and I suppose the expectation is that when we discuss this list of achievements and after the Government has vindicated itself against this list, any adverse vote if it does take place on the no-confidence motion may be forgotten. That is as far as the moral aspect that the no-confidence motion has against the Congress party. But in deciding the question of the record of the Congress party in office during the last one year, I am pained to point out that the party in office has achieved the mutilation of the spirit of the Indian Constitution in regard to the development of Legislature sessions. We had one session for a whole year and as the Governor has pointed out, his very first few words started with the premise that it is a privilege to address this Assembly. As per the Constitution, this privilege should be granted more often to the Legislature during the year and it is normal for a legislature to treat a year from budget session to budget session. The principle of treating a year of parliamentary activity from 1st October may be sentimentally valid as far as the Andhra State is concerned. But I feel that the sooner we realize that our methods should be attuned with the methods of the rest of India, it would be better. We need not continue to feel that we are a new State and by virtue of the fact that we achieved this State on the 1st October we continue to use this date for an assessment of Governmental work annually. If the principle of looking upon 1st October is accepted by us, I have nothing against the date, 1st October. Let us have the the budget session annually from 1st October. Because surprisingly enough this Governor's Address has reversed the fiscal taxation structure in our State by coming forward with basic structural financial changes. I know that the decision to change the taxation method and structure is the

outcome of a political opportunism on behalf of the party in office In view of the fact that a no-confidence motion is there, the Government develops a hotchpotch approach to the problem of political survival and economic development and in the mid-term of the revenue year, new taxations and new tax exemptions are attempted to be introduced. The confusion that arises is best demonstrated in para 10 of the Governor's Address. It starts by saying that the Government have appointed a Land Reforms Committee. The next paragraph merely makes the hackneyed statement that the poverty of the majority of our ryot population is recognized by all. Having said that and developed a concept of new taxation in the State, they go to the third paragraph that we have a deficit and have to make up this deficit by introducing a new concept of taxation The psychological confusion of this one paragraph is evident With the one hand the Government wants to give and with the other hand it proposes to pauperize. I do not know under what principles of economics this Congress party in office functions. Either it should believe in capitalist **laissez faire** and the taxation of the poor for the benefit of developing an industrial economy or it should believe in socialist economy and plan the whole thing in a systematic manner. Let me examine this so-called great' benefit that is being given to the people of Andhra.

All land holdings upto a land revenue of Rs. 10/- are to be exempted, a perfectly first-class and valid idea if it had been given on the 1st of March. It causes administrative upheaval when it comes in the middle of the year. Further, when we discuss the question of introducing this reform, the incidence of taxation is between Rs. 1. 0 to Rs. 1. 5 crore or nearabout that figure, while the total land revenue in-take of the Government is about Rs. 2. 0 cores. What is the level of the amount of taxation that remains to be collected by the State? It is Rs. 60. 0 lakhs. Is it necessary to continue with the land revenue system in the State? That is the question. The Taxation Enquiry Com-

[Sri P. V. R. Gajapathi Raju] [3rd November 1954

mission have devoted in their report about 50 or 100 pages as to whether land tax is a direct tax or indirect tax. And modern fiscal experts would hold that all direct taxations are regressive and therefore we should have an indirect tax. The confusion arises here because, as I pointed out, paragraph 9 attempts to synthesize the Revenue Minister into the Finance Minister and as such, whether the opinions of the Finance Minister hold in this decision or the opinions of the Revenue Minister, one is unaware I am not in a position to say because the Revenue Minister has already spoken and he has been extremely silent on this issue. Possibly the collective interest of the Cabinet is involved whether this spectacular step will justify their continuation in office. I have in this context a definite suggestion to make: the Government, having committed a blunder of acting without forethought, should exempt all land revenue now that this has been undertaken. Let us not collect any land revenue whatsoever and if the Government requires new sources of revenue, the concept of a definite indirect tax on agriculture may be instituted in our State. The simplest direct method which can very easily be done is to introduce an agricultural income-tax based on the aggregate holding of the peasantry and also the concept of crop production. The State can regulate its agriculture in this State. The Government can regulate its collections by introducing a variable taxation on commercial produce in our State and also the food grain crops of our State. The net issue that would arise from this laudable act of abolishing land revenue. I am not decrying it and I do not want people to misunderstand me that I am against it, is that the administration must be snobbish enough to state that the technique of administration is not the technique of Panchayat Board. The Government tries to prove its superiority over Panchayat Boards, Municipal Councils and District Boards by appointing Inspectors of Local Boards and a Minister is in charge of that, and the main complaint is that the representatives elected at that level are unfit to govern them-

3rd November 1954] [Sri P. V. R. Gajapathi Raju]

selves. The reason for that is that certain rules, regulations and concepts are placed for the smooth working of the administrative machine. In the same manner, no Inspector of Local Boards is appointed to control our Ministers unfortunately. Otherwise they would really understand that this concept of changing the basis of taxation to suit coffee club technique and find Votes in the Panchayat or District Board or Municipal level should not be resorted to If they are going to exempt all holdings below Rs. 10/- land revenue, the State must consider the implication of such a reduction on the sum total of agricultural prosperity in our State Today by virtue of the abolition of the zamindaris, all land in the Andhra State whether ex-zamindari or ryotwari, comes under this exemption. However, there is that one section of the inamdar villages that still continues. Mr. Koti Reddi in the very end of his speech, at about 2 minutes to One, said a few words regarding inamdars. I am not here to take the milk out of the mouths of suckling babies of inamdars. The attitude that they are poor inamdars does not concern me. I am merely concerned with the direct relationship of a peasantry towards the State and therefore to me any appraoch of the smacking of the humaintarian that there are poor inamdars does not appeal to me. The second accusation made by Mr. Krishnamurthi Rao against me also does not appeal to me because I will be the first one to say that if I transgress the lands of the State, I may be tackled according to those very laws. Unfortunately the Government today wants to cater to the vested interests of the inamdars. About 2,000 to 3,000 villages remain to have a uniform land tenure system in our State and also benefit from this Rs. 10/- exemption. On the one side, for all the villages in Andhra, the Government are giving tax exemption both zamindari and ryotwari villages, and on the other hand these inamdar villages that remain are to continue in tact because there are few small inamdars who prefer indirect collection to personal agriculture. (At

[Sri P. V. R. Gajapathi Raju] [3rd November 1954

this stage, Mr Speaker, resumed the chair.) Nobody is stopping the inamdar from cultivating a minimum holding of land which ultimately the State must precrible if agrarian property is to develop. Merely because of that fact, to sacrifice these inam villages to a continuation of the haphazard tax methods of a few eccentric individual inamdars, is a scandal. Not only that, this Government would go further and wherever Settlement Officer in the past has notified a village that it should come under the Rent Reduction Act and wherever in a subsequent appeal to the Estates Tribunal the decision or finding that such a village is a whole-inam estate and wherever it was negativized, such villages shall go off the concept of the Rent Reduction Act. So, we are fighting that not only such villages that were notified, but also such villages that were not even notified should come under this Act. We are now told that all such villages should go off this notification and the inamdars or owners of these villages should collect a six-year rental overnight.

The tragedy is there when you find that in a number of these villages for six or seven years last the rentals could be collected. I can give my own instance as an example. Mr. Krishnamurthy Rao talked of a writ petition in the High Court. I would give him some information which is more germane to the point. There are three villages in the Vizianagaram Estate, which are joint family property. At one time, in 1840 or 1850, an adjustment took place between the Bobbili Estate and ourselves regarding the collection of rentals in these villages. To-day under this notification of the Settlement Officer they were found as not part of the Vizianagram zamindari because they were rented by Bobbili; and by virtue of the fact that they are our joint family — for, my mother, my uncle, my grandmother and various other members of my family have interest in those villages, — these three villages, with a demand of fifty thousand rupees per annum, does not come under the purview of the Impartible Estate Act. However,

3rd November 1954] [Sri P. V. R. Gajapathi Raju]

one thing has happened. For the last six years we had collected no rentals from these villages, because the Rent Reduction Act has been applied to them, and the process of the dispute in the Revenue Court between my family and the Settlement Officer, it was found the ryots would not pay anything Now, you give me a **carte blanche.** I could collect (when I say, 'I' I mean my family) fifty or sixty thousand per annum, which is the demand of these three villages, or worse the demand. But I can collect with retrospective effect the sixty thousand for six years, and also not only collect this four lakhs or three lakhs and fifty thousad that is availble under a legal right but go to the extent of jacking up the rental by double or treble the demand, if I so please. That is the opportunity you give to the vile corrupt aristocracy or the defunct aristocracy or or the defunct feudalism. And in the same way you want to give to these petty inamdars that same right! I want to ask you, 'is this justice, is it a record of success or a total hypocrisy bordering upon opportunism.' Thank you.

Sri G. Latchanna :—అధ్యక్షా ! రెండు రోజులనుండి గౌరవ నీయులైన సభ్యులు ఈ గవర్నరుగారి సందేశముగురించి వారి వారి అభి ప్రాయములు తెలియచేసేరు. ఈ గవర్నరు సందేశము మీాదను ఇంతవరకు ఉన్న సంప్రదాయరీత్యా ప్రభుత్వపక్షములో ఉన్నట్టి యువకులకు ఇచ్చే అవకాశం ఈనాడు పెద్దలకు ఇచ్చినందులకు ప్రభుత్వపక్షాన్ని ప్రత్యేక ముగా ధన్యవాదములు అర్పించాలి. కొత్త కొత్తగా మనకు ఆంధ్రరాష్ట్రం వచ్చింది. ప్రపంచంలో లేని నూతన సంప్రదాయాలను సృష్టించడానికి అవకాశం కల్గింది. ఈ అభినందన తీర్మానములో కూడా యువకులకు ఇచ్చే అవకాశము పెద్దలైన వరదాచారిగారికి ఇచ్చినందుకు ప్రభుత్వాన్ని ప్రత్యే కముగా అభినందించక తప్పదు.

ఈ సందేశంలో ప్రభుత్వం ఇంతవరకూ చేసిన ఘనకార్యాల జాబితా గవర్నరుగారు చదివి వినిపించేరు. వీటిని అన్నింటిని మనము చదువుకొంటే

[Sri G. Latchanna] [3rd November 1954

నిజముగా ఎప్పుడైనా స్థిరమైన పోలిసీగాని, సుస్థిరమైనట్టి విధానముగాని కార్యక్రమముగాని ఈ ప్రభుత్వానికి ఉన్నదా ? అంటే లేదు అని చెప్ప డానికి పెద్ద ఆర్గ్యుమెంటు అవసరంలేదని నేను చెప్పగలను. ఒకవిధానము మాత్రం ఉన్నది, అదల్లా ఒక టే. ఏమాటలు చెబితే మనము సమస్యలను దాటిపోగలము అన్న దే అది వాస్తవిక దృష్టిలో సమస్యల పరిశీలించే విధానము ఈ ప్రభుత్వానికి లేదనేది నేను ప్రత్యేకముగా చెప్పనవసరంలేదు. మరొక విధానము ప్రభుత్వానికి ఉంది. ముఖ్యముగా ఏదైనా సమస్యవస్తే ఏది చెబితే ఈ సమస్యను ఇప్పటికి దాటిపోగలము అనేది. ఈ విధానముల గురించి ఉదాహరణలు చెప్పవలెనంటే వందన్నర ఉన్నవి. గంభీరముగా నిబిడీకృతంచేసి 19 పేజీల గ్రంథము గవర్నరుగారు చదివి వినిపించేరు. ఈ విధానముల గురించి ఒక్కటొక్కటే తీసుకుంటే మొదట ల్యాండు రిఫారము ఉన్నది. అది ఒక ఉత్కృష్టమైన విధానమని చెప్పడానికి అవ కాశం లేదు. పేదరైతుల నుండి శిస్తులు వసూలుచెయ్యడం అనేది ఏ సూత్రము మీద ఆధారపడి ఉంది. ఏవ్యక్తైనా సంఘములో, తన కడుపుకు చాలీ చాలని ఆదాయము తెచ్చుకొన్నట్లైతే వాటిమీద పన్నులు వెయ్యాలని నేను చెప్పలేదు. అటువంటి పరిస్థితులలో 10/- రూపాయల లోపువారికి శిస్తులు మినహాయించినామని ఆకాశంమీదనుంచి ఒక పిడుగు పడ్డట్లు ప్రకటన చేసినారు. దాని గురించి మంత్రులు వారి కాబినెటులో చర్చించుకొన్నారో లేదో తెలియదు. ఈవిధముగా ఆకాశం నుంచి పిడుగు విడిచిపెట్టేరు. ఆ మాఫీ చివరికి ఎంతవరకు వర్తిస్తుందో వివరములు తెల్సుకొనడానికి నెల రోజులు పట్టింది. వినాదముల ముందు చేసిన తరువాత వాటిని గురించి వాదించడం ప్రభుత్వానికి పరిపాటి. ముందు 10 రూపాయల లోపువారికి శిస్తుతగ్గిస్తాము అన్నారు. ఎవరెవరికి ఎంతవరకు వర్తిస్తుందో చెప్పడానికి నెల రోజులు పట్టింది. ఏవిధముగా అమలులోనికి వస్తుంది అనేది ఇంకా చర్చించాలి అంటున్నారు. ఇది ప్రభుత్వ పాలసీలకు సంబంధించి నంతవరకు.

నేడు పేదలకు 10 రూపాయలు లోపువారికి శిస్తు తగ్గిస్తామని చెప్పేరు అయితే తిండిలేక అలోలక్ష్మణా అని రోడ్లమీద కుళ్లి చచ్చేవారి మీద సేల్సు టాక్సు తెచ్చిపెడుతున్నాము. 10 రూపాయలు భూమి శిస్తు చెల్లించే వారు పేదవారని ప్రభుత్వం గుర్తించినప్పుడు, ప్రభుత్వం ఇల్లు వాకిలి లేకుండా నిరుద్యోగులుగా రోడ్లమీద తిరిగేవారి నెత్తిన బండరాయి వేసి నట్లు కాదా ? ఈ సేల్సు టాక్సు విధించడం అని నేను మనవిచేస్తున్నాను. ప్రభుత్వానికి స్థిరమైన పోలసీ లేదని వెల్లడి అవుతున్నది. ప్రజలు ఏదో ప్రేమ చూపిస్తారని ఆకాశంవైపు చూస్తూఉంటే మనము భూగర్భములో భవనాలు కడుతున్నాము. దీనికి సుస్థిరమైన కార్యక్రమము, విధానము లేదు.

ఇనాము రైతుల సమస్య తీసుకోనండి. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో బహిరంగముగా బల్లగుద్ది తెన్నేటి విశ్వనాథంగారు అండగా ఉండి శాసనసభలో బిల్లును ఓడించినారు. అటువంటి విశ్వనాథంగారు ఈనాడు మన నెత్తిన ఇనాముల బిల్లు పెడుతున్నారంటే దీనికి ఒక విధానము ఉందనడం ఎలాగ. తిరుపతి దేముడైన శ్రీ వెంకటేశ్వరస్వామి సన్నిధిలో కాంగ్రెసుపార్టీ, కాంగ్రెసు కమిటీ అన్నిరకముల ఇనాములను చేరుస్తామని, ఏ ఇతర పార్టీకి తీసిపొయ్యేది లేదని తీర్మానం చేస్తే, కాంగ్రెసు పార్టీకి, కాంగ్రెసు కార్యవర్గానికి సర్వాధికారం వహించిన జనరలుబాడీ సమావేశంలో ఈ తీర్మానము పునరుద్ఘాటించినపుడు ఎందుకు సందేహించవలెను. ప్రజలు దురభిప్రాయ పడతారేమో, అటువంటి దురభిప్రాయమునకు ఎందుకు అవకాశం ఇవ్వవలెను. ఈ క్యాబినెటులో అయిదుగురు ఉన్నారే కాంగ్రెసు వారు. ప్రజాపార్టీ వారు, P. S. P. వారు కూడా మీవెనకాల ఉన్నారే. ఆ తీర్మానములతో సంబంధము లేదని విశ్వనాథంగారు ఆరోజు చెబితే విశ్వనాథంగారు కాంగ్రెసు పక్షంవారు కారు కాబట్టి అని కాంగ్రెసు మిత్రులు చెబుతూ ఉంటే అట్లే వారికి నేను ఎంతమాత్రం తగ్గేవాడను కాను అని కోటిరెడ్డిగారు చాలా గొప్పగా చెప్పేరు. కాంగ్రెసు

[Sri G. Latchanna] [3rd November 1954

పార్టీ తీర్మానాలకు, ప్రభుత్వ విధానాలకు సంబంధంలేదని కోటిరెడ్డి గారు చెప్పేరు. ఆచరణలో చేసి చూపెట్టారు. గజిట్ నోటిఫికేషను చేసి పెట్టేరు. మేము ఇదివరకు పొరపాటున ఇనాముల క్రింద డిక్లేరు చేసినాము, ఇవి రద్దుచేసేదానికి శాసనము తీసుకురావలసి ఉంటుందన్నారు. అన్ని గ్రామాలకు Estate Land Act వర్తింప చెయ్యడానికి సిద్ధముగా ఉన్నామని తిరుపతి వెంకటేశ్వరుల వారివద్ద తీర్మానము చేసినారు. దానిని ఇప్పుడు కోటిరెడ్డిగారు తప్పుకొంటున్నారు. దానిని పచ్చిదుర్మార్గము అని చెబితే unparliamentary కాదేమో.

ఇంక కుప్పుస్వామి కమిటీ వుంది. ప్రభుత్వ విధానాలను గురించి చెప్పుకోడానికి ఇది మరొక ఉదాహరణ. దానినిగురించి పత్రికలలో మూడునాలుగు రోజులకు ఒకవార్త పడుతోంది. ప్రొహిబిషను గురించి ప్రత్యేక్య motion వున్నది కాబట్టి ఆ విషయం no-confidence motion కు విడిచిపెడుతున్నాను. ఇంకకుప్పుస్వామి కమిటీగురించి రిపోర్టురానివ్వండి అన్నారు. రిపోర్టువచ్చింది. పరిశీలన చేస్తున్నాం అన్నారు. తరువాత అమలుపరుస్తున్నారు అని కూడా వార్తలు వచ్చాయి. ఇంక పత్రికా విలేఖరులే వార్తలు కల్పిస్తున్నారంటే దానికి అప్పీలులేదు. పత్రికలలో వచ్చిన వార్తలనే నేను మనవిచేస్తున్నాను. మంత్రిగారు కూడా కుప్పుస్వామి కమిటీ రిపోర్టుననుసరించి ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయుల జీత భత్యాలు అమలుచేస్తున్నాం అని చెప్పినట్లు పత్రికల్లో చదువుకున్నాం. అది అమలుపరిచేదానికి కొన్ని అభ్యంతరాలు వున్నాయి, తరువాత అమలుచేస్తాము అన్నారు. ఈ విధానాలన్నీ కాలమాన పరిస్థితులు ప్రకారం మార్కెటులోని విలువల ప్రకారం నమయానుకూలంగా మార్చబడడం సనాతన కాలం నుండి పట్టుబడింది. ఈ ప్రభుత్వానికది పుట్టుకతోనే పట్టింది. మధ్యలో మారుతుందనుకోడం పొరపాటు. ఆపద మ్రొక్కులుగా స్టేటుమెంట్లు మాత్రం ఇచ్చి ప్రజలను తృప్తిపరుడచూచే విధానం ఇది. ఇరిగేషను గురించి చాలామంది మిత్రులు మాట్లాడారు. ఆంధ్రదేశం జార్జా

గ్యం ఏమిటంటే precious projects అయిన నందికొండ గాని, రాయలసీమకు ప్రాణాధారమైన తుంగభద్ర హైలెవెలు ఛానలుగాని, విశాఖపట్నం హార్బరులో సంజీవరెడ్డిగారు మూటకట్టి వుంచిన కోటిరూపాయిల వంశధారగాని, ఇంతవరకు ఏమీలేదు. చావు బ్రతుకుల మధ్య సాగుతోంది ఈ రథం, ఈ విధానం ఎంతకాలం సాగుతుందో అంతు ఎక్కడో తెలియదు. ఈ దౌర్భాగ్య స్థితికి కారణం ఏమిటి? ప్రభుత్వ పాలసీని స్పష్టపరిచే గవర్నరు సందేశంలో చెప్పవలసింది ఇదేనా? ఇంక medium irrigation projects గురించి సాలి గ్రామాల మాదిరిగా రాళ్లు పడుతున్నాయి. కాపుదల పెడితేనేగాని వుంటాయో లేవో తెలియదు. ఇరిగేషను విధానంలో ఎక్కడా స్థిరత్వంలేదు. ప్రారంభోత్సవాలు చేసి foundation stones వేస్తున్న irrigation projects కు కూడ provision వున్నదా అంటే వచ్చే సంవత్సరంలో చూస్తాము అని శ్రీకాకుళం వచ్చినపుడు విశ్వనాథంగారు చెప్పారు. ఇదివరకు ఒక incident జరిగినది. 1947-48 లోనో 48-49 లోనో జ్ఞాపకంలేదు; వెంకట్రావుగారు, గోపాలరెడ్డిగారు మంత్రులుగా వున్న ఉమ్మడి రాష్ట్రంలో ఈ వంశధార ప్రాజెక్టు గురించి రు. 68 లక్షలు చూపించబడింది. అందులో మాకు రు. 6 లు దక్కలేదు. అటువంటి పరిస్థితుల్లో ఈ విధానాలు సాగుతున్నాయి. బడ్జెటులో provisions చూపించిన వాటికే దిక్కు దివాణంలేదు. ఈ foundation stones క్రింద ఎంత ఖర్చు అయినదో నాకు తెలియదు. కాని మొత్తం ఈ ప్రారంభోత్సవాల కైన ఖర్చుతో ఒక minor irrigation project తయారై వుండేది అని నా నమ్మకం. ఇవి అంతా దేనికి? ప్రజా ప్రభుత్వాలు అని చెప్పుకోవాలనే ఉద్దేశం, విశ్వాసం, హృదయం కనుక వుంటె మేము ఈపని చేస్తాము అని చేసిచూపించి ఈ ఏడాదికి ఇంతకన్న చేయలేము; మాకు ఈ ఏడాది ఈ సాధకబాధకాలు వున్నాయంటె ప్రజలు హర్షిస్తారు కాని ఏదో చేస్తాము అని వందలకొద్ది కబుర్లుచెప్పి పాతపాటలే పాడుకోడం సరియైన ప్రభుత్వవిధానం కాదు. Palm products గురించి చెప్పారు. చక్కని తేనెపలుకులతో ఆరు మాసాలబట్టి చెబుతున్నారు. పదాలు

[Sri G. Latchanna] [3rd November 1954

మారుతున్నాయి కాని విషయం ఒకటే. నీరా తీసుకోడానికి పర్మిషను యిస్తాము అని మంత్రిగారు చెప్పారు. ఆ తీర్మానం ఏమైనది ? అది క్యాబినెటు రికార్డులలో రికార్డుచేసి వుంచారా ? నిజమే అయితే ఆపేజీలను చింపకుండా వుంచారో లేదో తెలియదు. ఆ తీర్మానం అంతగా బల్ల గ్రుద్ది చెప్పింది ఏగాలికి ఎగిరిపోయిందో తెలియదు. ఇంక నీరా భవనాలు ఎక్కడ వున్నవో నాకు తెలియదు. ఈ నీరా భవనాలు ఏ త్రిశంకు స్వర్గంలో కడతారో, భూమిమీదే కడతారో, భూగర్భంలోనే కడతారో తెలియదు. దానికి machinery ఎక్కడనుంచి వస్తుందో తెలియదు. ఇదిగో బుట్టవేసాము, అంటే మామిడిపండుతో కూడా చెట్టు వస్తుంది అంటున్నారు. ఏడు సంవత్సరముల బట్టి జరుగుతోంది. కొంతకాలం కొందరిని మోసంచేయగలము. ఎల్లకాలము చేయగలమా ? ఈ విధానాలను కట్టిపెట్టి ఇప్పటికైనా ఎసంబ్లీ తీర్మానాలను గౌరవిస్తే ప్రజాస్వామిక వాదులము అని చెప్పుకోడానికి 10% హక్కైనా మిగులుతుంది. లేకపోతే అదికూడా వుండదు. బంజరు భూముల విషయంలో ప్రతిపక్షం తరఫునుంచి వచ్చిన అనధికార తీర్మానం అంగీకరించినారు. మార్చిలో తీర్మానం పాసయితే జూలైలో రూల్సు తయారైనాయి. ఆ G. O. లో వుండే conditions చూస్తే అరంగుళము భూమి ఎవరికి మిగలదు. రొంపేరు విషయంలో ఏదో మిగులుతుంది అంటున్నారు. మా శ్రీకాకుళం జిల్లాలో బంజరు భూముల పంపకానికని ఉద్యోగులను వేయడం; వేసిన మూడు రోజులకే తీసివేయడం, కారణం ఏమయ్యా అంటే ఇంకా సర్వే కాలేదు అన్నారు. ఈ సర్వేలు పూర్తిఅయి, పేదలకు పంచే స్థితి వచ్చేటప్పటికి, నాలాంటి పొడుగుచేతుల వాళ్లు ఏమైనా మిగులుస్తారా ? ఎలాగయ్యా ఈ సమస్య పరిష్కరించేది అంటే రెవెన్యూబోర్డు ద్వారా రావలసిందే, red tape జరుగవలసిందే. పరిశీలిస్తున్నాం, పరిశీలిస్తున్నాం, ఇదే సమాధానం. ఏ short notice ప్రశ్న వేసినా ఒకటే ప్రభుత్వ జవాబు శ్రద్ధగా పరిశీలిస్తున్నాం అని. ఈ విధానమువల్ల మీకు వచ్చింది ఏమిటి ? ప్రతిపక్షం కడుపుమంటతో ఏదో చేస్తున్నారనడంకన్న, మేము ప్రజలకు ఇది చేస్తున్నామని చెప్పుకోతగ్గది ఏమిలేదే. Food department లో 1947 నుంచి 1951 వరకు వచ్చిన proposals ఎన్ని వున్నాయి. major minor, medium size projects లలో 50% అయినా చేసి

దానికైనా మీరు సిద్ధపడ్డారా ? డబ్బు లేదంటారు, లేనిమాట నిజమే, మాయొక్క కార్యక్రమాలు ఎత్తుకుంటే రుణం యిస్తాము అని ప్రజలు అంటున్నారు. ఆస్థితిలో డబ్బులేదని వాదించడం సబబైన సంగతేనా. ఇరిగేషను స్కీములలో వంశధారకు 2 కోట్ల రూపాయలు రుణం ఇస్తాము అని హామీ ఇచ్చాము. ఇంతవరకు గతిలేదు. ఇదివరకు వున్న మంత్రులు గోపాలరెడ్డిగారు, సీతారామ రెడ్డిగారు మా హైస్కూల్లో చెప్పిన మాటలు ఇంకా మా హైస్కూలు గోడలు ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. Final estimatesఅయిపోయినాయి; వచ్చే సంవత్సరము నేనే వచ్చి foundation stone వేస్తాను అన్నారు. వారు ఇక్కడలేరు. విశ్రాంతి తీసుకుంటున్నారు. ఈవిధంగా శుష్కవాగ్దానాలు చేయడం మంచిదికాదు అంటున్నాను. బంజరు సత్యాగ్రహం విషయంలో అనేక వ్యాఖ్యానాలు వస్తున్నాయి. ప్రభుత్వానికి ఈ సందర్భంలో ఒక సలహా ఇచ్చాము. బంజరుల పంచే ప్రాంతంలో వుండే R. D. O. లను, శాసన సభ్యులను ఒక సలహా సంఘంగా వేస్తే శాసనసభ్యులు తిరిగి అభ్యంతరం చెప్పడానికి అవకాశం వుండదని మేము సలహా ఇచ్చి మూడు మాసాలైనది. ఇప్పుడు సత్యాగ్రహం జరుగుతుంటే అనేక కథలు వినబడుతున్నాయి. ప్రతిపక్షంలో వున్నవారు political sufferers అనే పేరుతో భూస్వాములకు భూములు ఇస్తున్నారు అంటున్నారు. నాకు వచ్చిన వార్తలను బట్టి ఇప్పుడు సత్యాగ్రహం చేస్తున్న Kommineni Venkateswara Rao గారు, పంచాయితీ బోర్డు ప్రెశిడెంటు, 8 ఎకరాలు వున్నవాడు, రొంపేరు ప్రాంతంలో కంకటపాలెంలో బంజరుకు సత్యాగ్రహం చేస్తున్నాడట. ఇది న్యాయమా అని అడుగుతున్నాను.

ఇది సక్రమంగా జరగాలంటే ప్రతి ప్రాంతములోను అన్ని పార్టీలతో సలహాసంఘం వేసి ఆ సలహాసంఘం తీర్మానించిన రీతిగా R. D. O. నిర్ణయం చేస్తే బాగుంటుంది. తరువాత గవర్నరుగారి సందేశంలో ప్రభుత్వం ఘనతల గురించి చెబుతూ ఏవో anti-social elements యిదివరకు ఉమ్మడి రాష్ట్రంలో అరాజక పరిస్థితులను ఏర్పరచినట్లు ప్రభుత్వం శ్రద్ధగా శాంతి భద్రతలను కాపాడినట్లు చెప్పడానికి మరువులేకుండా వున్న గవర్నరు గారు యీనాడు దేశంలో మూడు సత్యాగ్రహాలు ఎందుకు జరుగు తున్నాయో, ఆ సంగతి సందర్భాలు జ్ఞాపకం రాకపోవడం ప్రభుత్వదృష్టిలో

[Sri G. Latchanna] [3rd November 1954

లేకపోవడం చాలా శోచనీయమని, దుర్మార్గమని మనవిచేస్తూ నేను విరమిస్తున్నాను.

Sri R. Lakshminarasimham Dora —

అధ్యక్షా! ఈ డిబేటులో పాల్గొనడానికి అవకాశం యిచ్చినటువంటి మీకు నా నమస్కృతులు. గవర్నరుగారిని అభినందనలుచేసే సందర్భంలో ప్రభుత్వ విధానాలు విమర్శకు రావడం సహజం. ఐతే మీరు యిచ్చే అవకాశం చాల స్వల్పం. విషయం చాల పెద్దది. గవర్నరుగారి వుపన్యాసంలో యీ శాసనసభలో రానున్న బిల్లులు కొన్ని నిర్దేశించి వున్నారు. ఆయా బిల్లులు యీ శాసనసభముందు వచ్చే సందర్భంలో వాటి విషయం సమగ్రంగా చర్చించడానికి అవకాశం వుంటుందికనుక వాటి ప్రసక్తి అట్టే కలుగచేసుకోకుండా కేవలం స్థానికంగా నా నియోజకవర్గం, నా జిల్లాకు సంబంధించి సంకుచితంగా మాట్లాడకుండా కొన్ని విషయాలు విమర్శించ పూనుకున్నాను. ప్రభుత్వంవారు అవలంబించిన భూసంస్కరణల గురించి ఈ శాసనసభలో ఏవర్గంవారుగాని ప్రజలు గాని హర్షించడంతప్ప ఘర్షిస్తారని అనుకోను. మనకు భూమే ప్రధాన ఆర్థిక వ్యవస్థగావున్న యీ రాష్ట్రంలోభూమి ప్రభుత్వదృష్టిని ఆకర్షించడం చాలా సముచితం. భూసంస్కరణ విధానంలో యిదివరకు చేసిన శాసనాలు అసమగ్రంగా వున్నాయి. చేసిన శాసనాలు అమలులో పరివర్తన చెందినవా అన్న విషయం కనుగొనే విధానం ఏర్పరచక పోవడంచేత అనేక ప్రాంతాల్లో ఆందోళన సంభవించడం జరిగింది. ముఖ్యంగా జమీందారీ రద్దుచట్టం 7 సంవత్సరాలక్రితం శాసనం అయినా నేటివరకు ఆశాసనం ఏవిధంగా అమలులో వుందో ఏ ఏ దుష్ఫలితాలు వచ్చినవో ఏ ఏ సత్ఫలితాలు యిచ్చిందో పరిశీలించే విధానం ప్రభుత్వం అవలంబించలేదని నేను అనుకుంటున్నాను. జమీందారీ శాసనంలో యినాందారీ కూడా తీసివేయడానికి మొదట్లో సంకల్పించుకొని కారణాంతరాలవల్ల అప్పుడు వచ్చిన ఒత్తిడివల్ల — కారణాలు అన్వేషించ పనిలేదు. — మినహాయించడానికి తలపెట్టి అట్లా మినహాయింపు చేశారు. ఆ మినహాయింపుకు సంబంధించిన నిబంధన చక్కగా నిర్వచన చేయకపోవడం [illegible] కోర్టులలో దానికి ప్రతి పదార్థం తీయడంలో—సాధారణంగా

మన కోర్టులు, వున్న ఆర్థిక వ్యవస్థను నిలబెట్టడమే న్యాయం అనిన్నీ ఏమైనా మార్పు చేయవలసివచ్చినప్పుడు ఆ మార్పు శాసనాలు నిర్దేశించి నపుడు ఆ మార్పు చేయడానికి వీలులేదని presumption అంటారు దానికి తెలుగు మాట చెప్పలేను అనేక భావాలు కలిగి ఉన్నాయి. కోర్టులు యిలాంటి భావాలు కలిగి వుండడంచేత ప్రభుత్వం వుద్దేశ్యం నెరవేర్చడానికి తగినంతగా కోర్టులలో సహకారం రాలేదు. ఆ కారణంచేత నిన్నటివరకు సమాన ప్రతిపత్తికలిగిన రెండు గ్రామాలలో ఒకటి estate అనీ ఒకటి estate కాదనీ నిర్ణయించారు. ఆ సందర్భంలో ప్రజలలో అసంతృప్తి అలజడి కలిగిందని వేరే చెప్పనక్కరలేదు. ఇక అసంతృప్తి అలజడి ప్రజలలో కలగడం సహజమే అనుకున్నా వారు పడుతున్న కష్టాలకు మాత్రం జాలికలగక తప్పదు. ఆరేండ్లయినా ఒక గ్రామం ఎస్టేటు అవునో కాదో అనేవిషయం యీనాటికీ తెలియలేదు. ఇనాందారులు అది ఎస్టేటుకాదని వాదిస్తే రైతులు అది ఎస్టేటే అని వాదిస్తున్నారు. Tribunals appoint చేశారు. ఆ ట్రిబ్యునల్సు తీర్పు, శాస్వతమైన కోర్టు పరిష్కారం కాక పోవడంవల్ల ఆ విషయమై కోర్టులలో రావడం - ఎన్ని కోర్టులున్నాయో మీ కందరకు తెలిసిన విషయమే జరుగుతోంది. ప్రధానంగా యిటువంటి శాసనం కాల విలంబనం జరిగినందువల్ల దుష్టఫలితాలు, అవాంతరాలు సంభవించటమే కాకుండా మొట్టమొదట యేవుద్దేశంతో శాసనం పెట్టారో ఆ వుద్దేశం సఫలీకృతం కాకుండా పోవడం సంభవించింది. ఈ నాడు దీనిగురించి తగిన ఆలోచన చేయాలి. ఏదో తాత్కాలికంగా ఒక measure మన రివిన్యూ మంత్రిగారు తీసుకువస్తే యిటు యీనాందారులు, అటు రైతులు సంతృప్తిపడతారనుకుంటున్నారు. నేను భావించేదేమిటంటే అటు యీనాందారులు సంతృప్తి పడలేదు, ఇటు రైతులు సంతృప్తి పడ్డదీలేదు. తాత్కాలికంగా రైతులను తమ కమతంలోనుంచి తొలగించ కూడదని చెప్పే శాసనంలో ఒక విషయ మరతు పెట్టారు. వారు కోరిన ప్రకారం ఒకేతీరువా చెల్లించివేస్తే ఆ రైతును తొలగించ బడకుండా వుండేవాక్కు సంభవిస్తుందని చెప్పారు. ఇది ఎంత కష్టమైన విషయమో ఆలోచించండి. ఈ రెంట్ నిర్దేశించ వలసినది ఎవరు? యీనాందారు నూరంటే రైతు మూడు అనవచ్చు. దాని పరిష్కారంకోసం కి కోర్టులు తిరగవలసి వస్తుంది. శాసనం చేసినపుడు దాని మాటలలో ఏ భావాలున్నాయో, [illegible] ఎటువంటి ఫలితాలు సంభవిస్తాయో ముందు ఆలోచించకుండా

[Sri R. Lakshminarasimham Dora] [3rd November 1954

చేయడం బట్టి యిలాంటి బాధలు వస్తున్నాయి. ఉదాహరణకు ఆ Ordinance లో substantial portion of village అన్నారు. Substantial portion అనే భాష ఎన్నడూ Law లో ఎరుగను. Substantial portion అనేది కోటిరెడ్డిగారి దృష్టిలో 200 ఎకరాలు కావచ్చు, నాదృష్టిలో 35 ఎకరాలు కావచ్చు. Substantial portion అనేదానికి dictionary లో ఎక్కడా అర్థందొరకదు. అర్థంకాని మాటలు శాసనంలో పెట్టినప్పుడు దానివల్ల అనుమానం లేకుండా చేయాలని నా మనవి. జమీందారీ శాసనం అమలులోనికి వచ్చినపుడు జమీందారీ ప్రాంతంలో ప్రజలు పడుతున్న యిబ్బందులు కూడా గుర్తించాలని మనవి చేయదలచుకున్నాను. ఆ శాసనంవల్ల ప్రజలకు ఎంత అనుకూలంగా వుంటుంది, యికె జమీందారులు శిస్తులకై ఒత్తిడిచేయడం తప్పుతుందా అనే విషయాలు పరిశీలించాలి. ఈ rent reduction వల్ల రైతులకు మంచి దినాలు వచ్చినాయని ఆనాడు మేము ఎంతో సంతోషించాము.

ఇప్పుడు కొనిచోట్ల ఎదుర్కొంటున్న పరిస్థితులు చాలా దుర్భరంగా ఉన్నాయి. మా ప్రాంతములో ధాన్య రూపంలో rent చెల్లించేటటువంటి రైతులకు వీరు ఎంత rent చెల్లించాలనే విషయాన్ని గవర్నమెంటు ఆలోచించి ఒకప్పుడు ఎకరాకు 9 రూపాయలు (highest rate in that District) అక్కడే Fort. St. George లో కూర్చొని arbitrary గా అన్నారు. దానిమీద ఆందోళన చేయగా, తరువాత ఆరు రూపాయలని అన్నారు. ఈ ఆరు రూపాయలు సైతము, కొంతమంది రైతులకు చెల్లించడం కష్టంగా ఉంటుంది. దీనిలో ఒక విషయము మనవిచేస్తున్నాను. మంచి భూమికి ఆరు రూపాయలే, మధ్యతరగతి భూమికికూడ ఆరు రూపాయలే, మూడేళ్ల కొకసారిపండే భూమికికూడ ఆరు రూపాయలే fix చేశారు. ఇది చాలా inequitious గా ఉంటుంది.

'This will cause more discontent and disadvantage to the people. One man who holds the best holding will get the maximum yield while another man is realizing not even one-tenth of what the other fortunate man gets. If both of them are asked to pay the same tax, I do not know what sort of feelings the people would entertain towards the Government. Really it may be a relief to both of them

But the poor man who is made to pay more will compare along with the other more fortunate man. These have got to be enquired into before we make rules and especially in a matter like this such inequities will never be tolerated by the public. Whatever benefits the Government may confer upon them, they won't consider, but they would point out the inequities. This is a point which has got to be seen. Again, in the bigger zamindari areas the zamindars for many decades have been taking interest in the development of their estates. But there are small and indolent zamindars . . . .

Sri N. V. L. Narasimha Rao:—తెలుగులో మాట్లాడవలసిన విషయము మరచిపోయారని, మీద్వారా వారి గుర్తుకు తెస్తున్నాను.

Sri R. Lakshmi Narasimham Dora:—మా ప్రాంతంలో ఉన్న చిన్న చిన్న జమీందారీలలో, అందులోను నేను ఉన్న నియోజక వర్గములో, సంజీవరెడ్డిగారు దయదలచినా ఏ పెద్ద ప్రాజెక్టుగాని, river valley project గాని ప్రారంభం చేయలేదు. పోనీ ఉన్న చెరువులనైనా మరమ్మత్తు చేస్తారాఅంటే, అదీలేదు. ఆనాడు జమీందార్లే ఇంతకంటె చక్కగా వ్యవహరించారా అనేటట్లుగా ఈనాడు అక్కడ పరిస్థితి పరిణమించింది. ఇది ఉద్యోగస్తుల పొరపాటు అని అనను. వారు ఎంతో అభిమానంతో ఉన్నారు. వారు మాకంటె హెచ్చుగా ఆదుర్దాపడుతున్నారు. కాని వారికి ఇచ్చిన సిబ్బంది సరిగా లేదు. ఒక తాలూకాకు war timeలో చిన్న poly-technical schools లో pass అయినటువంటి కుర్రవాళ్ళను వేసి వాళ్ళకు నూరో, యాభైయో చెరువులు ఇచ్చి వాటికి estimates తయారుచేయమనడం, వాటిని execute చేయమనడం, check-measurement చేయమనడం జరుగుతున్నది. ఇదంతా ఏమి చిన్న పనికాదనుకోండి. ఇక check-measurement అనేది Revenue Department అధికారుల చేతులలోకి పడితే, వాళ్ళకు ఒకపని కాదు, అనేక పనులుంటాయి. అవన్నీ వాళ్లు చేయలేక పోతున్నారు. దీనివల్ల ఏర్పడింది ఏమిటంటే, ఇటీవల మా ప్రాంతంలో పెద్ద వర్షాలు వచ్చి, ఒకేరాత్రి 20, 30 చెరువులు గండ్లు పడ్డాయి. అయితే దానిని చూచేవారు ఎవరు? నేను అక్కడవారికి ఒక సూచన చేశాను. యీ contractors, estimates, ఈ పూర్వపు పద్ధతులు మానిపెట్టి ప్రజలయందు నమ్మకం, విశ్వాసం పెట్టుకొని, right గానో,

[Sri R. Lakshminarasimham Dora] [3rd November 1954

rough గానో ఒక estimate వేసుకొని ఆ గ్రామస్థులను పిలిచి, అబ్బాయి ఇది మీ చెరువే, గవర్నమెంటు చెయమంటే చేస్తాముగాని, లేకపోతే మీరే చేసుకోవాలి. కాబట్టి మీరే చేసుకోండి. దానికి చేయవలసిన ఖర్చు చేస్తామని సాహసంగా చెప్పండి అన్నాను. కాని దానికి ఎన్నో రూల్సు, విరుద్ధంగా ఉన్నాయి. ఒక్కొక్కపుడు check-measurement బాగాలేదని, ఉద్యోగులు అంటారని జడుస్తారు. ప్రజాప్రభుత్వమనేది కేవలం ఈ గుంటూరులో గాని, కర్నూలులోగాని కూర్చొనేది కాదు. ఇవన్నీ చూచుకోవాలి. ప్రజా పతినిధులైన ఈ 140 మంది, మాలోనుంచి ఎన్నుకోబడ్డ 7 గురు సాధించగలిగేది కాదు. ప్రజా ప్రభుత్వంలో ప్రజలే చేసుకోవాలి. నాకు ఒకటి జ్ఞాపకం వస్తున్నది. The State where it is least governed is the best governed State. అందుచేత మన గవర్నమెంటు ప్రజలయందు విశ్వాసముంచి, ప్రజలే తమ వ్యవహారాలను నడుపుకోడానికి తగిన atmosphere ను create చేయాలి. ఆ విధంగా చేస్తే ఈ నాటికి కాకపోయినా, ఇక 50 ఏళ్ళకైనా ఇది సాధించగలిగితే అప్పుడు చక్కటి Democratic State అవుతుందని నా విశ్వాసము. Too many rules, too many Acts promulgate చేసి, వాటిని అమలుజరపడానికి పెద్ద పెద్ద సిబ్బందిని పెట్టడంవల్ల corruption పెరగడం, దానివల్ల దేశంలో అసంతృప్తి ప్రబలడం జరుగుతుంది. ఈ సందర్భంలో నేను ఒక విషయం మాత్రం మనవి చేస్తాను. ప్రజలయందు మనకు విశ్వాసం లేకపోవడం చేతనే మన province లో ఉన్నటువంటి ఈ కాస్తా స్థానిక పరిపాలనను అంతమందించాము. జిల్లా బోర్డులు ఏదో దుబారాగా ఖర్చు చేస్తున్నాయని చెప్పి, దుబారాగా ఖర్చుచేసిన వాటిని, చేయని వాటిని, అన్నిటిని కూడ తీసివేశారు. కాని జిల్లాబోర్డులను తీసివేసిన తరువాత స్థానిక పరిపాలన ఏ విధంగా కొనసాగిస్తామని ఈ నాడు ఆలోచిస్తున్నామా? స్థానిక పరిపాలన లేనిదే మనకు స్వపరిపాలన పూజ్యమని గట్టిగా చెప్పుతున్నాను. ఆ స్థానిక పరిపాలన, ఆ initiative, ఆ ఆసక్తి, ఆ enthusiasm ప్రజలలో లేకపోవడం చేతనే, నేడు మీరు ప్రారంభించిన ఈ కమ్యూనిటీ మొదలైన projects nation building schemes వల్ల ఏమైనా ప్రయోజనముంటున్నదా? దీనికి కారణం ఒకటే. ప్రజలలో ఆసక్తి లేదు. అభిలాష మాత్రమున్నది. చక్కటి జీవనం చేయాలని, నాగరికమైన జీవనం చేయాలని, అన్ని conveniences ఉండాలని ఆసక్తి మాత్రమున్నది. కాని

వాటిని చేకూర్చుకోవడం తెలియదు. అదంతా ప్రభుత్వపు బాధ్యత, వాళ్లే ఇదంతా చేకూరుస్తారని లేకపోతే శాసనసభమీద ఏ ఒత్తిడి చేద్దాము? అని అనుకుంటారు. ఇవి చేకూర్చే బాధ్యత మనపైనే ఉన్నదనే భావన వారిలో కలిగించడం చాలా అవసరం. ఆ విధంగా చేస్తేనేగాని, ఈ nation building schemes లో ఉద్దేశించిన ఫలితము రాజాలదు. దానికి తగినటువంటి విధానాన్ని మనము అవలంబించాలి. Too much demoralisation, too many officers, too much bossing over విడిచిపెట్టి, ప్రజలకు కావలసిన పనులేవో, వాటిలో ప్రజలే initiative తీసుకొనేటట్లు వారిని ప్రోత్సహించి ఈపని మీరే చేసుకోండి దానికి కావలసిన డబ్బు ఇస్తామని ప్రజలలో విశ్వాసము చూపి వారిని ప్రోత్సహించినట్లైతే, వారిలో అటువంటి ఆసక్తి కలుగగలదు. వారికిచ్చేటటువంటి డబ్బు ఏమి నష్టంకాదు. ప్రజలనుంచి తీసుకొన్న డబ్బు, వారికే ఇచ్చి చేసుకొమ్మని అంటున్నాము. ఇతర contractors కు ఇచ్చి వారు తినడంకంటె, ప్రజలడబ్బు ప్రజలకే ఇస్తే అందువల్ల బాగుపడతారు. డబ్బుకూడ అంతకంటె సక్రమంగాను, చక్కగాను ఖర్చు చేయబడుతుందని చెప్పగలను.

ఇక గవర్నరుగారిని అభినందించే సందర్భములో, ప్రభుత్వము అవలంబించిన ఈ land reforms కును, ఈ taxation measures కును మాత్రము నేను నాయొక్క హర్షమును తప్పకుండా తెలియజేస్తున్నాను. కొందరు మిత్రులు చెప్పినట్లు ఇప్పుడు 10 రూపాయలకు లోపుగా శిస్తు చెల్లించేవారికి శిస్తు మినహాయింపు చేయడమే కాకుండా uneconomic holdings అన్నిటికికూడ శిస్తు మినహాయించవలెనని నేను మనవి చేస్తున్నాను.

'This incidence of taxation is not uniform. In certain villages, it is heavier and in certain other villages it is less. So in working this exemption of Rs. 10/- land revenue, the Government will be conferring benefit on certain sections of people while denying the same to certain other villages.' ఎందుకంటె, రాయలసీమలో 6 ఎకరాలు దున్నుకొన్నా పన్ను ఉండదు. డెల్టా ప్రాంతంలో ఒక ఎకరా దున్నుకొన్నాకూడ పన్ను ఉంటుంది. కనుక నేను సూచించిన విధంగాచేస్తే scientific గా ఉంటుంది. అది అందరికి సంతృప్తికరంగా కూడ ఉంటుందని మనవిచేస్తున్నాను.

[Sri R. Lakshminarasimham Dora] [3rd November 1954

ఇక ఈ District Boards గురించి చెప్పదలచుకొన్నాను. కాని అవకాశము తగినంతగా లేకున్నది.

Sri T. Nagi Reddi —అధ్యక్షా! ఇన్ని నెలల తరువాత ఈ నాటికైనా సమావేశ మౌతున్నందుకు నేను సంతోషిస్తున్నాను. Waltair సమావేశసందర్భంలో, త్వరలోనే సమావేశ మౌదామని అందరమూ అనుకున్నాము. కాని తరువాత ప్రభుత్వానికి ఏమి చిక్కులు వచ్చాయో కాని ప్రతిపక్షం అంతా కలసి, తొందరలో సమావేశం కావాలని ఒకసారి కాదుగదా పలుసార్లు కోరినా కూడా సమావేశం కాకపోవడం వారి దృష్టిలో ప్రజాస్వామికమే అయినా సాధారణంగా సామాన్యుల దృష్టిలో ప్రజాస్వామికం కాలేదు. అందులోనూ, అవిశ్వాస తీర్మానం ప్రతి పాదించడానికి నిర్ణయించుకొన్నామని తెలిసిన తరువాత కూడా దాదాపు రెండు నెలల కాలం సమావేశాన్ని వాయిదా వేశారంటే, తమ భవిష్యత్తుమీద తమకే నమ్మకంలేక, భవిష్యత్తును కొంచెం జాగ్రత్తపరచుకొన్న తరువాత సభను సమావేశ పరచుదామనే ఆలోచనలో ఇన్ని రోజులు ఈ సమావేశాన్ని ప్రక్కకు నెట్టారా? అని అనిపిస్తుంది. కాని విధిలేని పరిస్థితులలోనే ఈ సమావేశాన్ని ఏర్పాటుచేయక తప్పింది కాదు. చాలా రోజులు తప్పించుకోడానికి వీలులేనటువంటి ఒక నిబంధన Constitution లో ఉన్నది. దానిని తప్పించుకొనడానికి వీలులేక తక్షణమే సమావేశ పరచవలసిన అగత్యం ఏర్పడినది. కనుక సమావేశ పర్చక తప్పలేదు. అందుకైనా సంతోషం. అయితే సమావేశపరచిన తరువాత రాష్ట్రానికి అంతటకు అధినేతగా ఉన్నటువంటి గవర్నర్ గారి చేత ప్రభుత్వంయొక్క policy గురించి మాట్లాడేటట్లు చేసి, అందులో ఈ సమావేశాలమధ్య జరుగుతున్నటువంటి ప్రధానమైన సమస్యలన్నింటిని వదలిపెట్టి కడపటమాత్రం శ్రీరంగనీతులు పల్కడం చాలా విచారకరంగా వుంది.

"Having adopted the democratic way of achieving progress" అంటే ఇంతకుముందు మేము చేసింది democratic way అని అనుకోమని అన్నారు. Let us remember democracy is the hardest

3rd November 1954] [Sri T. Nagi Reddi]

of all systems of government'' అనికూడా చెప్పారు. అందుచేత democracy మాకు అర్థంకాక తప్పులు చేశామన్నా నా చెప్పకుండా "but it is the only system worthy of free men and women'' అని చెప్పారు. "ఆ democracy ని మేము ఆ చరణలో పెట్టాము మీరు చూశారో లేదో. ఆ democracy ని ఆచరణలో పెట్టినటువంటి పద్ధతిలోనే ఈ progress అనేటటువంటిది జరిగింది. ఇక ముందు ఆ పద్ధతినే అమలు జరిపేస్తైతే progress సుస్థిరంగా వుంటుంది, ఆ మార్గాన్నే నడవండి'' అనేట్లుగా ఇక్కడ మనకు చెప్పారు. ఇక్కడే వున్నది సమస్య అంతా. Principles of democracy ని గురించే మాట్లాడుతా మన్నారు మన నాగభూషణంగారు. అంతే కాకుండా ఆ democracy ని ఆచరణలో ఎట్లా పెట్టామో, దానిని గురించి మాట్లాడితే ప్రమాదం కాబట్టి principles మీదనే ఉంటే చాలా హాయిగా ఉంటుంది. ఆ principles మీదనే మాట్లాడుతామంటారు. కాని ప్రజాస్వామిక సూత్రా లను ఈ ప్రభుత్వం మరచిపోయిందని నా అభిప్రాయం. ఆయన మరచి పోయిన కారణంచేతనే ప్రజాస్వామికానికి ఏవిధమైనటువంటి ప్రమాదకర పరిస్థితులు ఏర్పడతాయో అనే విషయాన్ని నేనుచెప్పాలి. కమ్యూని స్టులు ప్రజాస్వామికానికి వ్యతిరేకం, కమ్యూనిస్టులకు ప్రజాస్వామి కంగా అధికారంలోనికి రావడానికి నమ్మకం లేదు కాబట్టి కమ్యూనిస్టుల మీద మేము చర్య తీసుకోక తప్పదు అని నిన్ననే తిమ్మారెడ్డి గారు, గార్లేయపురంలో చెప్పారు, ఈ నాడు ఆంధ్ర పత్రికలో చూశాను. కమ్యూనిస్టుల ఆటలను అరికట్టవలసి నటువంటి అవసరం ఏర్పడింది. అరికట్టి తీరుతాము, అనేటటువంటి పద్ధతిలో తిమ్మారెడ్డిగారు ఈనాడు మాట్లాడితే నేను ఎక్కువ వెల యివ్వననుకోండి. అయినా ఇంత పెద్ద మంత్రిగారు మాట్లాడితే దానిని ఆచరణలోకి తీసుకొంటే, దానిని గురించి కొంచెం జాగ్రత్తగా ఆలోచించుకొంటే ప్రమాదక రమే కావచ్చు. ప్రజాస్వామికము అంటే ఏమిటి ? మేము [illegible] వచ్చే ఆ పక్షాన్ని అధికారంలోనికి రానివ్వం అని

[Sri T. Nagi Reddi] [3rd November 1954

కావ్వడం ప్రజాస్వామికమా? మీరు, ఏతీర్మానాలు pass చేసినా సరే మేము ఆచరణలో పెట్టం అనడం ప్రజాస్వామికమా? మేము, బిల్లులు, చట్టాలు చేసినాసరే, Assembly ఆ చట్టమునకు వ్యతిరేకమైనపుడు Assemblyని పిలువకనే, మీరు, ఏచట్టమైతే చేయకూడదనుకున్నారో దానిని ordianance ద్వారా, regulation ద్వారా pass చేయడం ప్రజాస్వామికమా? మీరు చేసినటువంటి వాగ్దానాలను మరచిపోవడం ప్రజాస్వామికం అని వ్రాసిపెట్టి ఒక list యివ్వాలని పిస్తుందినాకు. ప్రజాస్వామిక రాజ్యపరిపాలనలో ఉండి మనం సంవత్సరం అంతా సమీక్ష చేస్తున్నాముగా ! ఎక్కడో ఒక ఒకరోడ్డువేశాము, electricity ని switch on చేశాము, అని చెప్పుకుంటున్నారు. రేపేకాబోలు సంజీవరెడ్డి గారు పామిడిపోయి switch on చేయబోతున్నారు. కాబట్టి ప్రతి ఒక వోటు, electricity switch on చేస్తున్నామని, ఇన్ని చేస్తుంటే మీరు ఏమిటి ఇట్లాఅంటున్నారని, అంటున్నారు. కనుక ఈ ఒక సంవత్సరంలో జరిగినటువంటి పరిస్థితుల నన్నింటిని వివరించి, విచారించు కోవడం ఈనాడు ప్రధానమైనటువంటి అవసరం. ఈ సంవత్సర కాలంలో జరిగినటువంటి ప్రజాస్వామికము ఎటువంటిది? మనము స్థాపించ పూనుకొన్నటువంటి ప్రజాస్వామిక సాంప్రదాయం ఎటువంటిది? అనే విషయం గురించి కొంచెం ఆలోచిస్తే బంజరు భూముల సమస్యలో ఈనాడు ప్రభుత్వం కల్గిస్తున్నటువంటి అవక తవకల యొక్కమూలం, గ్రామాల్లో ఇళ్ళసమస్యను ప్రభుత్వం పరిష్కారం చేయలేక అవలంబించుతున్నటువంటి విధానం ఇందుకు నిదర్శనం. వీటిని పరిష్కారం చేయలేక ప్రజలమీద విరగబడి ప్రజలందరూ ఏ agitators చేతనో, రెచ్చగొట్టబడుతున్నారనడం అర్థశూన్యమైన విషయం. ఈనాడు, అందరూ జైళ్ళకు పోతున్నారు. మన రాజా ఒక agitator అయిపోయారు. ఈనాడు మన లచ్చన్నగారు ఒక agitator అయిపోయారు. ఇక్కడ వెంకయ్యగారు ఒక agitator అయిపోయారు. Agitators గాకుండా మిగిలినది ఒక కాంగ్రెస్ వాళ్ళే, వాళ్ళుతప్ప మిగతావారంతా agitators,

కాబట్టి జైళ్ళలో వేయండి అనేటటువంటి పద్ధతి ఇక్కడ అవలంబింపబడుతోంది. దీనికిమూలం ఈమంత్రివర్గం ఏర్పడినటువంటి పద్ధతిలోనే ఉన్నది. అక్కడ ప్రజాస్వామిక సాంప్రదాయన్ని కూనీ చేశారు. ఆకారణంచేతనే ఈనాడు ప్రజాస్వామిక సాంప్రదాయాలన్నీ ఆంధ్రదేశంలో అడుగంటి పోయాయి. దేనినైతే ఒకప్పుడు ప్రజాస్వామిక సాంప్రదాయం అని అన్నామో ఆ సాంప్రదాయం ఒక దినంనుంచి మరొక దినానికి మారుతూండే పద్ధతినిబట్టి ఈ సాంప్రదాయానికి ఒక నిలకడ లేదు, ఈ సాంప్రదాయం మన ఇష్టం వచ్చినపుడు మనకు అవసరమైనపుడు మారుతూ ఉందని తేలుతోంది. ఈనాడు ఉన్నటువంటి సాంఘిక పరిస్థితులను తారుమారు చేయడానికి సిద్ధంగా లేనటువంటి ప్రభుత్వం అధికారంలో ఉంటే అలాంటిది జరిగి తీరుతుంది, అది తప్పదు, అని నాగిరెడ్డిచెప్తే కమ్యూనిస్టుగా చెప్పినట్లవుతుంది. మన కోటిరెడ్డిగారు London కు పోయొచ్చారు. ఆయన అక్కడ Laski గారిని చూచే ఉంటారు. అందువల్ల Laski గారు చెప్పింది ఈనాడు కోటిరెడ్డిగారు ఎంత సక్రమంగా ఆచరణలో పెడుతున్నారో వారికే తెలుసును.

"It has, while it remained the Government, the immense advantage that it can abrogate the spirit of representative Government under the cloak of constitutional form and that is the most dangerous thing for parliamentary government." అని లాస్కీగారు చెప్పారు.

ప్రభుత్వానికి ఉన్నటువంటి కర్తవ్యం ఇది సుమా అని హెచ్చరిక చేశాడు ఆయన. కాబట్టి ఆ పద్ధతినే అమలుజరుపుతోంది మన ప్రభుత్వం. నేను వేరే చెప్పవలసిన పనిలేదు. కాంగ్రెసు వారి ప్రజాస్వామిక సాంప్రదాయము, మద్రాసులో మంత్రివర్గాన్ని ఏర్పరచినపుడు ఎట్లా నడచిందో, ఆంధ్రదేశంలో మంత్రివర్గాన్ని స్థాపించవలసివచ్చినపుడు ఎట్లా అది ఏమో క్రొత్తస్వరూపాన్ని తీసుకొందో, ఇంక దక్షిణభారత దేశానికి పోయినపుడు, తిరువాన్కూరు కొచ్చిన్‌లో మరొక నూతన స్వరూపాన్ని

[Sri T. Nagi Reddi] [3rd November 1954

ఏవిధంగా తీసుకున్నదో, ఆ ప్రజాస్వామిక సాంప్రదాయాన్ని ఏవిధంగా ఆచరణలో పెట్టి ప్రజాస్వామికము అనేటటువంటిది లేదని ప్రజలచేత అనిపించుకో దలచుకున్నారో వేరే విపులంగా చెప్పవలసిన పనిలేదు. పోనీ మన Assembly యే తీసుకుందాము. ఒక చిన్న విషయం, జిల్లా బోర్డులను గురించి గతసారి బ్రహ్మాండమైన చర్చలు జరిగినాయి. మనం అంతా దానినిగురించి తీవ్రంగా చర్చించాము. మన Assembly లో రెండు పక్షాలకు సరిసమానమైనటువంటి ఓట్లు వచ్చాయి అనే దానినిబట్టి assembly లో ఉన్నటువంటి ప్రతినిధులయొక్క మన స్తత్వం ప్రభుత్వానికి తెలుసా ? తెలిసి ఉంటే ఆనాడు మనం ప్యాస్‌చేసినటువంటి చట్టంయొక్క గడువు త్వరలోనే ముగియబోతున్నది కాబట్టి మనం తిరిగి Assembly సమావేశపరచి Assmebly ఏమి చెప్పబోతున్నదో కనుక్కోవడం మన విద్యుక్తధర్మం. ఈ Assembly ని సమావేశపరచి దానిని ఎసెంబ్లీలో ప్రవేశపెట్టకపోవడంలో ప్రజాస్వామికం ఎక్కడ ఉన్నది. తమకు అవసరమైనటువంటి కార్యక్రమమును ఎసెంబ్లీలో పెట్టి పాస్ చేయించుకో డానికి వీలులేనపుడు దానిని ordinance ద్వారా అమలు చేయడానికి సిద్ధమైనటువంటి ప్రభుత్వం ఇది. ఎసెంబ్లీ సమావేశ పరచడానికి అవసరం ఉండి, సమావేశపరచాలి అనేటటువంటి విషయం తెలిసి, సమావేశాన్ని ఎగవేసి ordinance ను pass చేసి Special Officers ను నిలబెట్టి తిరిగి ordinance ద్వారా పరిపాలన చేయడానికి సిద్ధమైన ప్రభుత్వాన్ని ఏమనాలి. ప్రజాస్వామికం అంటే ఇదేనా ? మనకూ తెలుసు ఇది చేయకూడదనీ, ఇది తప్పని. అందులోను ఇటువంటివి జరుగు తున్నవి కాబట్టి, మొన్న పార్లమెంట్‌లో rules మార్చినప్పుడు ఒక చిన్నవిషయం చెప్పారు. Ordinance లు ఇష్టం వచ్చినప్పుడు, ఇష్టం వచ్చిన రోజున ప్రభుత్వం pass చేయడానికి వీలులేదు. అటువంటి అత్యవసరమైన పరిస్థితి ఎందుకు ఏర్పడింది ? ఏ కారణంచేత undemocratic form అయినటువంటి ordinance తీసుకురావలసి వచ్చిందో, దాన్ని Assembly లో [illegible] కూడా ప్రభుత్వం ఓటు తీసుకొని నెగ్గవలసి ఉందని చెప్ప

వలసి వచ్చింది. Congress party అర్థమైన democracy రూపం చూచి, పార్లమెంట్‌లో ఉన్న స్పీకరుగారికి కొంచెం భయంవేసింది. Undemocracy ఎక్కువై పోతున్నది. పార్లమెంట్‌ను లేకుండాచేసి ordinance లతో రాజ్యపరిపాలన చేయాలని అనుకుని దానికి కావలసిన హంగులన్నీ ఏర్పాటు చేసుకుంటోంది. కాంగ్రెస్‌వారి మనస్తత్వం ఎలా ఉన్నదో ఆంధ్రదేశంలో 4 నెలల ordinance పరిపాలనబట్టి మనకు అర్థం అవుతుంది. మన కృష్ణమూర్తిరావుగారు "కమ్యూనిస్టులు చేసినవన్నీ కూడా మావే, మావే అంటూంటారు, మేమేమీ చేయనే లేదా అని" అన్నారు. ఎందుకు చేయలేదు? పాపం, చాలా చేశారు. చేయలేదని నేను అంటానా? బంజరు భూముల తీర్మానాన్ని మూడు సార్లు వ్యతిరేకించి నాల్గవసారి ఏకగ్రీవంగా ఆమోదించారు. కాదని నేను చెప్పగలనా? అంగీకరించిన తరువాత దాన్ని ఆచరణలో పెడుతున్న సందర్భంలో ఎన్నో విషయాల మీద సలహాలు ఇస్తే బుట్టదాఖలుచేసి ఆ సలహాలను పాటించ నవసరంలేకుండా అసెంబ్లీలో pass అయిన తీర్మానానికి విరుద్ధంగానే ప్రవర్తిస్తూ, కనీసం Assembly ని సమావేశ పరచాలనే ఆ democratic thinking ఎక్కడికి పోయిందని నేను అడుగుతున్నాను. అయితే ఇక్కడ ఉన్న మీరు ఈ విధంగా దీన్ని పంచాలని ఏమైనా సలహాలు ఇచ్చారా అని అడుగుతున్నారు. చెప్పాము. ఉత్తరాలు వ్రాశాం. ప్రభుత్వానికి తెలుసు. కోటిరెడ్డిగారికీ తెలుసు. ప్రకాశం పంతులుగారికి ఇచ్చాం. నేనూ కొల్లా వెంకయ్యగారు కలిసికొని ఇచ్చిన సలహాలను పాటించ అవసరంలేదనే ఈ ప్రభుత్వంవారి అభిప్రాయమా? పోనీ వారియొక్క నిర్ణయాలనైనా ప్రపంచానికి చాటి ఈ పద్ధతుల మీద మేము పంచబోతున్నాం అని చెప్పారా? అది లేదు. ఈనాడు దినదినం వస్తున్నటువంటి ఒక్కొక్క G. O. నే మనం కళ్లారా చూస్తున్నాం. మొన్న ఒక G. O. pass చేస్తే దాని ప్రకారం ప్రభుత్వ యంత్రం కదిలితే ప్రజలందరూ వ్యతిరేకిస్తే మరొక G. O. 30 వ తేదీన వచ్చింది. దీన్ని బట్టి ఈనాడు ప్రభుత్వ యంత్రం కదిలితే మళ్ళీ కొత్త G. O. రాదని ఎక్కడైనా వ్రాసిపెట్టి ఉందా?

[Sri T. Nagi Reddi] [3rd November 1954

అవసరమైనప్పుడు తన పనిని తాను చేసుకోడానికి వీలైనటువంటి G. O. లను పుట్టించడం ఈ ప్రభుత్వానికి ఒక పద్ధతి. అందుచేత కొల్లా వెంకయ్యగారు వ్రాశారు. ఏమని? ఫలానా G. O. నాకు చాలా అవసరం, ఏపద్ధతి మీద మీరు భూములను పంపకంచేయ తలచుకొన్నారో దాన్నిగురించి అర్థంచేసుకోడానికి వీలుంటుంది కనుక దాని కాపీని పంపమని వ్రాశారు. ఆ G. O. పంపడానికి వీలు లేదన్నారు. ఎందుకు? M. L. A. లు తెలుసుకొని గ్రామాల్లోకి వెళ్ళి ఈ విధంగా ప్రభుత్వం ఇచ్చిన G. O. అని చెప్తారని, తరువాత మంత్రి గారికి వ్రాస్తే, G. O. మేము table మీద పెడతాం, ఆ ప్రశ్న Assembly లో రాబోతున్నది, అంతవరకు కాచుకొని ఉండు నాయనా అని జవాబిచ్చారు. ఆ G. O. ను table మీద చూచేవరకూ, ప్రజలు కాచుకొని ఉండాలికదా? Table మీద పెట్టతలుచుకొన్న దాన్ని అడిగిన M. L. A. కి ఇవ్వడానికి మీకు వచ్చిన అభ్యంతరం ఏమిటని నా ప్రశ్న. Undemocratic గా ఈనాడు రాజ్యపరిపాలన చేయడానికి పూనుకొని ప్రభుత్వం pass చేసినటువంటి ordinance లు ప్రజలకు తెలియకుండా చేసి అది M. L. A. లకు కూడా తెలియకుండా చేసి, ఏవిధమైన దృక్పథాన్ని అవలంబిస్తున్నదీ తెలియకుండా చేసి, గందరగోళపరచి, దేశాన్ని అశాంతిలో దించడమే ప్రభుత్వంయొక్క ప్రధానమైన ఉద్దేశం కాబట్టి ఇదే నా ప్రధానమైన నేరారోపణ. ఈ ఉద్దేశంతోనే ప్రభుత్వం ఈనాడు తన విధానాన్ని సక్రమంగా ప్రపంచానికి తెలియ చెప్పకుండా దాగుడు మూతా లాడుతున్నదని నా అభిప్రాయం. దాగుడు మూతాలు కాకపోయి నట్లైతే ఏవిషయంలో సక్రమమైన పద్ధతిని అవలంబించారు? కోటిరెడ్డిగారికి ఎన్నో గ్రామాలనుంచి, ఎన్నో జిల్లాలనుంచి ఉత్తరాలు వచ్చాయని తెలుసు. చిన్న విషయం. గ్రామాల్లో ఉన్న ప్రతి కరణం దగ్గరకు పోయి సివాయి జమా నెంబరు ఎంతో చెప్పవయ్యా అని అడిగితే ఇవ్వడంలేదని, అందుచేత ప్రతి గ్రామంలో ఉన్న ప్రభుత్వ కరణం ఎన్ని సివాయి జామాలు ఉన్నాయో, వసూళ్లు ఏమిటో ఒక బహిరంగ ప్రదేశంలో అంటించి పెడితే

ప్రతి ఒక్కడు దాన్ని చూచుకొని వ్రాసుకొంటాడని చెబితే, ఒక్క గ్రామంలోనూ కనీసం ఆపని ఎందుకు చేయలేక పోయింది ప్రభుత్వం? నేను గ్రామాల్లో తిరుగుతున్నాను, జిల్లాలలో తిరుగుచున్నాను. నాకు తెలిసినంతవరకూ నేను తిరిగిన గ్రామాల్లో కాని, నాకు వచ్చిన petitions లో గాని అటువంటిది జరిగినట్లు లేదు. నాకు తెలుసు. జరగలేదు కాబట్టే అనంతపురం జిల్లానుంచి కొల్లలు కొల్లలుగా నాకు ఆవిధమైన మహజరులు వచ్చాయి. అదేవిధంగా ప్రతి జిల్లానుంచి కూడా వచ్చాయి. అవి చేయించడానికి చేతకాక పోయినప్పటికి ఎంతమంది ఎంతెంత లంచా లిచ్చుకోవలసి వచ్చిందో ప్రభుత్వానికి తెలుసా? మేము చెప్పాం చిన్న చిన్న సూత్రాలను పాటించండి.

ఏ గ్రామంలో ఉన్నటువంటి భూములు ఆ గ్రామంలోఉన్న ప్రజలకు మొదట ఇచ్చి, మిగిలినవి ఏమైనాఉంటే ప్రక్క గ్రామాల వాళ్లకు ఇవ్వాలి. సంవత్సరాల తరబడి occupation లో ఉన్నటువంటి భూములు వాటిని సాగుచేసుకొంటున్న పేదవారికే ఇవ్వాలి. ఈనాడు కరణాలు చేస్తున్నటివంటిది నాకు తెలుసు. ఒక శివాయిజమా భూమి నెంబరును పదిమందికి ఇచ్చి పదిమందిచేత petitions పెట్టించి, పదిమంది దగ్గర డబ్బు తీసుకొని, ఆ పదిమందిలో ఈ నాడు తగాయిదాలు పెట్టించి గ్రామాల్లో అశాంతిని, అరాజకాన్ని రెచ్చగొడుతుంటే దీన్ని అడ్డడానికి ఈ ప్రభుత్వానికి చేతకాలేదు. బహుశ ప్రభుత్వం అడ్డాలని అనుకోడం లేదేమో! ఈ తగాయిదాల సంగతి ప్రభుత్వానికి తెలియదా? తెలుసు. ఎందు చేత ఇవి జరుగుతున్నాయి? ప్రధానమైనటువంటి ఈ సూత్రాలను దేశం అంతటా చాటి, ఈ పద్ధతిన మీరు petitions పెట్టు కోండని ప్రజలకు చెప్పలేదు. మరి ప్రజాస్వామ్యం, ప్రజాస్వామ్యం అంటే ప్రజాస్వామ్యం దేనికి అని? ఏ పద్ధతిలో ప్రజాస్వామికం అని? మనం ఇంకో చిన్న విషయం తీసుకుందాం. మనం p[illegible] [illegible] తీర్మానం ఏమిటి? భూమిలేని వాళ్లకు భూములు [illegible]

[Sri T. Nagi Reddi] [3rd November 1954

లని అందరూ అంగీకరించాం. సంజీవరెడ్డిగారు చేతులు ఎత్తారు. నేనూ చేతులు ఎత్తాను, కోటిరెడ్డిగారు ఇంకా తొందరగా చేతులు ఎత్తారు. ఎందుకంటే ఆనాడు వారె సభ్యులు లేరుకనుక. ఆ తీర్మానంలో రాజకీయ బాధితుల సమస్యలేదు. ఈ రోజున కోటిరెడ్డిగారు చెపుతున్న ప్రజాస్వామికం అంతా వింటూంటే నాకు మహా ఆశ్చర్యంగా ఉంది. ప్రభుత్వానికి సహాయపడిన వాళ్లకు భూములు మొగలాయీలు కూడా ఇచ్చారు, ఇంగ్లీషువాళ్లు కూడావచ్చి ఇచ్చారు, మీకు తెలియదేమో వాళ్లను మనం జమీందారులుగా చూస్తూన్నామా లేదా? మేము ఇస్తే తప్పా అని సెలవిచ్చారు. వాళ్లు ఇచ్చింది తప్పని మనం ఇన్నాళ్లూ ఘోషపెట్టి, వారు ఇస్తే తప్పా అని అడిగితే నేనేమి చెప్పను? ఎవడెవడు రాజ్యానికి వచ్చినపుడు వాడి వాడి వాళ్ళకు భూములు ఇచ్చుకుంటూ వస్తే ఇక ప్రజలెక్కడ? ప్రభుత్వ మెక్కడ? అని అడుగుతున్నాను. కోటి రెడ్డిగారు ప్రభుత్వంలో ఉండి కాంగ్రెస్ వాళ్ళందరికి భూములు ఇచ్చి సంతృప్తి పరిస్తే, నేనే రేప్రొద్దున్న ప్రభుత్వంలోకి వచ్చి, అంటే కమ్యూనిస్టుపార్టీ తరఫున వస్తే భూములు ఎవరికైనా ఇట్లా ఇస్తే ఏమౌతుంది? కాబట్టి నాలాటివాడే వస్తే ఏమౌతుంది? నాకు సహాయపడినవాళ్లందరికీ నేను భూములను ఇస్తాను అని నేను మొదలుపెడితే, ఇంకొకళ్లు రాజ్యానికి వచ్చినప్పుడు వాళ్లు మొదలుపెడితే, మరొకళ్లు రాజ్యానికి వచ్చినప్పుడు వాళ్లూ మొదలుపెడితే ఇది రాజ్య పరిపాలనా అని నేనడుగుతున్నాను. ఈ విధంగా రాజ్యం కొనసాగగలదా? ఈ విధంగా ప్రజలకు సంతృప్తికరమైన మార్గము చూపించగలదా? ప్రతి పార్టీ వాళ్లూ వారి వారి పార్టీ వాళ్లకు ఈ విధమైన మార్గం చూపించి నట్లయితే దేశంలో ఇది ఒక నూతనమైన కరప్షన్ విధానంగా రూపొందవచ్చు. బంధు మిత్రులయొక్క స్నేహాన్ని ప్రభుత్వం సంపాదించుకోవడానికి ఇది ముందుకు వస్తుందికాని, మరొకందుకు కాదని చెపుతున్నాను.

**Sri P. V. G. Raju:**—I do not want to disturb the speech; but still I have to. I just now did notice a photo-

3rd November 1954] [Sri P. V. G. Raju]

graph was taken in this House I think it is not customary for photographs to be taken in the legislative chamber when we are discussing matters. If it has been done, I wish the negative is destroyed.

Sri G. Latchanna:—ఇక్కడ ప్రారంభంలో ఒకటి జరిగిందను కొంటాను............

Sri T. Nagi Reddi.—దానిని గురించి Speaker యేదో....

The Hon Sri N. Sanjeeva Reddi.—Budget Speeches యిస్తున్నప్పుడు, అక్కడక్కడ తీసుకొంటారు. ఇదేమీ క్రొత్త కాదను కొంటాను. నేను యింతకు పూర్వము Assembly లో సభ్యుడుగా వున్నాను. అప్పుడప్పుడు, speeches యిస్తూవున్నప్పుడు తీసుకోవటం ఆచారమే. వారు యింకొకరకంగా భావించకపోతే, నాకేమీ ఆక్షేపణలేదు.

Sri P. V. G. Raju:—If a Government photographer were to do so, I think we must have some tradition. Here if we allow photographs to be taken, let not only Government photographers but everybody take them; otherwise all the negatives must be destroyed. I think we should have a ruling on this.

The Hon. Sri N. Sanjeeva Reddi:—We are not concerned. But anyhow, we will consider it.

Deputy Speaker:—I will find out and give you.

Sri C. V. K. Rao:—I want to know whether the Government have permitted any one to take photographs of this House.

Deputy Speaker:—I will find out.

Sri G. Latchanna:—'Whether Government asked anybody to take photographs ?' is the information, he wants.

Deputy Speaker:—దాని విషయంలో మీకు ఒకటి చెప్పాను. అది మీరు వినుపించుకొన్నారా ? ఈ విషయం విచారించి, నేను మీకు చెప్తానని అన్నాను.

[3rd November 1954

Sri T. Nagi Reddi.—కాబట్టి, democracy అనేటటువంటిది form కు సంబంధించినది కాదు, content కు సంబంధించినది. ప్రభుత్వము బంజరు భూములమీద చేసిన యీ నిర్ణయమును యెందుచేత యింతమంది వ్యతిరేకించడానికి అవకాశమును యేర్పరచారని అంటే ప్రధానంగా దానిమీద ప్రభుత్వము సరియైనటువంటి నిర్ణయము చేయలేదు. కాబట్టే, యీ కారణాలన్నీ జాగ్రత్తగా పరిశీలించమని కోరుతున్నాం. అయితే, యీదినం శ్రీ కోటిరెడ్డిగారు ఒకమాట అన్నారు. ప్రతీసారి ఆ మాట వినపడుతూనే వుంది. ఈ భూములలో చాలా భాగం records మూలంగా శివాయి జమాదార్ల ఆక్రమణలో వుందని శ్రీ కోటిరెడ్డిగారి అర్థం అని అనుకొంటున్నాను. గ్రామాలలో ప్రతి ఒక్కరికీ ఈ విషయంలోని నిజం తెలుసు. గ్రామాలలో వున్నటువంటి యీనాటి పరిస్థితులను బట్టి, సాగు చేసుకొంటున్నటువంటి వారిపేర, చాలా గ్రామాలలో ఆ భూములు నమోదు కాలేదని మీకందరికీ తెలుసు. మీకు తెలియకపోతే, మీకందరికీ ముఖ్యులైన ఆయన Congress Agrarian Reforms Committee తరఫున Congress working Committee కి వ్రాసినటువంటి విషయము మీముందు పెడితే అప్పుడైనా అంగీకరిస్తారని చెప్పి నేను అనుకొంటున్నాను. మన రాష్ట్రంలో వున్న భూస్వాముల హృదయము చెడ్డది అని నేననుకోను. దేశమంతటా తిరిగి Congress Working Committee నిర్ణయించిన నిర్ణయం ఒకటి యిక్కడ వున్నది. "Immediate steps should be taken to prepare a record of right with the help of the land tribunal. The illiteracy of the cultivating classes as well as of the local land owners and the corruption of the officials together have produced a situation under which it may be extremely difficult to prove the status of the men on the spot" అని వున్నది. ఈనాడు గ్రామాలలో జరుగుచున్న పరిస్థితినిబట్టి విచారణ జరిపి, వచ్చినటువంటి నిర్ణయమును, శ్రీ కోటిరెడ్డిగారు అసలు జరుపుతారా అని అడుగుతున్నాను. భూమి మొదటి ఆక్రమణలో వుంటే యీ

నాడు వాడిపేర నమోదు అవుతున్నది అనేటటువంటి హామీ ఏమేది? గ్రామాలలో జరుగుతున్నటువంటి యీ అన్యాయాలు యీనాటి అశాంత పరిస్థితులకు మూలం అనేటటువంటివిషయం అంగీకరించకపోయినట్లైతే యీ సమస్యను శాంతియుతమైన వాతావరణంలో పరిష్కారంచేయటం అసంభవము, అసాధ్యము. కాబట్టే, Congress Agrarian Reforms Committee భూ సంస్కరణలను గురించివ్రాస్తూ Land Tribunals అనేటటువంటి వాటిని వేయాలని, ప్రజా ప్రతినిధుల సహకారం తీసుకోమని, ఆ సహకారంతో గ్రామాలలో వున్నటువంటి నిజమైన పరిస్థితులను పరిశీలించమని, records మీద ఆధారపడ వద్దని చెప్పారు. ఈ ప్రధానమైన సందేశాన్ని శ్రీ కోటిరెడ్డిగారు తీసుకొనడానికి అంగీకరించరు, ప్రభుత్వమూ అంగీకరించదని నాకు తెలుసు. ఎందుకంటే, యీనాడు pass చేస్తూ వచ్చారే, ఆ orders అన్నీకూడా తలక్రిందులై, ఆచరణలోకి రావు. ఇవి మేము యిచ్చేటటువంటి సలహాలుకాదా? సలహాలు లేవులేవని అడుగుతూన్నటువంటి మిత్రులకు Legislature Communist Party సలహాలను యిచ్చింది. వీటినన్నిటినీ తిరస్కరించారనేటటువంటి విషయాన్ని మీరు అంగీకరించరా? వాటినే రేపు ప్రొద్దుట యీనాముల బిల్లు రాబోతున్నదిగదా. ఎవరు భూములలో వున్నారు? ఎవరి ఆక్రమణలో భూమి వున్నది? అనే విషయాన్ని మంత్రులు యినాందార్లు రైతులుకలసి decide చేసుకోవాలి. ఇందుకు అవసరమైన land tribunals సిద్ధంగా లేకపోబట్టి, యీనాడు జరుగుచున్న యీ అన్యాయాలను యీ ప్రభుత్వము పరిష్కారం చేయలేదు. ఈ ప్రభుత్వానికి democratic form కావాలేగాని, యీ ప్రభుత్వానికి democratic spirit గాని, content గాని, democratic methodగాని అవసరం లేదని తేలిపోతున్నది.

**Sri K. Varadachari** :—దానికి solution ఏమిటి?

**Sri T. Nagi Reddi** :—అవును నేను యింతసేపు చెప్పినదే

[Sri T. Nagi Reddi] [3rd November 1954

solution. రామాయణం అంతా విని, రాముడికి సీత యేమౌతుందంటే, నేనేమి చెప్పను ? కాబట్టి, యిప్పుడు వున్నటువంటి యీ పరిస్థితులను సరి దిద్దడానికి, అది ఒక మార్గం. ఇంకే democracy form ను గురించి మాట్లాడేటప్పుడు, యింకొక విషయం కూడా తీసుకొందాము. ఈ ప్రభుత్వము—అధికారంలోకి వచ్చిన తరువాత ఒక విషయంలో మాత్రం clean గా చేశారని నా అభిప్రాయం. ఏమిటంటే, ప్రజల చేతులలో వున్న, కాస్త అధికారాన్ని తొలగించడానికి సర్వత్ర ప్రయత్నంచేయటం. "మేము మీకందరికి వయోజన వోటింగు హక్కు, మేము మీ కందరికి రహస్య వోటింగు పద్ధతి యిచ్చాము" అని ప్రతిసారి చెప్పకోవడం పరిపాటి అయిపోయింది. ఆ రహస్య వోటింగు పద్ధతి, వయోజన వోటింగు హక్కు గత జనరల్ యెన్నికలలో యెప్పుడైతే యీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తారుమారై కూర్చున్నవో, అప్పటి నుంచే ఆ రహస్యము, ఆ వయోజనము రద్దుచేయ ప్రయత్నము జరుగుచున్నది. మనం చూస్తూనే వున్నాం. ప్రథమంలో ప్రారంభమైనవి పంచాయితీ బోర్డులు; ఏ విధంగా ? పంచాయితీ బోర్డు యెన్నికలు రహస్య వోటింగు పద్ధతి ద్వారా జరుపకుండా, యీ ప్రభుత్వం చేతులు యెత్తే పద్ధతిని పెట్టి, యిప్పుడు గ్రామాలలో వున్న పెద్ద పెద్ద వాళ్లందరికీ వ్యతిరేకంగా, సామాన్యులు వోటుచేయడానికి వీలులేకుండా ఎన్నికలు జరిపిన సంగతి మనం చూచాము. అసలు వయోజన వోటింగు, రహస్య పద్ధతి లేకపోయినా, రహస్య పద్ధతులలో జరిగిన యెన్నికలలో ఎప్పుడైతే అధికారంలో వున్న పార్టీకి,చాలా పంచాయితీలలో వోటమి సంభవించినదో, అంతటితో జిల్లాబోర్డు ఎన్నికలకు స్వస్తిచెప్పే మార్గం కనబడుతున్నది. అప్పుడే రహస్యం పోయింది. ఇప్పుడు వయోజన వోటింగు హక్కు పోతున్నది. కాబట్టి, ఈ democracy ని గురించి యింతగా పశ్చాత్తాపపడుతూ మాట్లాడుతున్నటువంటి మిత్రులు అందరూ, యీ 1½ సంవత్సరముల కాలంలో యే విధమైన పద్ధతిని యీ Congress ప్రభుత్వము అవలంబిస్తున్నదో

చూచారా ? అని అడుగుతున్నాను. మద్రాసులో శ్రీ రాజగోపాలాచారి గారు బహిరంగంగా వేదికమీద నిలువబడి, "యిటువంటిది ఆంధ్రదేశములో జరుగుతుందేమో యని, మా కెవరయ్యా హామీ ?" అని అడుగుతే, "జరుగదని నేను అనుకోంటున్నాను" అని అన్నారు. "నేను యిచ్చినటువంటి హామీని, ఆంధ్ర ప్రభుత్వం గుర్తిస్తుందని, గమనిస్తుందని ఆశిస్తున్నాను. అట్లు ఆశించకపోతే, అది మీ దురదృష్టకరం. దానిని మీ నైతిక బాధ్యతమీదనే వదలిపెడుతున్నాను." అని ఆయన చెప్పాడు. ఆయనకు అప్పుడు పాపం భయంవేసింది కాబోలు. ఆంధ్ర ప్రభుత్వము కాంగ్రెసు ప్రభుత్వము అయినా, కాంగ్రెసు ప్రభుత్వము యిచ్చినటువంటి హామీలను తిరస్కరించే ప్రభుత్వమే అని, తిరస్కరిస్తుందని మేము చెప్పాము. ఆంధ్ర దేశములో వున్న పరిస్థితులనుబట్టి, ఆంధ్రదేశంలో ఉన్న కాంగ్రెసు ప్రభుత్వము రహస్య ఓటింగును రద్దుచేసిన తరువాత, వయోజన ఓటింగునూ రద్దుచేయ బోతున్నది అనే విషయాన్ని democracy ని గురించి యింతగా మాట్లాడుతున్న మిత్రులు ఆలోచించారా ? అని అడుగుతున్నాను.

కాబట్టి ఇప్పుడు వున్నటువంటి పరిస్థితులన్నింటిలోను మనము చూస్తున్నది ఏమిటి. దేశంలో ప్రజలకు వున్నటువంటి ప్రధానమైన హక్కులన్నింటిని తొలగించడానికి ఈనాడు ప్రభుత్వం ఏవిధంగా పూనుకుంటున్నది. అసెంబ్లీలో వున్నటువంటి హక్కుల సంగతి మనము చూశాము. చాలా మంది మిత్రులు చెప్పారు. నాన్ అఫీషియల్ రిజల్యూషను ప్యాసుఅయితే మేము ఆచరణలో పెట్ట పనిలేదు, రిజల్యూషను ప్యాసు అయితే మేము దానిని గుర్తించాల్సిన అవసరములేదు. నాన్ అఫీషియల్ బిల్సు అంటే చర్చకు రావలసిన పరిస్థితులను మేము కల్పించము అని ప్రభుత్వంవారు అంటున్నారు. కొంతమంది కాంగ్రెసు శాసనసభ్యులను చూచినప్పుడు చాలా బాధగావుంటోంది. బాణాల కృష్ణమూర్తిగారు భూమి ప్రమాణాన్ని నిర్ణయించుటకు ఒక నాన్ అఫీషియల్ బిల్లుకు నోటీసు ఇచ్చారు.

ఆశతో అదిగో వస్తుంది; ఇదిగో వస్తుంది అని ఎదురు చూస్తున్నారు. కాంగ్రెసు పార్టీ ఒకటి వుందని దానిని అది రానివ్వకుండా కూర్చున్నదని పాపము వారికి తెలియదు. లేకపోతే తమకులేక ఇతరులు తెచ్చిన వాటిని అంగీకరించక ఫార్సుగా పెట్టి నాన్ అఫీషియల్ బిల్సు అని వాటిని కాంగ్రెసు ప్రభుత్వం ఖాతరుచేయడం లేదు. మేము చెప్పిన స్కీములను బుట్టదాఖలా చేశారు.

మాకు ఒక బిల్లు తేవడానికి అవకాశము లేదు. ఒక బిల్లు ప్యాసుచేసి దానిని ఆచరణలో పెట్టడానికి అవకాశం గాని అధికారం గాని ఇవ్వరు. మీరు చేయరు. దానిని ఇంగ్లీషులో "డాగ్ ఇన్ ది మేంజర్" పాలసీ అని అంటారు. ఇది ప్రజాస్వామికము అని అనిపించుకోడానికి వీల్లేదు. చేసినటువంటి వాగ్దానాలు ఆచరణలో పెట్టరు. మనవద్దనే చేసినటువంటి ప్రతి వాగ్దానము తీసుకుందాము. కుప్పుస్వామి కమిటీ రిపోర్టు తీసుకుందాము. నీరా మీద చేసినటువంటి వాగ్దానము తారుమారుగా మారిపోయినది. ఎప్పుడు ఏమి జరుగుతుందో ప్రకాశం గారికే తెలియదాయె ఇక మనకు ఏమి తెలుస్తుంది. ఆ వాగ్దానాలను ఆచరణలో పెట్టరని మనకు ఋజువు అయిపోతున్నది. కాంగ్రెసు చేసిన తీర్మానాలను ఆచరణలో పెట్టుటకు వారు అంగీకరించరు. తమకు అనుకూలంగా వున్నదని కాంగ్రెసు ప్యాసుచేస్తే దానిని ఆచరణలో పెట్టడానికి నిముషాలమీద కదలి రాజకీయ బాధితులందరికి త్వరలోనే భూములను పంచాలనే తాపత్రయంతో ఒక స్పెషలు ఆఫీసరును వేశారు ప్రభుత్వంవారు. దీనికొరకు యింత తాపత్రయ పడినవారు, ఈనాము రైతుల సమస్య వచ్చినప్పుడు తిరుపతిలో ప్యాసు అయిన తీర్మానము గాని, బెజవాడలో ప్యాసు అయిన తీర్మానముగాని ఎందుకు అంగీకరించరని అడుగుతున్నాను. అందులోను ఇప్పుడు మన సంజీవరెడ్డిగారు లీడరు ఆఫ్ ది హౌస్. లీడరు ఆఫ్ ది హౌస్ అంటే లీడరు ఆఫ్ ది గవర్నమెంటే. పోనీ ప్రకాశం పంతులు గార్ని కూర్చోపెట్టినాని లీడరు ఆఫ్ ది గవర్నమెంటుగా సంజీవరెడ్డిగారు

వున్నారు. నేను ఆనాడే ఇది సంజీవరెడ్డిగారి రాజ్యం కాని ప్రకాశం గారిది కాదండీ అని చెప్పాను. ఈ రాజ్యం సంజీవరెడ్డి గారిదే. వారి లీడర్ షిప్పు క్రింద ఈ నాడు రాజ్యం ఎలా జరుగుతోందనే విషయము మీ కందరకు తెలుసు. వారి ఇష్టమొచ్చినట్లు జరుగుతుంది. కోటిరెడ్డి గారు ప్రొద్దున ఒక గంటసేపు మాట్లాడారు. పదిమంది పదివైపుల నుంచుని అడిగారు. ఈనాము రైతుల సంగతి చెప్పమంటే, ఆ తీర్మానము ప్యాసుచేసిన తరువాత కోటిరెడ్డిగారు చాలా రోజులు మాట్లాడలేదు. మాట్లాడకపోతే ఈ పత్రికా విలేఖరులు వూరుకుంటారా? పోయి వూరికే ప్రశ్నలు అడుగుతారు. ఆప్రశ్నలతో వున్న రహస్యాన్ని కాస్త బయట పడేశారు కోటిరెడ్డిగారు. 1953 అక్టోబరునుంచి మేము ఆ తీర్మానాన్ని అమలు జరుపుతాముగాని 1947 అని అంటే మాకు ఏమాత్రము సంబంధము లేదని చెప్పారు.

కాని కాదని ఈ వుదయము చెప్పారు. అది నిజమేనని మేము అనుకోక తప్పదు. తమకు సంబంధించిన వరకు, తమ లోపాలకు సంబంధించినంతవరకు, తమ పార్టీకి సంబంధించినంతవరకు, తమ ప్రజలకు సంబంధించినంతవరకు, పార్టీ తీర్మానాన్ని తక్షణము ఆచరణలో పెట్టడానికి పూనుకొన్న ఆదుర్దా ప్రజలకు సంబంధించి ఎందుకు లేదని అడుగుతున్నాను. ఈ ప్రభుత్వం అధికారంలో వుండగా వాగ్దానాలకు విలువలేదు. ఈనాడు ఎన్నో కమిటీలను వేశామని చెప్పి గవర్నరుగారు వరుసపెట్టి చెబితే ప్రతిదానికి కమిటీలు వేయడం ఆ కమిటీల నివేదికలు బుట్టదాఖలా చేయడమే కనుక ఆ కమిటీలకు వున్న విలువ ఏమిటి అని చెప్పాల్సిన అవసరం వస్తున్నది. నిన్న సాగి సూర్యనారాయణరాజుగారు మాట్లాడుతూ ఇంకా తమషాగా చెప్పారు. వారు చాలా వుత్సాహవంతులు కాబట్టి అక్షర అక్షరానికి, మాట మాటకు విడమర్చి చెప్పారు. అయితే చెప్పారేగాని అయినా వారు ఆచరణలో పెడతారా అంటే అది వేరేసంగతి అన్నారు. కనుక మాటలు మనకు చేతలు వాళ్లకు అవుతున్నాయి. కాబట్టి

[Sri T. Nagi Reddi] [3rd November 1954

ఇప్పుడు వున్నటువంటి పరిస్థితులలో యీ ప్రభుత్వము చేసినటువంటి తీర్మానములమీద, వారిచ్చే ప్రకటనలమీద ప్రజలకు ఏమాత్రము నమ్మకము లేకుండా వుంది. వరుసపెట్టి ప్రకటనలు వచ్చినవి. వరుసపెట్టి తీర్మానాలు వస్తున్నవి. దినదినానికి ఎన్నో జీ. ఒ లు వస్తున్నవి. ఇవాళ వచ్చిన జి. ఓ. రేపు వుంటుందని నమ్మకములేదు. ప్రభుత్వంలో నమ్మకం లేనటువంటి పరిస్థితులు ఈ విధంగా సాగేట్లయితే ప్రజల్లో శాంతి ఎట్లా ఏర్పడుతుందో ఆలోచించమని మిమ్మలను కోరుతున్నాను. ఒక మంత్రి చేసిన ప్రకటనకు విరుద్ధంగా మరొక మంత్రి ప్రకటనలు చేస్తారు. అందువల్ల వాటికి ఏవిధమైన విలువలేకుండా పోయింది. మంత్రుల చరిత్రను సావకాశంగా వ్రాయడానికి వీలు కలిగిన పరిపాలన ఈ ఒక్క సంవత్సరంలో జరిపినందుకు ఈ ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. తప్పకుండా మనము ప్రభుత్వానికి, మంత్రివర్గానికి ఒక అభినందన తెలియజేయాలి. అసెంబ్లీలో ప్యాసుఅయిన తీర్మానాలకు ఆ గతిపట్టింది. అసెంబ్లీలో నాన్ అఫిషియల్ బిల్సుకు ఆ విధంగా దుర్గతి పట్టింది. తీర్మానాలు, బిల్లులు అసెంబ్లీలో చర్చకు రాకపోతే రాకపోవచ్చును ; కాని శాసనసభ ఆమోదించి ప్యాసు చేసిన తీర్మానానికి ఈ పరిస్థితి వస్తుందని నేను ఎప్పుడూ అనుకోనలేదు. అయితే అసెంబ్లీ నిరాకరించిన విధానాన్ని ఆచరణలో పెట్టగలిగిన ప్రభుత్వము ఆంధ్ర ప్రభుత్వంతప్ప ఇంకే ప్రభుత్వం లేదు. అది ప్రకాశంగారికి ఇప్పటికైనా తెలిసి వుంటుందనే నేను ఆశిస్తున్నాను..................

అది తెలుసుకున్నాము కాబట్టే మనము నో కాన్ఫిడెన్సు మోషను ఇవ్వాల్సి వచ్చింది అనే మంత్రిగారికి తెలుసు. ప్రకాశంగారి నాయకత్వాన మద్రాసు శాసనసభలో బస్సు పాసింజెర్లమీద పన్ను వేయాలనే బిల్లుకు వ్యతిరేకంగా వోటుచేసి దానిని రాకుండాచేసి కొత్తబిల్లు వచ్చేట్లు చేయగలిగింది ప్రతిపక్షము. అది విశ్వనాథంగారి నాయకత్వానకూడా. హైకోర్టు ఒకతీర్పు ఇస్తే దానిని అసెంబ్లీ ముందుపెట్టి దానిమీద ఏమిచర్య తీసుకోనక గవర్నరుచేత అసెంబ్లీని ప్రోరోగు చేయించడం ప్రజాస్వామి [illegible] అడుగుతున్నాను.

3rd November 1954] [Sri T. Nagi Reddi]

గవర్నరుచేత అసెంబ్లీని ప్రోరోగు చేయించి మధ్యకాలములో అసెంబ్లీ సమావేశపరచక, అసెంబ్లీ నించినదానిని ఆచరణలో పెట్టక పోవడం, ఆర్డినెన్సులు ప్యాసు చెయ్యడం ఏ ప్రజాస్వామికసూత్రము అని నేను అడుగుచున్నాను. ఆర్డినెన్సులు ద్వారా పరిపాలన చేస్తున్న ప్పుడు మీ ఉద్దేశము ఏమిటని అడుగుచున్నాను. Non-official దా official దా అన్నది సమస్యకాదు. చట్టములుకూడా ఈ ప్రభుత్వాన్ని బంధించడము లేదు.

ఇంక ఈ తిమ్మారెడ్డిగారి విషయం కొంచెము చెబుతాను. ఈ కమ్యూనిస్టు పార్టీ ఎన్ని రోజులు ఉంటుందని నిన్న గార్గేయ పురములోను మొన్న తెణుకులోను వారు చెప్పేరు. పత్రికలలో పడినదానికి పాపము ప్రభుత్వానికి కోపము వచ్చింది. పత్రికలలో ప్రకటించింది నిజమైతే ప్రకాశంగారు అమతిరావతిలో మేము చేసేది అన్ని అపభ్రంశపు పనులేను అని అన్నారట. ఈ విషయం అన్ని పత్రికలలోను పడింది. ప్రతిపక్షం మీద చర్య తీసుకొనవలెనని ఈ నాడు ప్రభుత్వం ఆలోచిస్తున్నదని చెప్ప డానికి నిన్న వరదాచారిగారి ఉపన్యాసము, తిమ్మారెడ్డిగారు గార్గేయ పురంలో ఇచ్చిన ఉపన్యాసము తార్కాణములు. ఇక వారుచేసే కుతంత్రాలు ప్రయత్నములు ఈ అసెంబ్లీముందు పెట్టక తప్పదు. దురదృష్టవశాత్తు సంజీవయ్యగారు ఇక్కడ లేరు. ఆయన పశ్చిమ గోదావరి జిల్లా పోలవరం వెళ్లేరు. ఆ గ్రామంలో తనకు 25 సంఘాలవారు ఇచ్చిన మెమొరాండము లను స్వీకరించి చదవనిచ్చి మరొక పక్షము ఇచ్చిన మెమొరాండం పుచ్చు కొనకుండా అక్కడపెట్టి పో చింపెయ్యమంటావా అని గద్దించినారుట. ఈ పరిస్థితులలో ప్రభుత్వం పక్షపాత రహితముగా పరిపాలన చేస్తున్నదని ప్రజ లకు ఎట్లా తోస్తుందని నేను అడుగుచున్నాను. అడుగు అడుగునా పక్ష పాతం. అది మాటలలోను చేతలలోను, రికార్డులలోనేకాదు. బహిరంగ ముగా పక్షపాతము అయితే లేదని ఎలా చెప్పగలను. మేము ప్రజలలోకి వెళ్లి ప్రచారము చేస్తూఉంటే దానినిచూసి హడలిపోయి సంజీవరెడ్డిగారు

[Sri T. Nagi Reddi] [3rd November 1954

ప్రజలమధ్య ఉద్యోగుల మధ్య ప్రతిపక్ష సభ్యులను పార్టీలను ఏ విధముగా అయినాసరే గదమాయించి వారి ప్రయత్నములకు అభ్యంతరం కల్గించాలని ప్రయత్నం చేస్తున్నారా అని అనిపిస్తున్నది. సంజీవయ్యగారు చిన్నమంత్రి అంటారేమో. మొన్న మొన్ననే పెళ్లి చేసుకొన్నాడనే సంగతి అందరికి తెలిసినదే. కాబట్టి ఆయనచిన్నవాడే గాని బాధ్యత కల్గినవ్యక్తి.డిప్యూటీ చీఫు మినిస్టరు కాంగ్రెసుపార్టీ నాయకులు, ఆంధ్ర దేశములో ఎవరైనా అధికారములో ఉన్నారంటే ఆయనే అనుకుంటా. అన్ని సమయాలలో కొంత ఓర్పు శాంతి వహించవలసిన పరిస్థితులలో ఒకరు ఇచ్చిన మెమొరాండము అరుగీతలు చదివిన తరువాత చేతులో ఉన్నది లాగుకొని బహిరంగ సమావేశములో గద్దించి నువ్వు వెళ్లిపో అని చెప్పవలసిన అవసరం అగత్యం ఏమి వచ్చింది. ఉన్న విషయాలను ఉన్నట్లుగా ప్రభుత్వానికి చెప్పడానికి ప్రజలు ఈ విధముగా చేస్తారు. ఇటువంటివి సాగనివ్వకుండా చెయ్యడానికి, కాంగ్రెసుద్వారా నావద్దకు రండి అని చెప్పడానికి జరుగుతూఉన్న అవలక్షణమైన పనులు ఇవి. ఈ విధముగా చిన్న చిన్నవాటిలో జరిగితే పెద్దపెద్ద వాటిలో ఎందుకు జరగదు. మరొక దృష్టాంతం. మన తిమ్మారెడ్డిగారు ఆయన గురించి చెప్పవలసివస్తే గ్రంథాలు వ్రాయడానికి వీలుంది. పడవలో ఒక గ్రామానికి తిమ్మారెడ్డిగారు వెళ్లి పూలమాల వేయించుకొన్న తరువాత ఎవరో ఒకాయన క్రిందటిరాత్రి ఆ గ్రామంలో దౌర్జన్యం చేసి కమ్యూనిస్టు పార్టీ మీటింగు జరుగకుండా చేసినాడని చెబితే ఆమాలతీసి వాని మెడలోవేసి నీయంటి వారు పదిమంది ఉంటే కమ్యూనిస్టు పార్టీ ఆంధ్ర దేశములో లేకుండా చేస్తామని అన్నారు. ఈ విధముగా చెప్పినవారు ఆంధ్ర దేశములో శాంతియుతమైన పరిపాలన చేయగలరా? అని అడుగుతున్నాను. ఇది శాంతియుతమైన పరిపాలనకాదు. ప్రజలను రెచ్చగొట్టడం, గిల్లడం, కొట్లాటకు ముందుకు నెట్టడం; మేము దీనిపైన ఉన్నామని నచ్చచెప్పడం.అంతదూరమెందుకు మన కర్నూలు సభలో సంజీవరెడ్డిగారి సమక్షములో, రైతుయాత్ర జరి [illegible]వాత కొండారెడ్డి బురుజువద్ద జరిగిన బహిరంగసభకు అధ్యక్షవ

3rd November 1954] [Sri T. Nagi Reddi]

శాత్తు నేను వెళ్లేను బహుశ ప్రకాశంగారుకూడా ఉన్నారేమో మంత్రులందరూ ఉన్నారు.

The Hon. Sri T. Prakasam·—నేను లేను ఆ సభలో.

Sri T. Nagi Reddi.—సంజీవరెడ్డిగారు ఉన్నారు అన్నాను. ఈనాడు ఎవరికైన ఎక్కువ అధికారము ఉన్నది అంటే సంజీవరెడ్డిగారికే అంటాను.

The Hon. Sri N. Sanjeeva Reddi:– Sir, I take serious objection to this. It is a slur on the Chief Minister who is sitting here, and it is an insult to the whole House and the Government.

Sri T. Nagi Reddi:—No, I take it and it is my belief that Sri Sanjeeva Reddi is the man and he is the Minister to-day to be recognised and to be taken into consideration and nobody else. That is my view and I stand by it.

Deputy Speaker:—ఎట్లా అయినా చీఫ్ మినిస్టరుగారు సభలో ఉండగా పదేపదే పునశ్చరణ చెయ్యడం సవ్యముగా లేదని నాగిరెడ్డిగారికి మనవి చేస్తున్నాను.

Sri T. Nagi Reddi:—అధ్యక్షా! రాజకీయముగా జరుగుతున్న చర్చలలో ఎవరు ఎవరికి పెద్దలో చెప్పడానికి మాకు అధికారం ఉన్నది. ఈనాడు సంజీవరెడ్డిగారే అధికారములో ఉన్నారు. ఆంధ్రదేశపు జీవితాన్ని నాశనము చెయ్యడానికి, అశాంత పరచడానికి ఈనాడు ప్రయత్నములు జరుగుతున్నవని వేరే చెప్పనవసరం లేదు.

అంత పెద్ద ఉపన్యాసము ఇస్తూ ఆంధ్ర దేశములో ప్రధాన సమస్యల గురించి గవర్నరుగారు చెప్పలేదు. Anti social elements గురించి మాత్రం మాట్లాడేరు శాంతియుతముగా ప్రచారము చేస్తూ సమస్యల పరిష్కారానికి ప్రయత్నిస్తున్న కమ్యూనిష్టుపార్టీ Anti social elements [illegible] అన్నారు. ఇది చిన్న విషయముకాదు. ఆంధ్ర దేశములో [illegible]

[Sri T. Nagi Reddi] [3rd November 1954

ధరలు పడిపోతున్నవి. దీనిని గురించి ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకుందా అని అడుగుతున్నాము. 19 పేజీల గ్రంధములో ఏమైనా చెప్పేరా అంటే లేదు. ఏమి చర్యలు తీసుకొన్నారని ఎవరైనా అడిగితే సెంట్రలు గవర్నమెంటుకు వ్రాసినాము అని అంటారేగాని ఏమీ చర్యలు తీసుకోలేదు. ఇక్కడ ఉన్నది, అక్కడ ఉన్నది కాంగ్రెసు ప్రభుత్వమేకదా ఈ ప్రభుత్వం చెబితే వినలేదా, రెండు ప్రభుత్వాల మధ్య ఏమైనా తగాదాలు ఉన్నవా? ప్రపంచ మార్కెట్లలో మనకు ఏమైనా అవకాశములు ఉన్నవా, పొగాకు మార్కెటింగు కమిటీలు వేసినట్లుగా విదేశాలలో తిరగడానికి కమిటీని వెయ్యడానికి ఏమైనా వీలు ఉన్నదా, అనే విషయాలను గురించి చర్చించడానికి అవకాశము లేదు.

Foundation stones వేయాడానికే time అంతా పోతుంటే వీటికి ఆలోచన ఎక్కడిది? నందికొండ ప్రాజెక్టు, తుంగభద్ర హైలెవెలు ఛానలు గురించి, వంశధార గురించి ఆంధ్రదేశంలో బ్రహ్మాండమైన ఆందోళన వుందని మనకు తెలుసు. ఆంధ్రప్రభుత్వం ఏర్పడిన తక్షణం ఈ మూడు ప్రాజక్టుల ప్రాధాన్యత గుర్తించడానికి బదులు ఆంధ్రప్రభుత్వం తరఫున ఢిల్లీ ప్రభుత్వానికి 14 ప్రాజెక్టులు పంపించిన సంగతి మనకు తెలుసు. దేశముఖ్ ఆంధ్రదేశం వచ్చినపుడు ఆ విషయం చెప్పారు. 14 కాకపోతేపోనీ 10 ప్రాజెక్టులు పంపించారు. ఏది ముందు ఏది వెనుక అనే సమస్య వస్తే ఉబ్బి తబ్బిబై ఏమిచేయడానికి తోచక అయిదు ప్రాజెక్టులకో ఏడు ప్రాజెక్టులకో దింపారని దేశముఖ్ గారు చెప్పారు. ఆంధ్ర ప్రభుత్వానికి ఒక నిర్ణయంలేక, ఒక నిర్ణయంమీద ఢిల్లీ ప్రభుత్వానికి ఆ విషయాన్ని తెలియ చెప్పక, ఒక సంవత్సరంపాటు ఆంధ్రదేశానికి అన్యాయం చేసిన సంగతి ప్రభుత్వం గుర్తించుకొన్నదా? కమ్యూనిస్టుపార్టీ తుంగభద్ర హైలెవెలు ఛానలుకు వ్యతిరేకంగా వుందని, రాకుండా అడ్డం పడుతోందని చెప్పే ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీ సూచనల గురించి ఆలోచించిందా? కమ్యూనిస్టుపార్టీ ఎప్పుడూ నందికొండకు, తుంగభద్ర హైలెవెలు ఛానెలుకు [illegible]లేదు. దానికి రెండు కారణాలు వున్నాయి. తుంగభద్ర హైలె

3rd November 1954] [Sri T. Nagi Reddi]

వెలు ఛానలు ఒక ప్రాజెక్టులో భాగం. దానికి అవసరమైంది 18 కోట్లు. 18 కోట్ల ప్రాజెక్టులో భాగమైన దానికి తీసుకువెళ్ళి 118 కోట్లు కావలసిన నందికొండకు ముడిపెట్టడం అసంభవం అందుచేత కమ్యూనిస్టుపార్టీ మన ఖర్చులను తగ్గించుకొని, (administrative) expenses తగ్గించుకొని, దేశానికి అవసరమైన ప్రధానమైన విషయాన్ని చర్చిస్తున్న సందర్భంలో ఆంధ్రలో కోరుతున్నట్లు—వాంఛూ కూడా చెప్పినట్లు—మద్యపాననిషేధాన్ని రద్దుచేసి అందులోనుంచివచ్చిన డబ్బుతో హైలెవెలు ఛానలు నిర్మాణం కావించడం మన కర్తవ్యం అని చెబుతూవచ్చి దానికి సిద్ధంగా లేనప్పుడు, సంజీవరెడ్డిగారి ప్రభుత్వం మద్యపాన నిషేధాన్ని రద్దుచేయకపోతే, ఈ రెండింటికి పోటీ పెట్టడానికి బదులు ఒక ప్రాజెక్టు ఇదివరకే ప్రారంభించారు కాబట్టి హైలెవెలు ఛానలు పని పూర్తిచేయాలి అని చెప్పాం. కాని కృష్ణానదిమీద ప్రధానమైన ప్రాజెక్టు ఏది అంటే నందికొండ తప్ప మరొకటి లేదని చెప్పడానికి ఈ ప్రభుత్వానికి సంవత్సర కాలం ఎందుకు పట్టింది అని అడుగుతున్నాను. పోటీలు పెట్టవలసిన అవసరంఎందుకు వచ్చింది.? High level channel ఒక ప్రాజక్టులో భాగం ప్రాజెక్టు, అర్ధం భాగం కట్టి మిగతాది పరిపూర్తి చేయకుండా వుండడమా? అది రాజ్యపరిపాలన అవుతుందా? ఆంధ్రప్రజ అవసరమని కోరే క్రొత్తప్రాజెక్టుకు, దీనికి పోటీపెట్టి, మాకు ఏదో దురుద్దేశం వుందని దాన్ని చక్కదిద్దడానికి మాకు చేతకాలేదని చెప్పడం దేనికి? కమ్యూనిస్టు పార్టీ నందికొండకు, high level channel కు పోటీ పెట్టలేదని, అది మాప్రచారంలో భాగం అనే సంగతి ప్రభుత్వం ఎందుకు గుర్తించలేదని అడుగుతున్నాను. 14 ప్రాజెక్టులనుంచి 3 వరకు దిగక ఈనాడు తప్పలేదు. ఎందుచేత? రాజకీయ చాతుర్యంబట్టి- ఆర్థిక స్థితినిబట్టి, ఎలాగా నందికొండ ప్రాజెక్టును కృష్ణానదిపై ప్రప్రథమ ప్రాజెక్టుగా నిర్మించక తప్పదు. నిర్మించ బడిన తుంగభద్ర హైలెవెలు ఛానెలు త్రవ్వక తప్పదు. ఇంక వంశధార ప్రాజెక్టు నిర్మించే స్తోమతు ఆంధ్ర ప్రభుత్వానికి వున్నది. హైలెవెలు ఛానెలు, వంశధార రెండూ తీసుకోవచ్చునని మా అభిప్రాయం. ఈ మూడు ప్రాజెక్టుల గురించి కమ్యూనిస్టుపార్టీ 1953 లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడబోతున్న సమయంలో pass చేసిన తీర్మానంలో చెప్పబడి వుంది.

[Sri T. Nagi Reddi] [3rd November 1954

ఈ విషయం గుర్తించడానికే ప్రభుత్వానికి ఇన్నాళ్ళు పట్టింది. ఇంక, కమ్యూనిస్టులు ఏమి చేసారు అని అడుగుతున్నాను. ఒక విషయం చెబుతున్నాను. ఆంధ్రదేశంలో ఏమైనా జరిగితే ప్రధానంగా ప్రతిపక్షంయొక్క బలంవల్లనే అనేది విస్మరించరాని విషయం.

Sri G. Nagabhushanam :—I want to know what is the constructive programme of the communist party.

Sri T. Nagi Reddi :—I shall tell you.

Deputy Speaker :—I will tell the hon. Member one thing. He should take the permission of the Chair before he speaks.

Sri T. Nagi Reddi :—మూడు సంవత్సరాలుగా కాంగ్రెసు ప్రభుత్వం బంజరులు పంచడానికి నిరాకరించిన తరువాత మేము పెట్టిన ప్రతిపాదన అంగీకరించక తప్పలేదనే సంగతి కాంగ్రెసు ప్రభుత్వం గుర్తించిందా? ఆంధ్రరాష్ట్రంలో గ్రామాల్లో వుండే పేదప్రజానీకానికి ఇండ్లస్థలాలు ఇవ్వడానికి నిరాకరించిన ఆంధ్రప్రభుత్వం, బడ్జెటులో ఇందుకై 3 లక్షల రూపాయలను కేటాయించి షావుకార్లకు ఇండ్లు కట్టించడానికి 30 లక్షలు కేటాయించిన సంగతి కమ్యూనిస్టుపార్టీ బహిరంగ పర్చేసరికి 3 లక్షలు 13 లక్షలుగా చేసిన సంగతి ప్రభుత్వానికి తెలుసా?

The Hon. Sri T. Prakasam :—ఎట్లాచేసారు?

Sri T. Nagi Reddi :—ఎట్లాచేస్తారు? ఇక్కడ కూర్చున్నపుడు బడ్జెటులో వేసింది 3 లక్షలు. అది పూర్తిఅయేసరికి 13 లక్షలు కావలసివచ్చింది. ఈ విషయం విస్మరించరాని విషయం. ప్రధాన మంత్రిగారికి నేను చెప్పేది ఒకటే. బడ్జెటులో మూడులక్షలు వున్నది. ఈలోగా ప్రభుత్వ ప్రకటన ద్వారా అది 13 లక్షలైనది. అవిశ్వాసతీర్మానం ఇచ్చినాక ఈ రు. 10 లక్షలతగ్గింపు వచ్చింది, ప్రపంచంఅంతా గుర్తించినా నేను గుర్తించను అంటె వాళ్ళకు అభ్యంతరం లేదు. ప్రపంచం అంతా గగ్గోలయినది. పత్రికలలో

3rd November 1954] [Sri T Nagi Reddi]

కూడా వ్రాసినారు, వారే చేసారు అనుకుందాము. చేసినప్పటికైనా సక్రమంగా చేయాలి. ప్రజలమీద ప్రతిపక్షంమీద కక్ష పూనకూడదు. ఈ విధంగా దేశంలో అశాంతిని కల్పించటానికి ప్రభుత్వం పూనుకుంటే అది ప్రజలలో మరింత అశాంతికి కారణం అవుతుంది. ఆంధ్రప్రభుత్వానికి నేను విన్నవించేదేమిటంటే 1948 లో మీరు చేసినదానికి, ఫలితాలను చూసిన తరువాత కూడా తిమ్మారెడ్డి, సంజీవరెడ్డి లాంటివారు ప్రతిపక్షంలోని కమ్యూనిస్టుపార్టీని అసెంబ్లీ వస్తుందని ఊరుకొన్నాంకాని లేకపోతే ఏమి చేసేవారమో అని చెప్పి ప్రజలను రెచ్చకొట్టవద్దని, అటువంటి కార్యక్రమానికి పూనుకోవద్దని- మనవిచేస్తున్నాను. అన్ని విషయాలలో ప్రభుత్వం కల్పించుకోవద్దని, ఒక side తీసుకొని ఆ side నాది ఈ side నాకు వ్యతిరేకం అని దేశాన్ని గగ్గోలుపాలుచేయవద్దని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈ కారణాలచేత ఈ ప్రభుత్వం వుండకూడదని, దానిని గద్దెనుంచి దింపాలని, దానికి బదులుగా ప్రతిపక్షముల వారిచే ఏర్పాటు చేయబడిన ప్రభుత్వం అధికారంలో వుండాలని మా విశ్వాసం. Democratic traditions అనుసరించాలన్నా, వాటిని కాపాడాలన్నా, ఈ ప్రభుత్వంను దించి దానికి ప్రత్యామ్నాయంగా ప్రతిపక్షంలోని వారు అధికారంలోనికి రాకతప్పదని మా అభిప్రాయం. దానినే ప్రజలు కోరుతున్నారు. అందుచేత ఈ amendments ను నేను బలపరుస్తూ, అందరూ వాటికి బలం ఇవ్వాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri G. Nagabhushanam :—Mr. Nagi Reddi has not answered my question.

Sri T. Nagi Reddi :—With your permission, Sir, ప్రతిపక్షంవారు అధికారంలోవుంటే ఏమిచేస్తారో అని అడిగిన నాగభూషణంగారి చాతుర్యం గురించి నేను చాల ఆశ్చర్య పడుతున్నాను. ప్రతిపక్షమే అధికారంలో వుంటే ఈ ప్రభుత్వంపై సంవత్సరంలో సాధించిన వాటన్నింటినీ మూడునెలలలో చేయగలదని మాత్రము చెప్పగలను.

Sri K. Varadhachari :—అధ్యక్షా!

[3rd November 1954

Sri T. Nagi Reddi:—On a point of order, Sir, పొరపాటు అనుకుంటున్నాను. సాధారణంగా Leader of the Opposition మాట్లాడిన తరువాత ముఖ్యమంత్రిగారు, లేకపోతే వారిచేత నియమింపబడిన వారు, Leader of the House, జవాబు యివ్వడం పరిపాటి. ఇప్పుడు వరదాచారిగారికి అనుమతిస్తే వారు చెప్పినదానికి జవాబివ్వడానికి యిటువైపునుండి మరొకరికి అవకాశం యివ్వవలసి వుంటుంది. కాబట్టి యిప్పుడు సాధారణమైన democratic procedure ప్రకారం జవాబివ్వడానికి ఉపముఖ్యమంత్రి మాట్లాడడం సబబు అనుకుంటాను.

Deputy Speaker:—Thanks giving motion మొదట ప్రవేశపెట్టినవారు వరదాచారిగారు కాబట్టి, వారు మాట్లాడడానికి అనుమతిస్తున్నాను.

Sri T. Nagi Reddi :—Thanks giving motion లను చాలా సార్లు discuss చేశాము. Discuss చేసినప్పుడు సాధారణంగా thanks giving motion ను propose చేసినటువంటి వాళ్లు కడను మాట్లాడడం నేను యింతవరకు చూడలేదు. మూడుసంవత్సరాల నా parliamentary జీవితంలోను, అసెంబ్లీ జీవితంలోను చూడలేదు. కాబట్టి ప్రశ్న వేయవలసి వచ్చింది. యిప్పుడు అది సాంప్రదాయంకు అనుగుణ్యం కాదని నా అభిప్రాయం.

Deputy Speaker:—I would like to know the opinion of the leader of the House.

The Hon. Sri N. Sanjeeva Reddi :—We are not very particular......we are absolutely not particular.

Sri K. Varadachri :—I have to make a submission. I have got a constitutional right of replying. What I submit is that I might be allowed to say a few words for five or ten minutes after the Hon. Minister has spoken.

Deputy Speaker:—మీరు ఇప్పుడు తిరిగి మాట్లాడడం సాంప్రదాయం కాదు అనుకుంటున్నాము. Leader of the House అభ్యంతరం లేదన్నారు. కాబట్టి వారిని మాట్లాడమని కోరుతున్నాను.

3rd November 1954]

**The Hon. Sri N. Sanjeeva Reddi**:—అధ్యక్షా! మూడురోజులుగా యీచర్చలు కొనసాగిస్తున్నాం, మూడురోజులు అవసరం వుండదేమో అనుకున్నాం. రెండురోజులలో చర్చముగిస్తే తరువాత తీర్మానానికి 2, 3 రోజులు తీసుకోవచ్చునని అనుకున్నాం. కాని మిత్రులు ప్రతిపక్షాలు మూడురోజులు కావాలని కోరినందువల్ల వారందరికి అవకాశం వచ్చే విధంగా మేముకూడా అంగీకరించాము. అంతా 40 మంది యిప్పటికి—

**Sri Vavilala Gopalakrishnaiah**:—Point of order, Sir, ప్రతిపక్ష సభ్యులా, ప్రతి పక్షాలా అని అడుగుతున్నాను.

**Deputy Speaker**:—It is not a point of order.

(At this stage Mr. Speaker resumed the chair)

**The Hon. Sri N. Sanjeeva Reddi**:—అధ్యక్షా! వారిసవరణను నేను అంగీకరిస్తున్నాను. ఎందుకంటే వారు నాకంటే పండితులు. మూడు రోజులుగా 40 మంది మాట్లాడాము. ఇంతచర్చ సమగ్రంగా జరిగింది. బాగానే చర్చించుకున్నాం. ఉద్రేకానికి గురికాకుండా ప్రశాంతంగా చర్చించు కున్నందుకు మాత్రం నేను ఆశందిస్తున్నాను. 6 నెలల తరువాత చాల ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడతాయని అనుకున్నాను. కాని కర్నూలు వాతావరణం కారణం అనుకుంటాను. చాలమంది ప్రతిపక్షంవారి మనస్సులు ప్రశాంతంగా వున్నాయి. నాగిరెడ్డిగారు చాల పొడుగైన ఉపన్యాసమిచ్చారు. చాల బాగా చెప్పారు. విని సంతోషించాను. కాని మధ్యలో విచారాన్ని బాధను కలిగించే విధంగా ఒత్తిచెప్పడం, మా నాయకుని గురించి, మన ముఖ్యమంత్రిగారిని గురించి చెప్పడం చాల బాధ కలిగించింది. వారు చెప్పింది యేమయినా కాంగ్రెసు పార్టీ తరఫున, మిత్రులందరి తరఫున సవినయంగా స్పష్టంగా చెప్పేదేమిటంటే రాజకీయ జీవితంలో నేనేకాదు, యిక్కడున్న మిత్రులలో చాలమంది రాజకీయ వేత్తలు, ప్రకాశంగారి నాయకత్వంక్రింద సలిగి బాగ పనిచేయగలిగామని, దేశం ముందుకు వచ్చిన వారమని మీ కందరకు సగర్వంగా చెప్పుకుంటున్నాము. కొద్దికాలం వారు ప్రతిపక్ష సభ్యులతో కలవటం తటస్థించినా దేశసౌభాగ్యానికి దేశానికి సరైన పంథా చూపడానికి, దేశాన్ని ఒక సరైన పద్ధతిలో నడిప

డానికిగాను వారు యీ కార్యభారాన్నంతా మోయడానికి, వారి ఆరోగ్యం అంత బాగా లేకపోయినా వాటి విషయం ఆలోచించకుండా, అంగీకరించినందుకు కాంగ్రెసు పార్టీయే కాదు ప్రభుత్వ సభ్యులే కాదు, దేశంలో లక్షలాది ప్రజలు హర్షిస్తున్నారు, ఆనందిస్తున్నారు. వారు నాగిరెడ్డిగారి వలెను, నావలెను చకచక నడువ లేక పోవచ్చు. కాని వారు దేశంలో నాయకులుగా తయారైన రోజుల్లో మనం ఎవరమూ పుట్టలేదని ప్రతిపక్ష నాయకునికే కాకుండా మిగిలిన సభ్యులందరకు కూడా జ్ఞాపకం చేస్తున్నాను. ఈనాడు మనం రాజకీయంగా మాట్లాడుకున్నా, అగౌరవంగా మాట్లాడకుండా వుండడం మంచిదని నేను మిగిలిన మిత్రులందరికి సలహా యిస్తున్నాను. అది యింతటితో మరచిపోవడం మంచిది. మరచిపోదాం. నేను యీనాటికి చర్చను గురించి పెద్ద వుపన్యాసం యివ్వదలుచుకోలేదు. ఇక రానున్న చర్చకు, గతమూడు రోజులు జరిగిన చర్చకు పెద్ద తేడా ఏమీ వుండదు. కాబట్టే యీమూడు రోజుల చర్చకు సమాధానం యిచ్చేబదులు యింకో మూడురోజుల చర్చ అనంతరం అన్నిటికీ ఒకేతూరి సమాధానం చెప్పాలనుకున్నాను. కాని నేను చెప్పవలసినవన్నీ యిప్పుడు మానేసి ప్రతిపక్షంవారు చెప్పిన వాటికి మాత్రమే జవాబు చెబుతున్నాను. వారు మారాజకీయాలను గురించి చెప్పినట్లే వారి రాజకీయ చరిత్ర చెప్పవలెనంటే బ్రహ్మాండమైనంత వున్నది. ఆ పాపపు చరిత్ర అంతా 3 రోజులయిన తరువాత చెబుతాను. మొదట హనుమంతరావుగారు చాల దీర్ఘంగా, చక్కగా మాట్లాడారు. వారే actual communist party నాయకుడు అనుకోండి; ఏదో పేరుకు మాత్రం రాయలసీమ వాడిని పెట్టారు అనుకోండి.

**Sri M. Hanumantha Rao:**—ఇంతకు ముందు ముఖ్య మంత్రిగారి విషయంలో ఉపముఖ్య మంత్రిగారు చాలా కోపంపడ్డారు. నేనుకూడా అదే అభ్యంతరం తీసుకోవలసి వచ్చింది.

**The Hon. Sri N. Sanjeeva Reddi:**—రెండూ రద్దుచేసుకుందాం. అందులో వారు ఒక మాట అన్నారు. గవర్నరుగారి వుపన్యాసం శుష్కమైనదని పత్రికలన్నీ కూడా వ్రాశాయని అన్నారు. ఏ పత్రికలు అని అడిగితే Madras Mail వ్రాసిందని అన్నారు. Head lines వేశారా లేక editorials వ్రాశారా అని వారు చూడలేదు.

3rd November 1954] [Sri N. Sanjeeva Reddi]

వీరు "విశాలాంధ్ర" పేపరులో పెద్ద head lines చూసి గొప్పగా చెప్పుకొంటారు గాని, ఇతర papers లో ఏమిఉండేది చూడరు. బహుశః, విశాలాంధ్రలో పెద్ద అక్షరాలుండవచ్చు, మిగతా papers లో చిన్న అక్షరాలుండవచ్చు, కొన్నివాటిల్లో పెద్ద type ఉంటుంది. వీరు ఇతర papers లోని సంపాదకీయాలు చదువరు. సంపాదకీయాలు సాధారణంగా ప్రజాభిప్రాయాన్ని వ్యక్తపరుస్తాయి. వాటిని వీళ్ళు చదువరు. వారికి కాబట్టదు. Head lines చూస్తారే గాని అందులో ఏమి వ్రాసినది చదువరు. చూడవలసినది, head lines మాత్రమే కాదు, అందులో ఏమివ్రాసింది కూడ చదువమని వారికి సలహా ఇస్తున్నాను. వీరు విశాలాంధ్ర సంపాదకీయము తప్ప మరేది చూడరు.

తరువాత నాగిరెడ్డిగారు, హనుమంతరావుగారు, ఇన్ని నెలలైన తరువాత అసెంబ్లీ కలుస్తూయున్నదే అని అన్నారు. ఏన్ని నెలలైందో లెక్కవేసి చూడవలసిందని అంటాను. 4, 5 నెలలైంది అనుకొంటాను. ప్రపంచంలో ఈవిధంగా 4, 5 నెలలుగా అసెంబ్లీ సమావేశము కూర్చొనక పోవడమనేది సాధారణంగా ఉంటుంది. అసలు ఆంధ్ర రాష్ట్రము వచ్చిన తరువాత, నవంబరు, డిశంబరు, జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ మే, ఈయేడు నెలలు వరుసగా కలిశాము. ఇక్కడైతేనేమి విశాఖపట్నంలో అయితే నేమి ఈ 7 నెలలు వరుసగా కలిశాము. జూన్ 1 వ తేదీ కూడ కలిశాము. అక్టోబరులో కూడ 29 వ తేదీనే కలిశాము. మధ్యలో, 4, 5 నెలలు మాత్రము లేదు. ఈ 4, 5 నెలలు వాయిదా వేశాము. మేము ముందుగానే సమావేశ పరచమని బెజవాడ నుండి statement ఇస్తే, వెంటనే ఎందుకు సమావేశ పరచలేదని, గవర్నరుకు కూడ వ్రాశాము. కాని మీరు ఓడిపోతామేమోనని జంకుతూ వెంటనే సమావేశ పరచలేదని అంటున్నారు. అది కాదు కారణము. మీరు ఇన్ని పార్టీలు చేరికూడ తికమకలవుతూ ఉంటారు గదా, అటువంటప్పుడు, మేము ఒక పార్టీని జైలులో పెట్టి అసెంబ్లీ ఎట్లు సమావేశ పరచగలము. వద్దు వద్దు అంటేకూడ మేము జైలుకు పోతాము, మా త్యాగం చూపిస్తాము అన్నారు. వాళ్లు ఇదివరకు ఎప్పుడూ జైలుకు పోయిందిలేదు. త్యాగం చేసింది లేదు. ఇప్పు డదంతా చూపిస్తామని ప్రయత్నం చేస్తున్నారు P. S. P. వాళ్లు. సరే, వాళ్లు కూడ చూచిరానీ అని ఒక నెలరోజుల పాటు జైలుకు పంపించాము.

వాళ్లను జైలులోపెట్టి మనమిక్కడ సమావేశమయితే న్యాయమని అనుపించుకొంటుండా మూడు పార్టీలు ఉండి ఇంత బాధపడుతూ, నందిని పంది చేయాలని, పందిని నంది చేయాలని ప్రయత్నం చేస్తున్నారు. కాని నంది, నందిగానే ఉంటున్నది.. అటువంటప్పుడు ఒక పార్టీని జైలులోపెట్టి అసెంబ్లీ సమావేశ పరిస్తే దేశం హర్షిస్తుందా మమ్ములను! మేము బలవంతంగా వారిని జైలుకు లాగుకొని పోయామా? వద్దు అంటే, లేదు మేము చట్టాన్ని వ్యతిరేకిస్తాము- జైలుకు పోతామని వారి త్యాగాన్నంతా చూపటానికి ఆవిధంగా చేశారు. ఆవిధంగాప్రపంచాన్ని మభ్యపెట్టదలుచు కొన్నారేమో! కనుక వారు లేనప్పుడు, అసెంబ్లీ సమావేశ పరచడం న్యాయం కాదు. ప్రశాంత పరిస్థితులు ఏర్పడిన తరువాత సమావేశ పరిస్తే బాగుంటుందని నిదానించాము. ఆగస్టులోనే కలుస్తామని అనుకున్నాము కాని, అప్పుడే వీరు ఇది ప్రారంభించారు. అందులో ఇక్కడ ఉన్నవారు, శాసనసభ్యులు అయిదుగురో లేక నలుగురో అనుకొంటాను. వీరు జైలుకుపోవడంవల్ల మేము వాయిదావేయవలసి వచ్చింది. అంతే గాని అప్పుడు మాకు బలము లేదని జంకినామని కాదు. అప్పుడు లేని బలము ఇప్పుడు ఎక్కడ నుంచి వచ్చింది! ఈ మధ్యలో ఎక్కడైనా కొత్తగా శాసనసభ్యులను సృష్టించామా? అప్పుడు ఉన్నబలమే ఈనాడు ఉన్నది. ఇప్పుడు సమావేశ పరచి జయింపగలిగితే, ఆనాడైనా వాళ్లను జయింపగలిగి ఉండేవాళ్ళము. కాని అప్పుడు పరిస్థితులు బాగాలేవు. అశాంతిగా ఉండినది దేశమంతా. ఎక్కడపడితే అక్కడ ప్రభుత్వాన్ని ఓడించే తాహతులేనివాళ్లంతా బయట కేకలు వేస్తూ ఉండడంవల్లనో, వాతావరణమంతా అశాంతిగా ఉండడంవల్ల, ప్రజలలో అలజడి ఉండడంవల్లను, ఆ పరిస్థితులలో సమావేశ పరచడం మంచిది కాదనుకొన్నాము. అంతేకాని, అప్పుడు ఓడిపోతామని భయపడికాదు. కనుక అటువంటి అభిప్రాయాన్ని ఇకమీదట వదలుకొమ్మని ప్రతిపక్షము వారిని ప్రార్థిస్తున్నాను.

ఇక మాజీ కల్లుగీతవాళ్లను గురించి దీర్ఘంగా ఉపన్యసించారు. [illegible] మాజీమంత్రి అయిన లచ్చన్నగారి monopoly అనే అనుకొంటాను [illegible] హనుమంతరావుగారు కూడ దీర్ఘంగా ఉపన్యాసం చేశారు. మాజీ [illegible] సమాధానం [illegible] సభ్యుడు, [illegible] స్వాతంత్ర్యం [illegible] ఎక్కువగా చెప్పారు. మాజీ

గీతవాళ్లు అని వాళ్ళను గూర్చి పలుమారు చెప్పడ మెందుకు? వారికి వేరే వృత్తి చూపించడానికి వీలులేదా, వారికి ఇంకొక రకంగా పోషణ చూపలేమా అని అన్నారు. ప్రభుత్వము మాజీగీతవాళ్ళని కూడ ఇతర పేదవాళ్ళతోపాటు సమానంగానే చూస్తున్నది. దేశంలో మాజీగీత వాళ్లైనా బీదవాళ్ళు, ఇక బీదవాళ్ళు లేరా! అనేకమంది బీదవాళ్ళున్నారు. ఈదేశంలో ఈనాడు ఈ ప్రభుత్వము బీదలందరిని మార్చి వారికి స్వర్గతుల్యంగా చేయగలదా? ఈ దేశంలో పేదతనం ఎక్కువగా ఉన్నది. ఈ పేదతనాన్ని తెల్లవారుసరికి మార్చలేమని మాకు తెలుసు. ఎవరు అధికారంలోకి వచ్చినా సాధ్యంకాదు. మీరువచ్చిన, ఉపన్యాసాలు చేయడానికి, కలతలు పెట్టడానికి పనికివస్తారేమో గాని ఈ పేదతనాన్ని పోగొట్టలేరు. ఈ మాజీగీత వాళ్ళకు కూడ ఏదోరకంగా వృత్తికల్పించడానికి, వారికి సహాయం చేయడానికి కృషిచేస్తున్నాము, అయితే వారికి అదే వృత్తి కావాలి, ఇంకోరకంగా జీవించలేరు అని అనడం పొరబాటు. వీరికి భూములివ్వడానికి నీరా భవనాలు పెట్టడానికి వీరికి ఒక మార్గం చూపించటానికి, మనమందరము కలసి ఆలోచన చేస్తే సాధ్యమౌతుంది. అట్లుగాక, మేము కల్లుగీయాలి అనే పంథాలో ఆలోచిస్తే దీనివల్ల ఉపయోగంలేదు. దీనివల్ల దేశానికిగాని, మాజీగీతవాళ్ళకు గాని ఏమీ ఉపయోగముండదు.

హనుమంతరావుగారు పోలీసువాళ్ళు చేస్తున్న దురాగతాలను గురించి చెప్పారు. ముఖ్యంగా నల్లగొండలో ఏదో బ్రహ్మాండమైన అల్లరి చేసినటువంటి ఒక D. S. P. కి ఇక్కడ ఒక medal ఇచ్చినారని అన్నారు. వారు ఎప్పుడూ ఒక ప్రక్కనే చెప్పుతూ ఉంటారు. ఏ బొమ్మకుగాని, ఏ పటమునకు గాని రెండవపక్క గూడ వున్నదని వారికి తెలియదు. కాని పోలీసువారు ఎవరిని చంపారు? ఎందుకు చంపారు? ఎప్పుడు చంపారు. ఎటువంటివారిని చంపారు, ఎంతమందిని చంపించిన వారిని చంపారు, ఎంతమంది స్త్రీలను, ఎంతమంది అమాయకపు రైతులను చంపిన వాళ్ళను ఖతము చేశాము అన్న విషయాన్ని వారు చర్చకు తీసుకోరు. ఎక్క-

[Sri N. Sanjeeva Reddi] [3rd November 1954

డై నా గొప్ప అల్లకల్లోలము జరుగుతూఉంటే, హత్యలు జరుగుతూఉంటే, అక్కడ law and order maintain చేయడంలో పోలీసు వాళ్ళు ఇటువంటి accidents కలిగించక తప్పదు. దౌర్జన్యపరులను శిక్షించ వలసి యుంటుంది. ఇదివారి విద్యుక్త ధర్మము. ఇది సక్రమముగా నెర వేర్చినవారిని ఏ ప్రభుత్వమైనా అభినందిస్తుంది. ఇందులో తప్పేమి లేదు. అంతే కాదు, ఈలాంటి ఉద్యోగులు మరీ హెచ్చుగా కావాలి. ప్రజా శాంతిని కాపాడడానికి కృషిచేసే వారిని తప్పక అభినందిస్తాము. వారికి ప్రోత్సాహం ఇస్తాము. ప్రతి సంవత్సరం ఇలాంటి ఉద్యోగులను గౌర వించడం జరుగుతునే ఉంటుంది. అందులో వీరుకూడ ఒక భాగమను కోండి.

ఇక, services అంతా demoralise చేస్తున్నామని కూడ హను మంతరావు గారు అన్నారు. service ను demoralise ఎవరు చేస్తు న్నారో ఏవిధంగా demoralise చేస్తున్నారో కొంచము ఆలోచించు కోమంటాను. ఎవరు ఈ service ను demoralise చేస్తున్నారు? తాము చెప్పినట్లు ఉద్యోగులు వినకపోతే, తాము చెప్పిన తప్పుడు పనులు చేయకపోతే, వెంటనే వారిమీద corrruption petitions ప్రభుత్వానికి పంపుతూ ఉద్యోగులను బెదరించేవాళ్ళు ఈ అరాచకాన్ని సాగిస్తున్నారు. వాళ్లే ఈ services ను demoralise చేస్తున్నారు. వారే ఈ ఉద్యోగస్తు లలో అలజడి కలిగిస్తున్నారు. తాము చెప్పినట్లు ఉద్యోగస్తులు వినకపోతే, ఉద్యోగస్తులు న్యాయంగా చేయడానికి వీలులేని పరిస్థితులు కల్పించి తాము పట్టినకుందేటికి మూడేకాళ్ళని, మేము చెప్పినట్లు చేయక పోతే ఏమవుతుందో చూచుకోమ్మని ఉద్యోగస్తులను బెదరించేవాళ్లే services ను demoralise చేస్తున్నారు. వారే దీనికి కారకులు. నేను అందుకే ఉద్యోగస్తులకు ఎప్పుడూ సలహా ఇస్తూఉంటాను. ఏ M. L. A. అయినాసరే, మంత్రిగా నైనాసరే, వారి బంధువులైనాసరే, ఎవరు ఏమిచెప్పినా గూడ, మీరు మాత్రం న్యాయంగానే పొండి. మీకు ఏలాటిభయంలేదు, అన్యాయ మార్గాలు అవలంభించకండి, మీపైన petitions వస్తాయని భయపడ

3rd November 1954] [Sri N. Sanjeeva Reddi]

కండి, మీకు తప్పకుండా ప్రభుత్వము రక్షణ ఇస్తుంది అని వారికి హామీ ఇస్తూ ఉంటాను.

తరువాత కమిటీలనుగురించి మాట్లాడుతూ ఈ కమిటీలలో ప్రతిపక్ష సభ్యులను ఎవరిని వేయడంలేదు, అంతా పనికిమాలిన వాళ్ళను వేస్తున్నారని చెప్పారు. కొన్ని కమిటీలలో ప్రభుత్వ పక్షంవారినే వేసుకోక తప్పదు. ఏపక్షమునుంచి సహాయంవస్తుందో ఆ పక్షాన్ని బలపరుస్తుంది. వారినే కమిటీలో తీసుకోక తప్పదు. తిరుపతి కమిటీలో కమ్యూనిస్టు సభ్యులు లేరా! ఉన్నారు. మీరు కూడ ఒక సభ్యులే. దేముడు లేడు అని వాదించే వాళ్ళను కూడ ఈ కమిటీలో సభ్యులుగా విశ్వనాథంగారు వేశారు. నేను ఇటువంటి వారిని వేయవద్దు, దేవుడు లేడు అనేటటువంటి వాళ్ళను దేవుని ధర్మకర్తగా పెడితే, దేవుణ్ణి దేవునియొక్క వస్తువులను కూడ మింగుతారని అన్నాను. కాని విశ్వనాథంగారు చాలా ఉదారస్వభావంతో అటువంటి వారిని కూడ వేశారు. ఆయన, ఉన్నంతలో పెద్దమనుష్యులను మంచివారినే వేశారు. దానికి సంతోషిస్తున్నాను. ఇక Land Reforms Committee లో అందరిని భూస్వాములను వేశారని, పనికిమాలిన వాళ్లను వేశారని చెప్పారు. అందులో భూస్వాము లెవరున్నారో చెప్పమంటున్నాను. సుబ్బారావుగారు వున్నారు. ఆయనకు 2 వందల ఎకరాలభూమో అంతకుపైనో ఉన్నటువంటి భూస్వామి. అక్కడ ఉన్నవాళ్ళందరికన్న పెద్ద భూస్వామి ఆయనొక్కరే. తరువాత రొక్కం లక్ష్మీనరసింహం దొరగారు వున్నారు. వారు భూస్వామా? సాధారణమైన రైతు. మధ్యరకపు రైతు. తరువాత మన నాగభూషణంగారు. నాగభూషణంగారు భూస్వామి కాదు. నిరుపేద కుటుంబంనుంచి వచ్చిన శాసన సభ్యుడు. ఎప్పుడైనా కోర్టులో కొద్దిపని ముగించుకొని, వెంటనే పల్లెలో తిరగడం, వారిని చూడ్డం, వారి కష్ట నష్టాలను విచారించటం, ఇది, వారివృత్తి. 20, 30 ఏళ్ళుగా దాదాపు కాంగ్రెస్ సేవచేస్తూ, ప్రజా సహాకారంతో ప్రజాప్రేమను చూరగొని లక్షాధికార్లతో పోటీ చేసి శాసనసభ్యుడైన వ్యక్తి ఆయన. ఆయన ఇంతకుముందు పేదలకు సేవచేసినవారు. ఈ పేదతనం ఇంతకుముందు ఆయనకు తెలియనిది కాదు. పేదతనాన్ని అనుభవించాడు; పేదతనంపై ఉపన్యాసాలు యిచ్చేవాడు కాదు. పేదతనం గురించి ఉపన్యాసాలు యిస్తూండేవాళ్ళు ఉన్నారు.

[Sri N. Sanjeeva Reddi] [3rd November 1954

నాకు తెలుసును. నెలకు 4 వందలు, 5 వందలు ఖర్చు చేస్తూ, దానిని అనుభవించి పేదతనం గురించి గంభీరమైన ఉపన్యాసాలు యిచ్చేవాళ్లు ప్రతి పక్షంలో ఉన్నారు. కనుక పేదతనమును అనుభవించి, పేదతనం అంటే ఏమిటో తెలుసుకొన్న వాడు ఆయన. తరువాత ఇంకొక పార్టీ వారిని ఎవరినీ వేయలేదన్నారు. ఇంకొక శాసనసభ్యుడు — ప్రజా సోషలిస్టు సభ్యుడై Central Parliament లో Praja Socialist Party కి ప్రధానమైన whip గా పని చేస్తున్నటువంటి Harijan Member, B. S. Murty గారు. ఆయన కోటీశ్వరుడా? భూస్వామా? ఏమిటి? వారికి అనుభవంలేదా కొంత Administrative అనుభవం ఉండి భూస్వామి కాకుండా, రైతు కుటుంబంలోనుంచి వచ్చి బాగా చదువుకుని, Director of Agriculture గా పనిచేసి రాష్ట్రం అంతటా, అన్నిజిల్లాలు తిరిగి, అన్ని ప్రాంతాలలోని భూమియొక్క పరిస్థితులు తెలుసుకున్న ఆయనను ఒక ఉద్యోగస్థుడు ఉండాలనే ఉద్దేశ్యంతో Retired Director of Agriculture, P. Rami Reddi గారిని, ఆహ్వానించాము. ప్రత్యేకంగా వారు భూస్వామిగాని, జమీందారుగాని పోనీ కోటీశ్వరుడు కాదు, బ్యాంకులో డబ్బువేసిన కోటీశ్వరుడు కాదు. వారియొక్క తెలివి తేటలను, ప్రజ్ఞను అనుభవాన్ని, ఉపయోగించ వారిని ఆహ్వానించాము. ఇందులో భూస్వాములకు గాని, జమీందారులకు గాని, ధనాఢ్యులకు గాని సహాకరించే వారులేరు. వేలఎకరాల పొలం ఉన్నవాళ్ళు లేరు. అలాంటివాళ్ళని ఎవరినైనా దగ్గరకు రానిచ్చామా? ఈ Committee వారి సహాకారానికై వేయబడిందా? మరి, ఏమిటి ఇది? విమర్శ చేసినప్పుడు సహేతుకంగా ఉండాలి. కారణమే లేకుండా, కావలసినది అక్కరలేనిది లేకుండా విమర్శించడం చాలా పొరపాటు. కాబట్టి ఆకమిటీని అందరూ బలపరచండి. ఆ కమిటీకి సలహాలు యివ్వండి. ఆ కమటీద్వారా మన కార్యక్రమాన్ని కొనసాగించుకోవాలి.

ఇంకొకటి, హనుమంతరావుగారు ప్రొద్దున direct గా నాపై నేరం మోపారు. నేను ఈ మధ్య మోపిదేవికి పోయానని, మోపిదేవిలో సాత్యం కావలసివచ్చి ఒక్క ఇంట్లో భోంచేశానని నేరం మోపారు. నేను మోపిదేవికి పోయిందీ నిజమే, పోయి ఒక పేదరైతు ఇంట్లో భోంచేసిందీ నిజమే. ముందర్ని అక్కడ ఉన్నటువంటి జమీందారుగారు

ఆహ్వానం యిచ్చారు నాకు. ఆయన కోటీశ్వరుడు, దానిలో పోతున్నావు, మా యింటిముందుగా పోతున్నావు, మా యింట్లో భోంచేసి పోవాలి అంటే, కాదని నిరాకరించి ఒక పేదవాడి ఇంట్లో, భోజనముచేశాను, నేను మంత్రిగాపోయి. కాని ఆ జమీందారు ఇంట్లో ఎప్పుడూ భోజనముచేయు లేదు. నాగిరెడ్డిగారిని జమీందారులు ఆహ్వానిస్తే ఈనాడు ఆయన మధ్యాహ్నం తాడేమోగాని సంజీవరెడ్డిమాత్రం పోలేదని, ఇకముందు పోడని, చెప్తున్నాను. ఒక పేదరైతు ఇంట్లో భోజనముచేశాను.

Sri C. Pulla Reddi.—గార్లేయపురంలో ..

The Hon. Sri N Sanjeeva Reddi.—గార్లేపురంలో జమీందారులులేరు. పుల్లారెడ్డిగారికి ఇలాంటివే కనపడుతూంటాయి, ఎప్పుడూ! చాలా విచారకరం. పుల్లారెడ్డిగారికి జమీందారులు లేనిచోట జమీందారులు కనిపిస్తూంటారు. వారికి కొంత సహకారం యిచ్చే జమీందార్లు అంతా న్యాయవర్తులు; తరువాత మోపిదేవిలో ఒక దుర్ఘటన జరిగింది. పిల్లవాళ్ళు ఏదో దెబ్బలాడితే నాళ్ళ వాళ్ళు వచ్చి దెబ్బలాటతీర్చి రాజీ కుదురుద్దామని ఒక యింట్లో కూర్చుంటే ఒక రాడీమూక, ఒక పార్టీకి చెందిన రాడీమూక, ఇంట్లో ప్రవేశించి ఆ యింట్లో కూర్చున్న పెద్దమనుష్యులను చాలా దెబ్బలు కొట్టారు. దాదాపు అందరికీ కాళ్ళు, తల, చేతులు విరిగాయి. ఒకనికి compound fracture కూడా అయింది. కొందరికి పళ్ళు విరిగినాయి, మరికొందరకు తలలుబద్దలైనాయి. ఒక్కొక్కరిపైన 22 దెబ్బలు కొట్టబడి ఉన్నాయి. నేను వారినందరిని ఆస్పత్రికి పోయి చూచాను. వారిలో ఒకరైతు ఉన్నాడు.. ఏ రాజకీయ పార్టీకి చెందిన వ్యక్తికాదు. పిల్లవాళ్ళు దెబ్బలాడితే, వారికి రాజీకుదర్చడానికి వెళ్ళిన పెద్దమనుష్యులను ఒక్కొక్కరిని 22 దెబ్బలు కాళ్ళమీద చేతుల మీద కొట్టారు. వారికి కాళ్ళు విరిగినాయి, చేతులు విరిగినాయి, తలలు పగిలినాయి, compound fracture కూడా అయింది.

**Sri K. Rajagopala Rao**:—Point of order, Sir! ఈ కేసు విచారణ జరుగుతున్నది. Deputy Chief Minister గారు ఇక్కడ దీనిని

3rd November 1954] [Sri K. Rajagopala Rao]

గురించి ఇవన్నీ చెప్పడంవల్ల Sub judice క్రిందకు వస్తుందేమోనని తమ దృష్టికి తీసుకు వస్తున్నాను.

Sri G. Nagabhushanam :—Sir, he is speaking on the merits of the case.

The Hon. Sri N. Sanjeeva Reddi —మోపిదేవి విషయం చెప్తుతూ, నేను అక్కడికి సాక్ష్యం చెప్పించడానికి పోయానని వాళ్ళు చెప్పక పోతే అసలు ఈవిషయాలను చెప్పి ఉండను. అసలు ఈవిషయాలన్నీ మరచేపోయాను. ఇవి చాలా వున్నాయి. అవన్నీ చెప్పాలనుకొన్నట్లైతే చాలా చరిత్రవుంది. నాదగ్గరకు దాన్నిగురించి ఒక రిపోర్టు వచ్చిఉన్నది. వారు చేసిన ఘోరకృత్యాలు, రాక్షస కృత్యాలు అన్నీకూడా వివరంగా ఆరిపోర్టులో ఉన్నాయి. అవన్నీ చెపుదామనుకున్నాను. కాని చెప్పాలంటే చాలా ఉన్నాయి. కాని వారు మోపిదేవిని గురించి చెప్తూ ఆ విషయాన్ని వారే లేవదీసి ఎవరిచేతనో సాక్ష్యం చెప్పించడానికి అక్కడ నేను భోజనం చేశానని అంటూంటే, నేను ఈమాత్రం సమాధానం చెప్పకపోతే, వారు చెప్పిన విషయాలన్నీ unchallenged గా పోవాలని చెప్పి ఇక్కడ అవి చెప్పకూడదంటున్నారు. కాబట్టి నేను ఆ విషయం గురించిచెప్తున్నాను. నేను దెబ్బలు తగిలినవారందరిని ఆస్పత్రిలో చూచాను. అలాగ వారికి దెబ్బలు తగిలాయని, ఎవరో కొట్టారని చెప్పాను. వారు కొట్టారని చెప్పడం లేదుగా. ఆయన కొట్టారు, ఈయన కొట్టారు అని నేను చెప్పడంలేదుగా? ఆ కేసులో యిరికినవాళ్లు కొట్టారు, ఫలానావాళ్లు కొట్టారు అని నేను చెప్పడంలేదుగా. జరిగిన సంఘటనమాత్రం చెప్తున్నాను, దెబ్బలు తగిలిన వారినందరినీ ఆస్పత్రికి వెళ్లి చూచాను. అంతమందికీ కాళ్లు, చేతులు, విరిగినాయి. నేను కూర్చుని చూచాను. డాక్టర్లతో మాట్లాడాను. వారిలో ఒకరు 50, 60 ఏళ్ళవాడు. చిన్నవాడుకాడు, ఎక్కడనో అల్లరిచేసే వాడుకాడు. ఆయనకు దవడ ఊడిపోయింది. మోకాళ్లు విరిగిపోయాయి. వాళ్ళను అందరిని ఆస్పత్రిలో చూచాను. వాళ్ళను వాళ్ళ యొక్క పిల్లలను, స్త్రీలను ఓదార్చడానికి పోయాను అక్కడికి. వాళ్ళంతా భయంతో ఉన్నారు. వాళ్ళందరూకూడా ఎక్కడికో చెదిరిపోతుంటే, ఇంతవరకు మీకు తగిన రక్షణ యివ్వలేకపోయినందుకు చాలా విచారిస్తున్నాను, ఇకమీదనైనా మీకు రక్షణ యిస్తాము, మీకు ఏమీ ఫరవా

3rd November 1954] [Sri N. Sanjeeva Reddi]

లేదు, మీరు సుఖంగా బ్రతుకవచ్చు అని చెప్పడానికి అక్కడికి పోయాను. ఈ సంఘటన జరిగి, కేసు బనాయించిన తరువాత 10, 15 రోజులకు అక్కడికి పోయాను. భయంలేకుండా సుఖంగా బ్రతుకవచ్చు, రక్షణ యిస్తామని హామీ యిచ్చి వచ్చాను. ప్రభుత్వం తరఫున మీకు రక్షణ యిస్తామని చెప్పివచ్చాను. నాకు సాక్ష్యం చెప్పించవలసిన అవసరంలేదని, మంత్రులపై సాక్ష్యం బనాయించవలసిన అవసరం ఏర్పడితే, వారు చెప్పిన లెక్కలప్రకారమే 46 కేసులు అనంతపురంలో పెడితే, 2 కేసులుతప్ప, మిగతా 44 కేసులు విడుదల అయినాయి అన్నారు. అది జరిగిఉండదు. అది నిజంకాదు.

An hon. Member from the opposition—చేతకాక.

The Hon. Sri N. Sanjeeva Reddi:—చేతనౌనో కాదో చూపిస్తాను, అవసరమైనపుడు. చేతకాక కాదు. ఇంతేకాదు 10 రూపాయల Land Revenue శిస్తు remission ను తగ్గించడంగురించి గూడా చాలా అవహేళనగా మాట్లాడారు. Noconfidence Motion వచ్చిన తరువాత ఇది మేము చేశామని; వారు బెదిరించిన బెదిరింపులకు మంత్రివర్గం పోతుందని లొంగి చేశామని అన్నారు. వాళ్లు ఎప్పుడు బెదరించనిది? వాళ్లు బెదిరించని దినం ఎప్పుడైనా ఉందా? ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత 53 వ అక్టోబరు ఒకటవ తేదీనుంచి, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ప్రారంభం అయినప్పటినుంచి వారుబెదిరించనిరోజు ఎప్పుడైన ఉందా? అయితే వీరు బెదిరించినందుకే మంచిపనులను చేయకూడదనుకుంటే ఎప్పుడో చెయకుండా ఉండేవాళ్లం. దినం చచ్చేవాణ్ణి గురించి ఏడ్చేవాడు ఎవడు? ఒకరోజు చస్తే ఎవడైనా ఏడువవచ్చు. ఒకదినం బెదిరించితే వాళ్ళకు జంకి చేశామంటే అది అప్పుడు సరసంగా ఉంది. ఇంతేకాని జంకి చేశామనిమాత్రం మీరు అనుకోకండి. ఈ ఆలోచన, మీరు వ్రాసిన వ్రాతలు చూచాము. ఈ న్యాయబుద్ధి అనేది ఈనాడు మాలో ఉండబట్టి మీరు ఎలాంటి పనులకు, అరాచకాలకు దిగుతున్నా మేము ముందుకుపోలేక న్యాయబుద్ధికి బాధపడి అలాంటివి చేయకూడదని, ఏ ఉద్యోగస్థుడికైనా సరే ఆ పని చేయుమని వారికి చెప్పకూడదని మేము సక్రమంగా జరుపుతూ శాంతిలో నడచిపోతుంటే, అది చేతకానితనము అనవచ్చు. ఇపుడున్న పరిస్థితులలో వారికి కనపడుతుంటుంది, అది చేతకానితనమని. వారు చేస్తున్న దౌర్జన్యాలు

అన్నీ చూస్తూ ఉన్నాము. వారు ఏదైనా చేసినపుడు ఈవిధంగా చేస్తామని ఉద్యోగస్థులు చెప్పినా "వద్దు. ఇపుడు మీరు నిదానించండి" అని వారికి మేము సలహాలు ఇస్తున్నాము. అది చేతకానితనంగా వారికి కన్పించవచ్చు. కాని చేతకానితనంకాదని చెప్తున్నాను. మంచితనాన్ని చేతకానితనంగా భావించవద్దని మిత్రులైన శాసనసభ్యులకు తెలియజేస్తున్నాను. ఎప్పుడో Assembly కి వస్తాము అంతే. అది జరిగిపోతుంది. వారు అంతా democracy అంటూ చెప్పే ఉపన్యాసా లన్నింటిని వింటున్నాము. వీరి బెదిరింపులకు జంకి చేశామనటం, ఈ బెదిరింపులకు జంకి, పరుగెడుతున్నారు అని అనుకుకోవడం పొరపాటు. October ఒకటవ తేదీనాడు ఆంధ్రరాష్ట్రం వచ్చినదినమని, ఆ జ్ఞాపకార్థం ఇది చేయాలి అనే ఉత్తమ భావంతో దీనిని చేయగలిగాము. అంతటి ఉత్తమభావాలు వీరికి అర్థం అయితేగా!

వారికి కావలసింది ప్రచారం. వారికి కావలసిందల్లా డబ్బాలు వాయించుకోవడం. ప్రభుత్వం చేసినదంతా మేమే చేశాం అని, మా ఒత్తిడి వల్లే చేశారని చెప్పుకోవడం తప్పితే వాళ్ళకు కలల్లోకూడా తెలియదు అలాంటిది జరుగుతుందని. బంజరుభూములను మేము యివ్వాలని ప్రయత్నం చేస్తుంటే అది తమ లెక్కలో జమకట్టుకున్నారు. ఇంకా ఏదో remission ఇప్పిస్తాం అంటే అదికూడా వాళ్ళ లెక్కల్లోనే జమకట్టుకుంటున్నారు. ప్రభుత్వం ఏపని చేసినా తమ ఖాతాలోనే జమకట్టుకుంటూంటే, ఇది బాగాలేదని అనుకుని వీళ్ళకు ఏమీ తెలియకుండా చేద్దాం అనుకొని చేస్తే అదికూడా వీళ్ళ ఖాతానే జమకట్టుకుంటున్నారు. రాత్రి Cabinet లో అనుకున్నాం. పంతులుగారే చేయగలరు ఇటువంటి కార్యక్రమం. ప్రకాశం పంతులుగారి Cabinet ఒకటే చేయకలిగింది ఈ పనిని. ఇటువంటి కార్యక్రమాన్ని ఒక్క ప్రకాశంగారే సాహసించగలరు. ఏ రాష్ట్రంలోను చేయకముందే సాహసించి ఈ కార్యక్రమాన్ని మేము చేయాలని అనుకున్నాం. పేదవాళ్ళకు పన్నులేకుండా చేయాలని అనుకున్నాం. ప్రకాశంపంతులుగారు ఈ కార్యక్రమం చేసితీరాలని అన్నారు. ఇది ఉపన్యాసంకాదు. ఉపన్యాసాలు అటువైపు వాళ్ళవే. Revolutionary reform ను ఒక్క మాటవల్ల మేము చేయకలిగాం. ఆ credit కూడా మమ్మల్ని పుచ్చుకోనివ్వకుండా ఏదో భయపడి జంకి చేశారు అని అంటున్నారు. విజయనగరం రాజాగారు ఇంకోరకంగా

ముందుకు పోయినారు. ఇది తీసేసి sales-tax వేశారని ఎవరికో బాధ పడుతున్నారని అన్నారు. ఎవర్నూ ఇవ్వకపోతే ఏమిచేయాలి? మహా ప్రభువులు ఎవళ్ళయినా ఉంటే కొన్ని లక్షలు ఇస్తే ఈ నష్టాన్ని పూడ్చు కుంటాం. రోడ్లుకావాలి, హాస్పిటల్స్ కావాలి, ప్రాజెక్టులు కావాలి అన్నీ కావాలి. ఎట్లా చేయగలం? ఇది కష్టం. అందుచేత sales-tax వేయ వలసి వచ్చింది. Sales-tax కన్నా ముఖ్యమైనది పేదవాళ్ళకు పన్ను తగ్గించాము. 150 రూపాయలకుపైన భూమిశిస్తు ఉన్నవాళ్ళకు పన్ను ఎక్కించాము. దీన్ని ఎవరైనా సరే హర్షించక తప్పదు. క్రిందివాళ్ళకు భారం తగ్గు, పైవాళ్ళకు భారం కొద్దిగా హెచ్చి తీరాలి. మద్రాసు ప్రభుత్వంలో బస్సువాళ్ళకు వేసినటువంటి పన్నులను మేము తగ్గించలేదని నాగిరెడ్డిగారు ఆక్షేపిస్తున్నారు. బస్సులవాళ్ళ దగ్గరనుంచి అయినా నాలుగు డబ్బులు తీసుకొనకపోతే, వాళ్లు ఇచ్చే పన్నులుఅయినా తీసుకోకపోతే, ఈ రథం ఎట్లా నడపాలి? ఎందుకు వచ్చింది. ఈ బస్సులవాళ్ళమీద వీరికి ఇంత ప్రేమ?

An hon. Member :—Passengers మీద.

The Hon. Sri N. Sanjeeva Reddi :— Passengers కావచ్చు. Sales-tax వేసినప్పుడు, sales-tax ప్రతి ఒక్క రూపాయికీ 3 పైసలు ఉంది. దాన్ని 4 పైసలు చేయాలని అనుకున్నాం. పేదవాళ్లను గురించి బాధపడుతున్నట్లు Raja of Vizianagaram చెప్పారు. Economics గురించి నేను అంత చదువుకొన్న వాడినికాను. వారు social economics, democratic economics గురించి ఏదో చెప్పారు. నేను అంత చదువుకొన్నవాడిని కాదు. నాకు English బాగా రాదు. అందుచేత వారి economics బాగా అర్థంకాలేదు. కాని చివరకు ఈ sales-tax అంతా పేదవాళ్ళమీద పడుతున్నట్లు చెప్పారు. అప్పుడు అర్థం అయింది నాకు వారి economics. ఎట్లా పడుతుంది పేదవాళ్ళ మీద? పెద్దగా వేల రూపాయలు ఖర్చుపెట్టేవాళ్లు వేల దమ్మిడీలు ఇస్తే, పదో పాతికో ఖర్చుపెట్టేవాళ్లు, పల్లెటూళ్లలో ఉండే ఉప్పు, మిరపకాయలలో కొనుక్కునేవాళ్లమీద ఎట్లా పడుతుందని అడుగుతున్నాను.

[Sri N. Sanjeeva Reddi] [3rd November 1954

వారికి కొద్దిగా పడుతుంది. రెండు పైసలో, మూడు పైసలో వారికి పడుతుంది. కోట్లకోలది రూపాయలు ఖర్చుపెట్టి విమానాలు చేస్తుండే పట్నవాసాల్లో ఉండే నీలాటివాళ్లు నాలాటివాళ్లు, వందల రూపాయలు tax ఇస్తే పల్లెలో ఉండే పేదవాడు ఉప్పు, మిరపకాయలు, నిత్యావసరానికి కావలసివచ్చే గుడ్డ మొదలైనవి ఏమైనా కొంటే కొద్దిగా పన్ను ఇస్తాడు. వాడు పేదవాడని నువ్వు నేను ఒప్పుకుంటే వాడి పేదతనానికి తగినట్లు పన్ను ఇస్తాడు. పుల్లారెడ్డిగారు లాంటివాడు, ఆయన పేదవాడో ధనవంతుడో నాకు తెలియదు కాని, ఆయన పెట్టే ఖర్చు వందలలో పెడతాడు కాబట్టి ఆయన వందలలో దమ్మిడీలు ఇస్తాడు. ఈ రకంగా distribute అయ్యే tax ఏదైనా ప్రపంచంలో ఉందీ అంటే అది ఒక్క sales-tax మాత్రమే. ధనవంతులకు, పేదవాళ్లకు కొద్దికొద్దిగా ఎవరి హోదాకు తగ్గట్లు వాళ్లకు పడుతున్న tax. దాన్ని హెచ్చించి నష్టాన్ని పుచ్చుకోడానికి ప్రయత్నిస్తే, నష్టం అంతా కాదు, నష్టంలో సగం పూడ్చుకుందాం అని ప్రయత్నం చేస్తే, దాన్ని కూడా విమర్శిస్తున్నారు. చేసిన ప్రతి పనినీ కూడా విమర్శించడమే. కోడలు చేస్తే, అత్తగారు విమర్శించినట్లుగా ప్రతి పనిని విమర్శించడమే తప్ప చేసిన దానికి హర్షించడమనేది కన్పించదే. కాని ఇంతమంది మాట్లాడారు. కాంగ్రెసువారు, నా మిత్రులు, ఇతర బలపరచేవారి అభినందనలను అందుకుంటున్నా opposition party లో నుంచి చక్కగా, న్యాయంగా మాట్లాడినవ్యక్తి ఒక్కరు కనిపించారు నాకు. వారిని నేను అభినందించక తప్పదు. వారు G. C. Kondayya గారు. వారు ఇంతవరకూ నాకు ఎప్పుడూ కూడా ఓటు ఇవ్వలేదు. కాని న్యాయంగా మాట్లాడారు. వారి ఓటు కావాలని కాదు నేను చెప్పుతున్నది. ఓటు వస్తుందని కాదు. ఓటు ఇవ్వాలని నేను కోరలేదు. ఇంతవరకూ వారిని అడగలేదు. ఎప్పుడూ కూడా అడగను. ప్రతిపక్షంలోనే ఉండనియ్యిగాక. కాని న్యాయబుద్ధి ఉందని నిరూపించుకొన్న మనిషి. చేసిన పనికి హర్షించారు. ఆక్షేపించాడు చేయలేని వాటికి, ఏదైనా పొరపాటు చేసిన వాటికి. చాలా చక్కని ఉపన్యాసం ఇచ్చి ఒక్క చిన్న విషయంలో బాధ కలిగినట్లు చేశారు. సంకోండ తుంగభద్ర high level channel [illegible] మాట్లాడారు. Thungabhadra high level channel వద్దు

నందికొండ ఒకటే కట్టించి ఊరుకోండి అంటే కూడా వారిని అభినందించ వచ్చు. నాకేమీ ఆక్షేపణ లేదు. వారి భావం వారు వ్యక్తం చేయవచ్చు. వారు నెల్లూరులో ఉండి ఆ ప్రాంతాన్ని చూస్తుంటారు కాబట్టి నందికొండే కావాలని అడగడంలో తప్పేమీ లేదు, మరో ప్రాంతం తాలూకాలూ, జిల్లాలూ వారికి కనపడవు కాబట్టి. కాని దీనికి ఒక రంగు ఇచ్చి, రెడ్డి, కమ్మ ప్రాజెక్టని చెప్పినప్పుడు చాలా విచారం కలిగింది. ఎవరో బజారులో అమాయకపు ప్రజలు ఏమైనా మాట్లాడితే మాట్లాడుకోవచ్చు. కాని జవాబుదారీగల శాసనసభ్యులము మనం దేశాన్ని, ప్రాజెక్టులను, వస్తువులను కూడా పంచ మొదలుపెడితే దేశం ఏమౌతుంది? నెల్లూరులో అంతా కమ్మవాళ్లేనా? లేక ఈ ఉరవకొండ, తాడిపత్రిలలో అంతా కమ్మవాళ్ళేనా? ఈ జిల్లాలో ఉన్న కనీసం కమ్యూనిస్టు సభ్యులను అడుగ మంటున్నాను. ఈ రాయలసీమ జిల్లాలలో ఎక్కడైనా కమ్మలు ఉంటూ ఉంటే ఆ ఉరవకొండ, తాడిపత్రి area లోనే ఉన్నారు. ఆ ప్రాంతంలో రెడ్లు ఎక్కువైనా ఉంటే వినుకొండ, పల్నాడు తాలూకాలలో ఉన్నారు. కాదని చెప్పగలరా కొండయ్యగారు? ఈ level కి మనం తీసుకు పోవడం మంచిదికాదు. లేదా నాకు high level cahnnel వద్దు, నేను నెల్లూరువాడిని కాబట్టి నాకు నందికొండ project ఒక్కటే కావాలని చెప్పండి సంతోషిస్తాను. లేదా రాయలసీమవాళ్లు ఎవరైనా నాసరే నందికొండ కాదు, high level channel కావాలని చెప్పండి, సంతోషిస్తాను. ప్రభుత్వం రాష్ట్రి శ్రేయస్సు చూడవలసిఉంది. కాబట్టి రాష్ట్రం మొత్తం మీద ఏయే ప్రాజెక్టులు తీసుకోవాలనేది ఆలోచిస్తున్న ప్రభుత్వానికి ఈ రకంగా చిన్న విషయాలను అంటకట్టినప్పుడు మనస్సు బాధపడింది. అయితే నాటికి తోంబై పాళ్లు వారు ఉపన్యాసాన్ని విమర్శించినా వారిని అభినందిస్తున్నాను, కొన్నింటిని వారు బలపరుస్తున్నందుకు.

Sri G. C. Kondayya:—Sir, on a point of personal explanation. I did not say that there was Kamma-Reddi feeling. I said that that feeling was in the society and asked how the Ministry was going to answer it.

The Hon. Sri N. Sanjeeva Reddi:—నేను అలా అనడం పొరపాటని ప్రత్యుత్తరం చెప్పాను అనుకుంటాను.

[Sri N. Sanjeeva Reddi] [3rd November 1954

ఇక్కడ ఎక్కువ కమ్మవాళ్లున్నారని high level cahnnel ఇక్కడ ప్రవహిస్తుందా? అది చెప్పడంకాదు ప్రజానీకానికి తెలియాలి. రాయల సీమలో ఎక్కడ కమ్మవాళ్లు ఉన్నారో అక్కడా రెడ్లు ఉన్నారు. ఇది అంతా ఏదో ఒక exclusive preserve కాదు. ఒక ప్రాజెక్టు ఉంటే అందరికి నీళ్లు పారుతాయి. High level channel కాని, నందికొండ ప్రాజెక్టుగాని కడితే అక్కడ ఉన్న రెడ్లకు, కమ్మలకు, బ్రాహ్మణులకు అందరికి నీళ్లు పారుతాయి కాని, రెడ్లకుగాను ప్రాజెక్టులు, రెడ్లకుగాను క్షామము, రెడ్లకుగాను వర్షము, కమ్మవాళ్లకు లేదు అంటే ఎక్కడైనా నిలుస్తాయా ఇవి ? ఆ రకంగా ఎవరైనా అంటే ప్రవాహాలలో కొట్టుకు పోతారు. అలా ఎవరైనా అన్నారని మీరు అంటే దానికి మేము విచారం వెలిబుచ్చుతూ, అది పొరపాటని వారికి నచ్చచెప్పడానికి ప్రయత్నం చేస్తాం.

తరువాత P. S. P. నాయకుడు మాట్లాడినారు. Congress Resolution ను మీరు అమలుపరుస్తే చాలన్నారు. ఎందుకా యింత ప్రేమ వీరికి Congress సంస్థపైన యిప్పుడిప్పుడే అని, నాకు ఆశ్చర్యం కలిగించి అది నాకు చాలా సంతోషము అవుతోంది. నేను వారిని కోరేది యేమిటంటే, "మీరు P. S. P. Resolution ను మాత్రం అమలుపర్చండి మహాశయా" అని Prohibition ను గురించి P. S. P. యేమి resolution చేసిందో కొంచెం జ్ఞాపకము వుంచు కోండి అని మాత్రం వారికి చెబుతున్నాను. మేము Congress తీర్మానాలను పాటిస్తాము, అమలుపరుస్తాము. Congress తీర్మానాలను పాటించాలని సర్వ విధాలా ప్రయత్నం చేస్తున్నాము. అమలుపర్చడానికి కృషిచేస్తున్నాము. Fail అవుతే, మేము miserable గా fail అయ్యాం అనిఅంటాం, చెపుతాం. All India Party, Prohibition కావాలంటూ వుంది. తీర్మానం pass చేశాము. P. S. P. వారి 18 ఓట్లతో యేర్పడిన మంత్రి వర్గం Travancore లో వుంటే, Congress తుమ్ముతే పడిపోయే ministry, prohibition కావాలని అంటూఉండిరి. అక్కడ మీ నీతియేమి? Programme యేమి? మాకు అర్థం కాకుండావుందే. మీరాజ కీయాలు మొదలునుంచీ కొనవరకు ఇలానే ఉన్నాయి. యీ one year లో

యిది యేమిచేసిందో అర్థంకాదు. కాబట్టి, మా మీరు "కాంగ్రెసు తీర్మానాలను అమలుపర్చండి" అని సలహా యిచ్చేముందు...(interruption)

Sri P. V. R Gajapathi Raju —Mr Speaker, the Hon. Sri N Sanjeeva Reddi is anticipating a situation that is to occur three days from today. I do not want to enter into the debate of the noconfidence motion But, as he seems to have dragged that issue here in discussing the Praja Socialist Party's attitude towards the possible noconfidence motion, I would like one point to be undrestood by him. He has done it by implication when he criticized Mr. M. Ventakasubba Reddi So far as the Praja-Socialist Party and Prohibition are concerned, there is no ambiguous position· Even if you go into our speeches in March or even in May, I had always said that if it was a question of enforcing Prohibition we were always with the Government. But, having decided to forego it, we cannot understand how they can dilute it with neera. That was our stand essenially. Today the problem is not Prohibition, but democratic institutions. Even the resolution of the Praja-Socialist Party says that we support the noconfidence motion because the Assembly resolution is not being implemented. That is our stand.

The Hon Sri N. Sanjeeva Reddi :— Thank you, Sir, ఈ అభిప్రాయాన్ని వారు noconfidence motion చర్చకు వచ్చే ముందు వెల్లడించి వుండవచ్చు. అది కొంచెముతొందరగా, ముందుగానే చెప్పారు. ఆ ప్రొద్దు యేదో మాట్లాడుకొందాము.

మధ్యలో శ్రీ పి. పుండరీకాక్షాచార్యులుగారు వుపన్యాసము యిచ్చారు. శ్రీ లచ్చన్నగారు వుపన్యాసము గురించి నేను ఆత్రుతగా యెదురుచూస్తూ వుంటిని. ఎందుకంటే, వారు చాలా ఘాటుగా మాట్లాడుతారని ప్రతీతి. వారి భావ ఘాటు - భావం ఘాటు, అంతా ఘాటుగానే వుంటుంది. కాని శ్రీ లచ్చన్నగారు కొంచెము reasonable గా మాట్లాడారేమోకాని, శ్రీ పుండరీకాక్షాచార్యులుగారు ఆ ఘాటుతనం అంతా పుచ్చుకున్నారు, వారి ప్రక్కన కూర్చోవటంవల్ల. అది అట్లా కొంచెము వారిలో ప్రవేశించినది. Foundation stones అన్నీ వేసి

అన్నిచోట్లకు Police కాపలా పెట్టుతున్నారు. Police Minister శ్రీ సంజీవ రెడ్డిగారు కాంగ్రెస్ వాళ్లకు కాపలాగా పెట్టుతున్నారు. వారు, యెప్పుడైనా M. L. A. అయినతరువాత, ఆ తాలూకాలలో తిరుగుతే ఆ రాళ్ళగతి ఏమైనదో చూచి, అక్కడ engineers వున్నారా? పని జరుగుచున్నదా? అని విచారిస్తే, విషయం తెలుస్తుంది. M. L. A. అవుతూనే ఆదేశం సంగతి మరచిపోయారు. మరి యెట్లా తెలుస్తుంది? వారు రాళ్ళదగ్గరకు యెప్పుడూ పోలేదు. అక్కడ ఏమైనా జరుగుచున్నదా? లేదా? అని తెలుసుకోవలసిన అవసరం వారికి లేదు. పోవలసినవారు ఆ ప్రజలే. ప్రజలకే వదలిపెట్టి (interruption)

**Sri P. Pundarikakshacharyulu** :—నియోజకవర్గంలో యెక్కువగా తిరుగుతున్నాం కాబట్టే 1944 వ సంవత్సరములో వేసిన రాయి గురించి, Rajam High School ను గురించి, తమకు యెఱుకకూడా చేశాము.

**The Hon. Sri N. Sanjeeva Reddi** :—ఎప్పుడో వేసిన ప్రాత రాయిని గురించి యెందుకు? క్రొత్తరాయిని గురించి మాట్లాడుదాము. ఇప్పుడు 17 రాళ్ళనుగురించి వారు చెప్పేది నేను వొప్పుకొంటాను. పునాది రాయి వేయడానికి భయమెందుకు? నేను రామయ్య చౌదరిగారి వూరికి, వారి constituency కి పోయేటప్పటికి అక్కడ అప్పుడే పునాదులు త్రవ్వారు. నదిపొడుగునా త్రవ్వేశారు. పని 'జరుగుతోంది. వేలకొలది రూపాయలు ఖర్చు అవుతున్నాయి. రాళ్లువేసిన తరువాత పనియేమీ జరగలేదు. పోనీ, వారు పత్రికలు చూచినా బాగుండేది. పనిమాత్రం జరగటంలేదు. పని జరిగిపోతోంది. ఈ project కు డబ్బులేదు, పని జరగటంలేదు, budget లో కేటాయించలేదు అని వ్యాఖ్యానించారు. ఈ సంగతి లచ్చన్నగారు కూడా అడిగినారు. వారు కొంతకాలం మంత్రిగా వున్నారు. వారికైనా తెలిసివుండవలసిందే. Five crores sanction లేదు separate గా ఆయా projects కు గాను amount వచ్చింది.

3rd November 1954] [Sri N. Sanjeeva Reddi]

First five year plan లో medium schemes కు గాను కొంచెము డబ్బు యిచ్చారు. పోతే, రు. 5 కోట్లు యిస్తామన్నారు. రు. 5 కోట్లు చాలదు మాకు అని చెప్పాము. 28 projects కు proposals పంపాము. రు. 10 కోట్లకు పైన విలువైనవి యీ ప్రాజెక్టులు. వాటిలో కొన్నిటిని వారే కొట్టివేశారు. కొట్టివేసి, రు. 10 కోట్లు యివ్వలేము, రు. 5 కోట్లు యిస్తాము, పుచ్చుకోండని చెప్పి, వారు చెప్పారు. అలాగని communication వచ్చింది. ఇంకా budget లో లెక్కలు ఆలోచించక ముందే పని ప్రారంభించాము. కొన్ని projects ప్రారంభించాక, పని చురుకుగా జరిగిపోతోంది. మేము యిప్పుడూ హామీ యిస్తాం. రెండు ఏళ్ళకు పూర్వమే projects నుంచి నీళ్ళువిడుస్తామని హామీ యిస్తాం. ఎంత ప్రొద్దు అయినాసరే projects కు రాళ్ళువేయటం మాకు సంతోషమే. ఆరాళ్లను యేదో చూస్తూ కూర్చుంటామనికాదు. నేను మంత్రిగావున్న రోజులలో, ప్రకాశంగారి ప్రభుత్వములో యీ కార్యక్రమాలు సాధించామనే తృప్తి వుండాలని మా వుద్దేశ్యము. రాళ్లువేస్తే మీ కేకాదు, మాకు గూడా తృప్తిలేదు. కాబట్టి budget లో schemes లేవనికాదు. ఈ budget లెక్కలు చూచుకొంటూ కూర్చుంటే, మనం యేపనీ చేయలేము. Budget నిదానంగా చూచుకొందాము. Finance Department లెక్కలు వేసుకొంటుంది. డబ్బు వుంది. 5 కోట్ల రూపాయలు చేతిలో వున్నాయి అనుకొని కార్యక్రమం సాగించాము. ఈ లెక్కలు, ఈ budget లో plus లు minus లు నిదానంగా చూచుకొందాము. Secretariat వున్నది. ఆ Secretariat లో యీ లెక్కలు, గిక్కలు అన్నీ తయారైయ్యేవరకు వుంటే, యీ first five-years దాటిపోతాయి. కాబట్టి, మేము యేదో డబ్బులేకుండా ప్రారంభించలేదు. లేదా ప్రారంభించి, అక్కడ పునాదిరాళ్లు వూరకనే పెట్టలేదు. Engineers ను post చేశాము. ఈ పనులన్నీ జరుగుతున్నాయి. లచ్చన్నగారి జిల్లాలో ఒక కోటి రూపాయలు విలువైన 4 projects ప్రారంభించాము. వారు వెంటనే పోతూనే యీ మాజీ కల్లుగీతవాళ్ళ విషయం కొన్నాళ్లు మాను కొని, ప్రాజెక్టుల దగ్గరకుపోయి రమ్మనమని నేను వారిని ప్రార్థిస్తున్నాను.

[Sri N. Sanjeeva Reddi] [3rd November 1954

వారు ఆ కార్యక్రమాలన్నీ చూచినప్పుడు, అప్పుడు ఆక్షేపించమనండి. వారు చూచినప్పుడు ఆక్షేపిస్తే, నేను ఒప్పుకుంటాను. అప్పుడు గనుక ఆ [illegible] ప్రాంతానికే రాష్ట్రమాత్రం వున్నవి అని అంటే నేను ఒప్పుకుంటాను, కాని అసలు మోసం. ఇట్లా యెవరిని మోసపుచ్చుతారు? ప్రజలు చూశారు. ప్రజలు మీ మనుష్యులు కారు. ప్రజలలో majority భాగం మా వాళ్ళు. వారు మా ప్రక్కన వున్నారు. ప్రజలని మోసపుచ్చాముని ప్రజలు, ప్రజలు అని పేరు చెప్పుకుంటారు, కాని ఆ పాత చరిత్రఅంతా పోయింది. (Loud cheers and applause) ఆ రోజులు పోయాయి. ఇప్పుడు ప్రజలు చూవాళ్లు. ప్రజలను మోసపుచ్చగలరా?

నెల్లూరుజిల్లాలో project వేశామంటే, నెల్లూరుజిల్లా ప్రజానీకం అడగదూ మమ్మలను? చిత్తూరుజిల్లాలో project వేశామంటే, చిత్తూరు జిల్లా ప్రజానీకం మమ్మల్ని అడగదూ? శ్రీకాకుళం జిల్లాలోనివారైనా వాళ్ళూ మనుష్యులే. అక్కడ ప్రజానీకం వున్నది. వారంతా మా ప్రజానీకమే. కాంగ్రెసు ప్రభుత్వమును బలపరచే ప్రజానీకము వున్నది. ఆ ప్రజానీకముకొరకు, అందరి శ్రేయస్సుకొరకు అన్నిపార్టీల శ్రేయస్సుకొరకు projects నిర్మించబడుతున్నాయి. మేము గెల్చిన జిల్లాలోనేకాదు యీ project ను వేస్తున్నది. Congress వారు గెలిచినచోట్లేకాదు, మేము గెల్చిన స్థలాలలోనేకాదు ప్రాజెక్టులను నిర్మిస్తున్నది. ప్రాజెక్టులు వేసిన తాలూకాలు తీసుకుంటే, వారికి నిజస్థితి తెలుస్తుంది. శ్రీ కిల్లి అప్పల నాయుడుగారి తాలూకాలోనే, వారి అధ్యక్షతక్రింద, ఆనాడు ఒక బ్రహ్మాండమైన సభపెట్టి, ఆ సభలో మేము project వేస్తామని హామీ యిచ్చాము. రెండు నెలలోనే ఆ project కు పునాదిరాయి వేశాము. అక్కడ అపని జరుగుతోంది. Engineers కూడా అక్కడనే వున్నారు. 40 లేల రూపాయల project అది. కాబట్టి, ఇది యేదో వేస్తున్నాం అంటే, పూరికే ప్రజలను తృప్తిపరచడానికి వేస్తున్నాం అనుకోకండి. మిమ్ములను చెప్పుతూ తృప్తిపరచలేము, తృప్తిపరచడానికి ప్రయత్నం చేయం. ప్రజానీకాన్ని దృష్టిలో వుంచుకొన్నాం. ప్రజానీకం మాది. ప్రజానీకానికి సేవచేశాము ముప్పది యేళ్లు. మేము ప్రజానీకానికి కార్యక్రమం సూచించి, పాటుబడి చూపించాము. ఉపన్యాసాలు అంతా చేస్తున్నవాళ్ళు మీారు. ఉపన్యాసాలతో, ప్రతివాడినీ ధనవంతునిగాచేసి, అందరిని భూస్వాములుగా

చేసి, బంగారం పండిస్తామని చెప్పింది మీరు. మేము యీ project ను ప్రారంభించాము. ఇంకా అనుకొన్నంత చేయలేదు. 'High level channel' చేయలేదని శ్రీ హనుమంతరావుగారన్నారు. ప్రతి శాసన సభ్యుడూ, ముఖ్యంగా శ్రీ నాగిరెడ్డిగారు గొడవా చేస్తున్నారు. వారు high level channel కట్టడానికి యేమి సలహా యిస్తారో అని చూస్తూ వుంటిని. మరి నా సలహావున్నది. అందరికీ, చెప్తున్నాను. ప్రపంచానికి చెప్తున్నాను. నాకు నందికొండ కావాలి, high level channel కావాలి.

వంశధార ప్రాజెక్టు యిప్పుడు వెంటనే రాదని తెలుసును నాకు. ఎందుకంటే, స్థలనిర్ణయంలో తగాదాలు వచ్చాయి. అప్పుడే ఆ జిల్లాలో ఇంకా యీ State లోనేకాక, Orissa లోకూడా కొంత మునిగిపోతుంది. ఒరిస్సావాళ్ళు వొప్పుకొననిదే, యిప్పుడు ఆ పనిని ప్రారంభించలేము. ఒకచోట యీ project కడితే కొన్నివేల యెకరాలు మునిగిపోతుంది. Project మాత్రం మన area లోనే వుంది. ఇంకొక చోట కడితే, కొన్నివేల యెకరాలు మునిగిపోతుంది. ఒరిస్సాలో పట్నాలు, పల్లెలు మునిగిపోతాయి. కాబట్టి మనం వెంటనే యీ project ను కట్టడానికి వీలులేదు. వాటిని ముడిపెడితే, యిది యిప్పుడు అయ్యే కార్యం కాదు. కాబట్టి మొన్న...సంజీవరెడ్డి ఒక్కడే P. W. D. Minister గా అదంతా కుంభకోణం, తకరారాలు చేస్తున్నాడనేది కాదు. Cabinet వారంతా ఆలోచించి, శ్రీ పంతులుగారు దీర్ఘంగా ఆలోచించి చేసినదే యిది. ఈ రెండూ కావాలి. అదికూడా పూర్తిచేయవలసిందే. క్రొత్త, ప్రాత ప్రాజెక్టులు ఒకటిగా వున్నవి. High level channel నాకు తెలుసు. అది ఒక project లో ఒక భాగం. 175 అడుగుల యెత్తున వున్నటువంటి project. సముద్రంమాదిరి నీళ్ళు వచ్చాయి. ఆ పైని నీళ్ళు పారుతున్నాయి. ఈ మధ్య Dr. Katju గారు వచ్చినపుడు అక్కడికి నేను పోయాను. అంతకుపూర్వం నేను యెప్పుడూ పోలేదు. ఆరోజున అప్పటికప్పుడే నీళ్ళు తోణుకుతున్నాయి. నీళ్ళు తోణికిపోతూంటే, నేను రెండు గంటలకంటె యెక్కువకాలం నేను వుండలేకపోయాను. అక్కడ నిల్చుంటే నీళ్లు తోణుకుతున్నాయి. స్లూయిస్లు వున్నాయి. కాలువలు లేవు. ఏ రైతు అయినా అక్కడకు పోతే, హృదయం మండిపోతుంది వాడికి. కల్లుదాపే వరకు, కల్లు త్రాగినవాడు డబ్బు యిచ్చేవరకూ, మేము కాలువ త్రవ్వము అంటే దేశంలో యే రైతు నాగిరెడ్డిగారిని హార్టి స్తారో చూస్తాను. 175

అంటమే ఆచారము. దయచేసి మీరు ఎవరి యింటికైనా పోయి చూడండి. తండ్రిని కొడుకు, నువ్వు అని పిలుస్తాడు. నాకు అనంతపురంలో ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీలో ఒక మిత్రుడు ఉండేవాడు. ఆయనకు చిన్నపిల్లలు వుండేవారు ముద్దుగా. వాళ్లతో ఆడుకొంటూ వుండేవాళ్లము. ఆ పిల్లలు వాళ్ల నాన్నగారితో మాట్లాడుతూ నాన్నగారూ కె భాయిగారి దగ్గర బీడీ గారు పడ్డారు అని అంటారు. వారు అన్నింటికి గారు అని చేరుస్తారు. ఇక్కడవారు నువ్వు అని అంటారు. నేను ఎవరినికూడా అగౌరవపరచాలనే దుర్దేశ్యంతోగాని ఇంకొక రకముగాగాని మాట్లాడలేదని చెబుతున్నాను. వాళ్ల మాటలకూ మా మాటలకూ ఎంతో భేదమువుంది. కాబట్టి నేను చెప్పేది ఏమిటంటే, దీనికి రాజకీయ అభిప్రాయభేదాలు ఎలావున్నా సరే ఆ ప్రాజెక్టులకుమాత్రము నాకు సంపూర్ణమైన సహకారము ఇవ్వండి. ఇవి తప్పకుండా వస్తాయి అని నేను ఆశిస్తున్నాను. హైలెవల్ ఛానలు ఒక్కటే తేవాలనే దుర్భావము నాకు వున్నట్లయితే ఇప్పటికి అప్పుడే పని ప్రారంభించేవాడిని. ఈ హైలెవెల్ ఛానల్ ఎప్పుడో సాధించేవాడిని. సులభంగా మూడు నెలలో తీసుకొనివుండేవాడిని. నందికొండ కావాలి. 100 కోట్ల రూపాయలతో 40 లక్షల ఎకరాలు సాగయ్యే ప్రాజెక్టు నందికొండ ప్రాజక్టు. దీనికి పట్టుపట్టాను. ఇది కావాలి, అది వద్దు అని నాకులేదని చెబుతున్నాను. నందికొండ మాకు కావాలి. అక్కడా మా ప్రజలు వున్నారు. ఆ ప్రజానీకము మా వాళ్లు. అక్కడ క్షామప్రాంతము అయినటువంటి వినుకొండ తాలూకాలో మా ప్రజలు ఉన్నారు. కాబట్టి ఈ రెండు స్కీములు సాధించాలి. సాధించగలమనే విశ్వాసము నాకు వుంది. దానికి పార్టీతో సంబంధంలేదు. కల్లంగల్లుపెట్టి శుభ్రంగా కల్లుత్రాగండి అని చెప్పడానికి మేము సిద్ధంగాలేమని తెలిసికూడా నువ్వు ఆ కల్లునుపెట్టి త్రవ్వించమంటే వద్దనేగా? Open గా చెప్పు, హైలెవెల్ ఛానల్ తీసేయి, నందికొండ కట్టించమనిచెప్పు. నేను సహిస్తాను. నా నాయకత్వము నిలుపుకోడానికి చెప్పక తప్పదు అని చెప్పు. నేను ఆ విషయంలో ఏమీ ద్రోహము చేయలేదు.

[3rd November 1954

**Sri M. Hanumantha Rao.**—ఉపముఖ్యమంత్రిగారు నేను చెప్పినదానిని కొంచెము distort చేశారు అనుకొంటాను. ఎందుకు అంటే కమ్యూనిస్టుపార్టీ ఈ సాల్యూషను ఇచ్చినప్పుడు మేము అంగీకరించమని వారు అన్నారు. మనము కలసి సంభాషించుకొందామని చెప్పేశారు. కమ్యూనిస్టుపార్టీ ఈ ప్రాజక్టులను పూర్తిగా సపోర్టు చేసింది. పంచవర్ష ప్రణాళికలో చేర్చమని చెప్పేసి ఢిల్లీలో కోరింది. అయినా ప్రభుత్వానికి సాధించడము చేతకాలేదు. ఎందుకు అని అంటే, సరియైన పరిష్కార మార్గము సూచించలేదు అన్నారు. ఆంధ్ర ప్రభుత్వము దీనికి బాధ్యత వహించవలసి వున్నదని నా ఉద్దేశ్యము, నా విమర్శ.

**The Hon. Sri N. Sanjeeva Reddi:**—కల్లుత్రాగించి ప్రాజక్టులను కట్టించడం సరియైన మార్గముగా వారు దానిని భావిస్తున్నారు. అదే భావము అయితే దానిని మేము అంగీకరించలేమని మాత్రమే సవినయంగా విన్నవించుకొంటున్నాను. శ్రీ ప్రగడ కోటయ్యగారు చక్కగా మాట్లాడారు. 2, 3 నిర్మాణాత్మకమైన సలహాలు ఇచ్చారు. ఈ దినము సలహా యివ్వడంలో తుంగభద్ర డ్రైనేజి గురించి మాట్లాడారు. ఆలపాటి వెంకట్రామయ్యగారు, నాగేశ్వరరావుగారు మొదలైన గుంటూరుజిల్లా మిత్రులందరూ, ఈ విషయమై చెప్పారు. నేను P. W. D. కార్యదర్శిని, P. W. D. ఇరిగేషను ఛీఫ్ ఇంజనీరుని కలుసుకొని దానిని ఎట్లా చేయాలి, ఏమి చేయాలి అనేది ప్రయత్నము చేశాము. శాసనసభా సమావేశములు అయిన తరువాత, మద్రాసునుంచి వచ్చిన తరువాత, నేను అక్కడకు వస్తున్నానని చెప్పినాను. ఇంతలో ఇప్పుడు వరదలు వచ్చే అవకాశము లేదు. అయినా మనము వచ్చే సంవత్సరము లోపున, 10 నెలలు లోపల చేసుకోవలసిన కార్యక్రమము కొరకు నేను అక్కడకు వస్తాను. కార్యక్రమము సాధించుకొందాము. ఛీఫ్ ఇంజనీరుగారు కూడా వస్తాను అని చెప్పారు. కనిష్టమైనను కావలసిన సలహాలు ఇచ్చారు. ఆరకంగా కార్యక్రమాన్ని దృష్టిలో వుంచుకొని పనిచేయాలి. పని సాగించుకోవాలనే వుద్దే

3rd November 1954] [Sri N. Sanjeeva Reddi]

శ్యముతో చేసుకోవాలని చెప్పినందుకు మాత్రము వారిని అభినందిస్తున్నాను. శ్రీ కొల్లా వెంకయ్యగారు ఎవరో నేను 4 లక్షల ఎకరాలు ఎవరికో ఇచ్చారు వారిని మినహాయించాలని చెప్పారు. ఎవరు యిచ్చారో ఏమో. ఎప్పుడు అయినా మనకు లక్షల ఎకరాలు, వందల ఎకరాలు పూర్వము కౌలుకు యిచ్చారన్నది అహము. పెద్దవాళ్ళకు grow more food campaign కేవలముఆహారము పండించాలనే వుద్దేశ్యముతో పెద్ద డైరక్టరులు అవేవో పండించుకుంటామని చెప్పేవారికి, కొంత భూస్వాములుగా వున్నవారికి 300, 400 ఎకరాలు advisory ల కాలములో ఇవ్వడము నేను పూర్వము మినిష్టరుగావున్న రోజుల్లో నాకు instance వచ్చింది. ఈ కొండై కెనాల్‌లో కొన్ని వందల ఎకరాలు ఒక పెద్ద భూస్వామికి యిచ్చారు. అది ఎట్లా అయినా స్వాధీనపరచుకోవాలని ప్రయత్నము చేస్తున్నాము. లీజు అయిపోతోందని అయనకు నోటీసు యిచ్చాము. ఎన్నో యిబ్బందులువచ్చాయి. టెక్నికలు లెక్కల్లో ముఖ్యంగా, ఒకతూరి యిచ్చిన తరువాత దానిని వెంటనే మనము కాన్‌సిలు చేయడానికి పూనుకుంటే కాన్‌సిలు ఎందుకు అవసరమైందో పరీక్ష అవుతుంది. ఇప్పుడు అప్పుడు కూడా టెక్నికలుగానే వున్నాయి కొన్ని యిబ్బందులు. దానికి యింకా ఏమి చేయాలో ఏమిచేస్తే ఈ కంపెన్‌సేషను పోటీ లేకుండా స్వాధీనపరచడానికి వీలవుతోందో ఇవన్నీ మనము ఆలోచించాలి. లీజు అయిపోకుండా శాశ్వతముగా వుండేందుకు యిబ్బందులు ఏదైనా కలిగేట్టుగావుంటే మనము దానికి ఏదైనా లెజిస్లేషను చేయడానికి వీలవుతుందేమో దానిని గురించి కూడా ఆలోచన చేసుకోవచ్చు. ఇక గోవిందరావుగారు ఏదో పత్రిక చదివి ఈ ... నాకు ఒకటి యిచ్చారు. బ్రీడింగు బుల్సు, బ్రీడింగు కౌవ్స్ ఇన్ని అవి, ఇవి అని లెక్కలు చెప్పారు జ్ఞాపకములేదు. విశాలాంధ్రలో చూశాను. ఆంధ్ర పత్రికలో సంఖ్యలు యిచ్చారు. ఆంధ్ర పత్రికలో కూడా ఇవే సంఖ్యలు చెప్పారు. నేను చెబుతాను యీ మధ్య 24 వ తేదీన విశాలాంధ్ర చూశాను. రెగ్యులరుగా దిని నేను చదువుతాను వీలువుంటే. తప్పకుండా విశాలాంధ్ర చూస్తాను.

[Sri N. Sanjeeva Reddi] [3rd November 1954

[illegible] పెద్ద పెద్ద హెడ్డింగులతో, బొమ్మలువేసే పత్రిక చూస్తే నాకు చాలా ఆనందము. పిట్ట కార్టూనులు మొదలగునవి అన్నీ వేస్తారు. అవి తప్పు [illegible] వేస్తారు, ఇలాంటివి చూస్తే సరదాగా వుంటుంది. ఫిల్ము చూస్తేను నాకు చాలా సరదా. మొన్న విశాలాంధ్ర చూశాను. అనంతపురమునుంచి అయినగోట్ల పద్మావతి అనే ఆయన కమ్యూనిస్టు పార్టీకి గొప్ప నాయకుడు. ఆయన 4 కాలముల వ్యాసము వ్రాశాడు. ఏమో వ్రాసాడు అని చదివాను. పూర్వము ఆయనా నేను చాలా close friends. ఒక చోట తిని, ఒక చోట వుండేవాళ్ళము. ఆయన వ్రాసారు. కథ అంతా పొంతము చదివాను. ఏదో కడప తాలూకాలో ఎవరో రెడ్డిగారు ఎక్కడో కొన్ని గొర్రెలు తీసుకొని దుర్మార్గం చేస్తున్నారని కథ. కథ బాగానేవుంది. అది సినిమాలకు తీసుకోడానికికూడ వీలుంటుంది. మంచి సినిమా డైరెక్టరు వుంటే దానిని తీసుకోడానికి వీలుంటుంది. వ్రాశాడు బాగానేవుంది. రెడ్డిగార్ని గురించి వ్రాశాడు. ఆ రెడ్డిగారి బంధువు పుల్లారెడ్డి, ఆ రెడ్డిగారికి బంధువు మల్లిరెడ్డట, ఇంకా ఆ రెడ్డిగారి బంధువు సంజీవరెడ్డి, వెంకట సుబ్బారెడ్డిగారట. ఈ విధంగాప రెడ్డికి, ఏ రెడ్డినైనా ముడివేయవచ్చు. గుంటూరులో వున్న రెడ్డికి బంధుత్వము కలుపవచ్చు. గాంధీగారికి కూడా బంధుత్వము కలుపవచ్చు అవకాశము వుంటే. దుర్మార్గము చేసినాడో లేదో నేను చెప్పలేను. ఈ తగవులో ఫిర్కా సెక్రటరీ పేరుకూడా తీసుకు వచ్చేరు. దుర్మార్గము చేసినవాడు రెడ్డి. ఆయన చెల్లెలును కమ్యూనిస్టు పార్టీ లీడరు అయిన రాజశేఖరరెడ్డికి ఇచ్చినారు. నాపైన వేసినారు.

**Sri T. Nagi Reddi:**—On a point of information, Sir, Sri Sanjeeva Reddi seems to have forgotten his own relationship. శ్రీనివాసరెడ్డిగారి భార్య రాజశేఖరరెడ్డిగారి అక్కగా ఉన్నారన్నది మంత్రిగారు మరచిపోయినారు. మల్లిరెడ్డిగారి పిల్ల సంజీవరెడ్డిగారి ఇంట్లోనే పెరిగిందన్న సంగతి మరచిపోయినారా.

